శా॥ రాగాలాపముల ద్రోసిపోయుచు మహాంభోధితజ్ఞావభూ
భాగుండై ప్రకృతిప్రభావగతి విధ్వస్తాంధకారుండునై
ప్రాగుత్కీర్ణ ద్విజదత్తజీవనఃఋణత్రాణుండు, భాస్వన్మహా
రోగవ్యాప్తిదనర్చుబిడ్డనికి నారోగ్యంబల్ల దేసోదరీ.

వసుమర్తి కృష్ణమూర్తి.




# కృష్ణవేణీపుష్కరము



మార్గావర్తితపాదుకా పశుపతే రంగస్య కూర్చాయతే
గండూషాంబునిషేచనం పురరిపోర్దివ్యాభిషేకాయతే
కించిద్భక్షితమాంసశేషకబళం నవ్యోపహారాయతే
భక్తిః కిన్న కరోత్యహో వనచరో భక్తావతంసాయతే.

—శివానందలహరి.

అహల్యాశాపవృత్తాన్తము నెరిగియున్నాముకదా! ఆసందర్భముననే పరవనితాసంగమునకై పాకశాసనుఁడును నీచశరీరుఁడై మరల గౌతమదయావిశేషంబున సహస్రాక్షుఁడగుటయు లోకవిదితమే. మరియు నీయింద్రుని మహాపాపమును దొలంగింప బ్రహ్మదేవుఁడు, పుష్కరుని నిర్మించెను. వెండియు నీపుష్కరుఁడు సమస్తతీర్థములకును రాజు. దేవజ్యేష్ఠు నాదేశానుసారమీ పుష్కరతీర్థరాట్టు స్వర్గమున గంగానదియందు నివసించుచుండును; కాని భూలోకమును గూడఁ బవిత్రముగఁ జేయు నుద్దేశమునఁ గొన్నికొన్ని సమయములయందుఁ గొన్నికొన్ని నదులయందుఁ గొంతకాలముండును. దేవగురుఁడగు బృహస్పతి, మేషాదిరాసులయందుఁ బ్రవేశించునపుడే, యీ పుష్కరుఁడును భూమికిదిగును.

గురుఁ డొక్కొక్కరాశియం దొక్కొక్కవత్సరముండును. ఇందు మొదటి పదిరెండు దినములును పుష్కరుఁ డా యా పుణ్యనదులయందుండును. తీర్థరాజగు నాతఁ డేనదియందుండునో ఆనదియం దాపదిరెండుదినములును, త్రిమూర్తులును వారి యిల్లాండ్రును, త్రింశత్కోటిదేవతలును, సప్తమహర్షులును, సర్వ నదులును, సాగరసప్తకమును, నిలచును. మరియు మూడుకోట్ల యేబదిలక్షల తీర్థములు సందేయుండును. నియమప్రకారము పుష్కరుఁ డా యా నదులలోఁ బదిరెండుదినములు మాత్రమేయుండి మరల దేవలోకమునకు బోయినను, ఈ దేవ

తాదులందరునుమాత్ర మొక్ష యోజ్ఞాదివరకు నుందురు.

భారతవర్షమున గంగ, యమున, సరస్వతి, నర్మదా, సింధు, కావేరి, గోదావరి, కృష్ణ, భీమ, రథ్య, భద్ర ప్రణీతలను పండ్రెండు నదులున్నవి. వీనికే పుష్కరము పండ్రెండేసుల కొకతూరి వచ్చుచుండును. క్రిందిచక్రమందు సక్రమముగా నీయబడిన విధమును దిలకించునది.




పుష్కరక్రమము

పురాణవిశిష్టమగు నాయర్థమటులుండ నింక మన సామాన్యలౌకికదృష్టితో నీతీర్థములను గూర్చి విచారింతము.

ఆర్యులు ప్రకృతిని బూజించి తద్వారమున మోక్షమును బొందుచుండువారనుట యిందలి పరమార్థముగా గ్రహించుట మరియొక ఫక్కి. ప్రకృతియం దీశ్వరుడును, ఈశ్వరునియందు బ్రకృతియు నున్నవికదా.

అదియటులుండ నింక సాధారణ దృష్టితోఁ జూచినను, ఇట్టి విశేషములవలన సామాన్యుల కెంతయో లోకజ్ఞానమబ్బుటకు నవకాశములున్నవి.

రైళ్లు మొదలగు సౌకర్యములులేని యాపూర్వకాలములయందు, నానారాష్ట్రముల

వారు నొక్క ప్రదేశమున, సంవత్సరమున కొక్కమారైనను, సమావేశమగుటయు, నన్యోన్యపరిచయముల గలిగించుకొని తమతమ దేశాచారాది విషయములను మాటాడుకొనుటయు, నిట్టి తీర్థప్రదేశముల యందు నెరవేరును. ఇట్టివి యీనాటి దేశీయ మహాసభలకుఁ బోల్పవచ్చును. శ్రీశివాజి మహారా జట్టితీర్థసమయములను రాజకీయ సాంఘికమతవిజ్ఞానపరివ్యాప్తికై వినియోగించుకొనుచుండెను. ఏయంశముం గూర్చియైనఁ బ్రజాసామాన్యమునఁ బ్రచారము సేయవలెనన్న నింతకంటె మరి మంచియదను లేదు. మరియును మతమే యాదికారణముగాఁగొని ప్రజ లిట్టి తీర్థసేవలఁ జేయువత్తురు. ఆవెనుక ప్రాపంచిక విషయములు. అవియు మతమువిూదనే యాధారపడి యుండవలయును. లేకున్నసామాన్యుల కవి తలకెక్కవు. అదియే జాతీయతాభావము. ఏవిషయములయందుగాని మతము పునాదియై యుండవలయును. ఈతత్త్వమే నేఁడు మహాత్ముఁడు దెలుపుచున్నదియును. మతమునకును రాజకీయమునకును సంబంధము లేదనువాదము ముమ్మాటికి నిరర్థకమే కాక యనర్థకముగూడ నగును. పరలోకభయమే ప్రజల నింతవరకుఁగూడ నడపించుకొని పోవుచున్నది, కాని రాజదండములుకావు. అవి యసామాన్య విశ్రుత ప్రవృత్తులకే పనికివచ్చును.

ఈతీర్థములకు లక్షోపలక్షలుగ వచ్చు ప్రజలలో నెక్కువమంది పల్లెటూళ్ళవారే. వారు చదువురానివారనియు మూర్ఖులనియు, చాదస్తులనియు నాగరకతావిశిష్టు లిష్టము వచ్చినట్లు నాక్షేపింతురుగాక! వారికేమి లోపము! దైవచిన్తనయుఁ బాపభీతియు సత్యదయలును గలవారు. ఇవియేగదా సమస్తశాస్త్రములను జదివి సంపాదింపఁదగినవి. అవిలేనినా డీచదువులు చాకింట వేయఁదగినవేకదా! అమాయికులగు నిట్టి ప్రజలకు, సర్వసంగపరిత్యాగులగు సన్యాసులు భక్తిజ్ఞానవైరాగ్యముల గూర్చియు, దేశభక్తులు దేశోన్నతిఁగూరిచియు సులభముగా నచ్చఁజెప్పవచ్చును. పరార్థపరులగు మహాత్ములయెడ వారికి సంపూర్ణవిశ్వాసము తోలకాడుచుండును. విశ్వాసము వారి సొమ్ము. కాఁబట్టి యిట్టివారి పూజలే యాపరమేశ్వరునకుఁ జెందుచుండును.

దేశారాధకుల మనుకొనుచున్నవారు, లెస్సగ యోచించి యీమహాతరుణమందు దేశాభ్యుదయము అట్టి యమాయికుల యోగక్షేమములపై నాధారపడియుండునను సత్యమును, దామెరిఁగి వారికి బోధింపవలసి యున్నది. అనేకసహస్రసంఖ్యాకులగు ప్రజలను దర్శించుమాత్రముననే పుణ్యమున్నదని పెద్దలందురుకదా! అట్టియెడ అంతమంది ప్రజలకై పాటుపడువా రెంతటి సుకృతులో యోచింపుఁడు.

ఒకవంక శ్రీమత్కనకదుర్గాంబాక్షేత్రమై, యింకొకవంక శ్రీమత్కృష్ణవేణీతీర్థప్రదేశమై యొప్పుచున్న విజయవాటిక యిప్పటున యథార్థముగ ముముక్షువులకు విజయవాటికయే. ఇట్టి యుత్తమప్రదేశ మాంధ్రదేశమున నుండుటంజేసి యాంధ్రులు ధన్యచరితులగుచున్నారు.

# లలిత గృహలక్ష్మి

శ్రీ ద్విడి శేష. వేంకటకాశీపతి గారు

సీ॥ ముద్దులమూటవై ముత్యాలసరమవై,
తేనియతేటవై తెలుఁగుబాస।
సేవఁజేయఁగనెంచి చిన్నారిపొన్నారి,
చిత్రంపుఁగథలతోఁ జెలువుమిగుల।
నబలామణులభావి యభివృద్ధిభావించి,
ప్రకృతకర్తవ్యమున్ బ్రచురపరచి,
మహనీయదీక్షతో మాపత్రమంబుగా,
సకలదిక్తటముల సంచరించి॥

తే॥గీ॥ బుధులమాశీస్సులనుబొంది పూర్ణకళల।
మూఢవిశ్వాసచ్ఛేదైకమూలసార।
పద్యగద్యాత్మకప్రభా భావకలిత।
లలితగృహలక్ష్మివై తమ్మ! రమ్యగతుల॥

# శ్రావణము

యర్రమిల్లి శివశంకరమూర్తిగారు

గీ॥ సంతసమున గృహంబులఁజక్క జేసి
మేల్మిరయా భూషణంబులు మేనదాల్చి
లలితశ్రావణవరలక్ష్మి రాకకోరకు
ప్రీతితోడను యువిదలు వేచియుండ

సీ॥ మోవిపై మెరపుల మొలకనవ్వెంతయు ధవళంపుకాంతులఁదళుకులొత్త
భుజమునమొయిళుల ముంగురులెంతయు నిగనిగలాడుచు నీటుగొల్ప
తనువునిండినపూలు తనదగుసొగసుకు మిఱ్ఱుమిఱ్ఱుమటంచు మేలుఁగూర్ప
ఫెళఫెళలాడుచు భీకరధ్వనులంత తేరుపర్విడి వచ్చుటీరుతోప

తనదురాకకై జూచెడు తలిరుబోండ్ల
కోరికల్ దీర్పగాబోలు చేరవచ్చె
ననుచువసుధయందలిప్రజ లలరుమాడ్కి
మరలనేతెంచె శ్రావణమాసలక్ష్మి

సీ॥ నీళ్లొత్తిసవరించి నిడుదలౌకురులను చక్కనౌరీతి కీల్జడఘటించి
బాలచంద్రునిబోలు ఫాలభాగంబున పొలుపుగాఁగుంకుమబొట్టుదీర్చి
పాదపద్మంబులపై బడి జీరాడు పైడంచుఖద్దరు వలువగట్టి
సహజకాంతులగడుసౌరభిల్లుచునున్న రమ్యమౌఖద్దరు రవికదొడిగి

లక్ష్మిపూజించి భక్తితో నక్షతలను
శిరమునందునధరియించి చెలులఁగూడి
వాయనంబులఁగొనిరాగ పరమప్రీతి
వీథివీథికిపోదురు వెలదులెల్ల

గీ॥ భూషణోపేతలై జను పూవుబోండ్లు
మరునిరాచిల్కలనుమాడ్కి మదినిదోచు
సౌఖ్యకరమగు శుక్రవాసరమునందు
భద్రముల్ కూర్చు శ్రావణమాసమునను

# కృష్ణాపుష్కరమ్

బ్ర॥ శ్రీ॥ సోమయాజుల వేంకటాచల శాస్త్రిగారు

శ్లో॥ భక్తజనచాతకానాం, భాగ్యం చిరసంచితంహి పరిపక్వం।
కృష్ణాపుష్కరమధునా, సమాగతం కృష్ణమేఘఇవ॥

భక్తభ్రమరాః! శీఘ్రం, ప్రబుధ్యతో త్తిష్ఠత త్వరధ్వమిహ।
పుణ్యం మకరందమిదం, సంచినుతాస్మిన్ సుపుష్కరేమహతి॥

కతిచనధార్మికముఖ్యాః, కృష్ణాంతాం సర్వతీర్థసలిలయుతాం।
కృష్ణా! ప్రసీదమామితి, అవగాహ్యపాపాంహి పావయంతితనుం॥

కతిజనజపంతిమంత్రాన్, కతిచనదేవంస్తువంతి సమయేస్మిన్।
కతిచనభక్త్యావిష్టాః, కరితురగాదీంశ్చ దదతిపాత్రేభ్యః॥

కృష్ణాపుష్కరసమయే, కృష్ణామవగాహ్య కృష్ణమవధూయ।
కృష్ణాద్వైతంకతికతి, కృష్ణాహంభావినః ప్రపద్యంతే॥





# సేవామార్గము

శ్రీమతి బి. లక్ష్మీవెంకాయమ్మగారు.

తారాదేవి దుర్గాపూజాపరురాలు. ఆమె అన్నాహారములను విసర్జించి ఎండురొట్టెలను తినుచు కాషాయవస్త్రములను ధరించుచు సకలాలంకారములును విడనాడి భక్తిశ్రద్ధలతో దుర్గాదేవి నారాధించుచుండెను. ఆమె శరీరము కృష్ణపక్ష సుధాకరునిమాడ్కి క్షీణించుచుండెను. ప్రజలందరామెను ఉన్మాదినియని భావించుచుండిరి. జననీజనకులామెను రాతిబొమ్మలను పూజించుటవలన ప్రయోజనములేదనియు పెండ్లాడి సుఖించవలసినదనియు నిర్బంధపెట్టసాగిరి. కాని ఆమె చలించక నిశ్చలమైన మనస్సుతో దేవిని ధ్యానించుచుండెను. ఇవ్విధంబున పన్నెండు సంవత్సరములు గడచుసరికి దేవి ప్రసన్నచిత్తురాలాయెను. నిశీథసమయము. దుర్గామందిరములో దీపము దేదీప్యమానముగ వెలుగుచుండెను. పాషాణవిగ్రహమగు దేవీమూర్తియందు చలనము కన్పడెను. మందిరములో సుగంధము వ్యాపించెను. జగజ్జననియగు దుర్గాదేవి జ్యోతిర్లతవోలె తారాదేవికి సాక్షాత్కరించెను. కరుణారసమొలుక చిరునవ్వుతో దేవి తారను వరములను కోరుమనెను. తార హర్షముప్పొంగ దేవికి సాష్టాంగనమస్కారమాచరించి సకలైశ్వర్యములను జగన్మోహనమైన రూపమును ఇమ్మని కోరెను. దేవి చిరునవ్వుతో తార కోరిన వరములనిచ్చి అంతర్ధానమాయెను. సూర్యోదయమున తార లేచి చూచుకొనుసరికి ఆమె శరీరము మెఱుపుతీగవోలె ప్రకాశించుచు నవరత్నహారములతో నలంకరింపబడియుండెను. ఆమె సౌందర్యమునుజూచి అనేకమంది రాజులు మోహించిరి. ఆమె వారిని పరిణయమాడనొల్లక బ్రహ్మచారిణిగానేయుండెను.

తార బాల్యమునుండియు తనకైశ్వర్యము లభించినప్పుడు జననీజనకులను సోదర సోదరీమణులను తీసుకువచ్చి వారి సేవ జేయవలయునని సంకల్పించుకొనియుండెను. ఇప్పుడు ఆమె ధనగర్వమువలన వారిని మరచిపోయెను. చూచితిరా ధనప్రభావము! ఆమె ఒకరోజున ఉద్యానవనవిహారమునకై సఖీపరివృతయై బయలుదేరెను. వనమంతయు సుగంధపుష్పములతో నిండియుండి పక్షులయొక్క కిలకిలారవములతో వింతగొల్పుచుండెను. తార పుష్పములు గోయుచుండగా మనోహరమగు వీణాగానము వినుపించెను. వనమంతయు వెదకగా స్ఫటికశిలామంటపమున కూర్చుండి కాషాయవస్త్రములు ధరించి శరీరమునవిభూతినలంది చేత వీణెందాల్చి మనోహరముగా గానమొనర్చుచున్న యౌవనుడగు సాధువు కాన్పించెను. అతని వీణాగానమునకు తన్మయత్వమునొంది పక్షులన్నియు సంచారములేక నిలచియుండెను. తార సాధువుగానమునకు రూపమునకు ముగ్ధురాలై సాష్టాంగనమస్కారమాచరించి తన్ను వివాహమాడవలసినదనియు తనయొక్క సకలైశ్వర్యములను సౌందర్యమును సమర్పించెదననియు ప్రార్థించెను. సాధువు

తన కైశ్వర్యములతో నిమిత్తములేదనియు వివాహమాడ నొల్లననియు చెప్పి వెడలి పోయెను. తార తనకు సకలైశ్వర్యములు సౌందర్యము ఉన్నప్పటికికూడ సాధువు దృష్టియందుమాత్రము ఇంత నీచముగా ఉంటినని విచారించెను.

ఆమె గర్వమంతయు పటాపంచలై పోయెను. ఆమె హృదయపీఠికయందు సాధువు గానమును రూపమును చిత్రింపబడెను. తార దుర్గామందిరమునకు వెళ్లి దేవిని పూజించి, తల్లీ, జగజ్జననీ, త్రిలోకేశ్వరీ మాతా! నా కైశ్వర్యములతోను సౌందర్యముతోను నిమిత్తములేదు. మనోహరుడగు సాధువుయొక్క ప్రేమమాత్రము లభ్యమగునటుల అనుగ్రహించవలసినదని ప్రార్థించెను. దేవి తారయొక్క కోరికకు చిరునవ్వు నవ్వి ప్రేమ, సేవజేయుటవలన లభ్యమగునని చెప్పి అంతర్ధానమాయెను. తార తక్షణమే అమూల్యాలంకారములను విడచి కాషాయవస్త్రములు ధరించి యోగిని సేవించుటకై బయలుదేరెను. పర్ణశాలలో యోగినిగాంచి హర్షముప్పొంగ భయభక్తితో సేవజేయ నారంభించెను.

ఆమె అరణ్యమందలి మృగములకుకూడ సేవజేయుటవలన అవియన్నియు ఆమెయందు వినయవిధేయతలు గలిగి వర్తింప సాగెను. ఆమె సాధువుదగ్గరకు ఔషధములకు వచ్చు రోగులకు పరిచర్యలు చేయ సాగెను. తార తన జీవితమంతయు సేవామార్గముననే గడప నిశ్చయించెను. ఒక నాటి సాయంకాలమున తార చెట్టుక్రింద నిల్చుండి లేళ్లకు మేతపెట్టుచుండెను. ఆ సమయమున సాధువువచ్చి ఆమెను క్షమార్పణకోరి 'నీయొక్క ఐశ్వర్యమునకు సౌందర్యమునకు వశుడనుకాని నేను ఇప్పుడు నీయొక్క సేవకు వశుడనైతిని. నీ విదివరలో కోరిన కోర్కెను నెరవేర్చుట కిప్పుడు సిద్ధముగానున్నాను. నిన్నుగురించి తపో వ్రత నియమములన్నిటిని వదలివేయ సంసిద్ధుడనై యున్నాను. మనమిరువురము పరిణయమాడి సకలైశ్వర్యముల ననుభవించుద'మని చెప్పెను. తార సాధువు చరణములకు సాష్టాంగనమస్కారమాచరించి, 'జనకా నేనిప్పుడా తుచ్ఛపువాంఛను కోరుటలేదు. సర్వజనులకు, పశు, పక్షి మృగములకు సేవజేసి ఆనందించెదను. నా జీవితమంతయు పరోపకారార్థమై వినియోగించెద'నని చెప్పెను. సాధువు ఆమెకు జ్ఞానోదయమైనదని సంతోషించెను. తారాదేవి వివేకమునకు సంతోషించి కల్యాణదాయియగు దుర్గాదేవి ప్రత్యక్షమై తారను గాఢాలింగనమొనర్చుకొని 'బిడ్డా! నీ వివేకమునకు సంతసించితిని. సర్వమార్గములలోను సేవామార్గమే సర్వోత్తమమైనది. ఎవరైతే పరోపకారార్థమై జీవితము వినియోగించెదరో అట్టివారికి ఇహపరలోకములందు కీర్తి గల్గును. సర్వేశ్వరుడు సంతోషించి మోక్షము నిచ్చును' అని చెప్పి దేవి అంతర్ధానమాయెను. తారాదేవి సేవామార్గమునే అవలంబించెను.

# పుష్కరావతరణము

పాలెపు వేంకటరత్నంగారు

౧

ప్రదేశము–గౌతమాశ్రమ ప్రాంతము : కాలము–అర్ధరాత్రము : కృతకకుక్కుటారావము వినబడును. కుటీరములో గౌతముడు.

ఓయహల్యా ! యహల్య ! యోయువిద ! లేచి
నాకమండలువును దెమ్ము నాతి! స్నాన
మునకుబోవలె, వినుమదే పువ్వుబోడి
కొక్కొరోయనికూసెను కుక్కుటంబు.

ఆమె లేచినది

స్వామిగైకొనుఁడిదెమీదుశాటియునుక
మండలువుక్షమియింపుఁడీ మగువతప్పు

ఆతఁడు

ధర్మబుద్ధినీఁజరియింపు తరుణి, యిపుడె
స్నానమొనరించివచ్చెద సత్వరముగ

(వెడలును)

అహల్య

ఒంటరిగ కుటీరంబున నున్నయపుడు
జపముచేసికొమన్నారు స్వామివారు.

(ధ్యానించును)

ప్రవేశము ఇంద్రుఁడు గౌతముఁడై :

ఓయహల్యా ! యహల్య ! యోయువిదలెమ్మ
యేలజపములు స్నానములేలమనకు

అహల్య (సిగ్గుతోఁ దలవంచి)

యెపుడుపలకనివాక్యము లేలనిపుడు
పలుకుచున్నారువింతగా స్వామివారు ?

ఆతఁడు

మదనునారాచములు నాదుమదినినాటి
నను మరలఁ గొనివచ్చెనే నాతియిపుడు

౨

నదియొడ్డున గౌతముఁడు.

రాత్రి రెండుజాములను మీరంగలేదు
మోసమొనరించెనెవ్వఁడో మూర్ఖుఁడిపుడు
మత్పరాయణచిత్త నామగువపర్ణ
శాలలోనెంతలేసి బన్నాలపడెనొ
(తొందరతో నిష్క్రమించును.)

ద్వారమున నిద్దరుగౌతములు.

ఋషి.

ఓరిమూర్ఖా! మునిద్రోహి! దొంగ యింద్ర!
యెంతపనిచేసినావురా యిపుడునీవు!

ఇంద్రుఁడు (సాగిలపడి మ్రొక్కి)

తప్పుచేసితి చెనటినో తాపసేంద్ర!
యిచ్చవచ్చినరీతి శిక్షింపుమయ్య!

ఋషి. (కోపముతో)

దేనినాశించియిట కరుదెంచినావొ
యవ్వినీదేహమందెల్ల నమరుగాక!
అమరలోకపాలనకు ననర్హుఁడవయి
పోయెదవుగాక! పొమ్మిక బుద్ధిహీన.
(ఇంద్రుఁడు తలవంచుకొనిపోవును)

ప్రదేశము—స్వర్గప్రాంతము: ప్రవేశము—వికృతాకారుఁడు బలారి.

యెటులస్వర్గసీమనుజొత్తు నెటుల నాశ
చీరమణిమోముఁగాంతును? ఛీ నికృష్ట
రూపమున నేకరణి నమరులకనులను
బడెద? నమరత్వమున మేనుబాయరాదు.

ఆకాశవాణి

సురపతీ! దేవనదిని పుష్కరసమాఖ్య
తీర్థరాజొకఁడున్నాఁడు, దివ్యశక్తి
నీదుదుర్భరాఘంబు లన్నియునడంగు
నతనియందీవుతానంబు లాడితేని?

ఇంద్రుఁడు

బ్రదుకంజీవుఁడా దొరకెనుపోదుమిపుడు

పుష్కరునికడ కేగి

తీర్థరాజ! పుష్కర! నమస్తే మహాత్మ!
పారదోలుమునా ఘోరపాతకమును

(మునక లిడును)

పుష్కరుఁడు ప్రత్యక్షమై

అతిపవిత్రుఁడవిపుడు స్వర్గాధినాథ!
మర్త్యలోకంబులోనున్న మనుజులెల్ల
పరమహేయస్వభావులై పరగుచుండ్రు
గాన గంగాదినదులలోఁ గలియుచుండు
మొక్కొకమహానదిని నీవొకొక్కమారు.

(నిష్క్రమించును)

ప్రవేశము—కృష్ణానదీతీరము: ప్రవేశము—పుష్కరుఁడు.

భరతవాక్యము

ఇంద్రునానతిఁబొంది యేతెంచినాను
కృష్ణవేణిరో! భూజనకిల్బిషముల
నెల్లహరియింతుని త్తరి నెవరుభక్తి
తోడనీయేఁకునీయందు దోఁగువారో.



## మంజీరము

కొమ్మనమంచి జోగయ్యశర్మగారు

సీ॥ సెలయేటియినుకతిన్నెల విశ్రమింపనాదరినిల్చిప్రేమ గీతములఁబాడు
నారామవాటీవిహారంబొనర్పఁగా నుబికిభావంబునుబ్బూఁతలూఁచు
భ్రమరంపుమంగళారాత్రికల్వనినంత హృదయానఁబొడమిస్వనించుచుండుఁ
దనివారఁబికపాళిధవళమ్ములాలింపఁగెరలి కర్ణములగింగురులుబెట్టు

తే॥ గీ॥ ప్రకృతిసౌందర్యశాంత ప్రపంచసీమ
భావవీణియనవరించి పాడుకొనఁగఁ
గమ్రుభంగులఁదాళ సంగతులుగూర్చు
చెలియ తావకపాదమంజీరరవము.

# అభినందనము

వి. అయ్యావు రెడ్డి గారు

తే॥ ఆంధ్రమహిళల యున్నతికానపడదు
కడపజిల్లాయటంచను గడుసుపల్కు
నన్ృతముగఁజేసెగాదె నీయమితజయము
కోటిరెడ్డిసతీమణీ! కొనుమునుతులు.

తే॥ సాంద్రతరకీర్తి కే. రామచంద్రరెడ్డి
కడుపుచల్లగ జన్మించిగౌరవంబు
ఖ్యాతియలరంగ నంది తధ్యక్షపదవి
ఎడ్యుకేషనుకౌన్సిలం దెసగశుభము.

తే॥ మండలంబుననెందరో మాన్యలుండ
వారిసందరిఁగాదని వయిన మెప్ప
యిరువదేశులయిాశున నిట్టిపదవి
యబ్బనీ కన్నమదిఁగల్గు నబ్బురంబు.

సీ॥ కోటివరాల్ సేయు కోట్రెడ్డిగారిని। భర్తగాఁబడసిన పడతియామె
సంగీతశాస్త్రాది సాహిత్యవిద్యల। నారతేరినయట్టి యతివయామె
మున్సిపల్ మెంబరై ముదమొప్పజనులకు। సతతోపకారముల్ సలిపెనీమె
అమరావగా తరంగార్భటిన్ హసియించు। వాక్శక్తిగలయట్టి వనితయామె

తే॥ అనుచునిన్గాంచి ప్రజ లాడుకొనెడిపల్కు
లాలకించిననామది డోలలాడె
విపులసంతోషసాగర వీచిపైన
శుభగుణకదంబ శ్రీరామసుబ్బమాంబ.

సీ॥ కలిమిచేఁజెలిమిచేఁ గడువాసిఁగాంచియు। హితులొసరించెడి నుతులఁగొనుము
భక్తిచేరక్తిచేఁ బరిచర్యఁగావించి। ఆత్మేశుమదిలోన నలరుమెపుడు
మమతచేసమతచే మతభేదమెంచక। అమితమౌసత్కీర్తి నవనిఁగొనుము
ప్రియముచే నయముచేఁ బ్రీతులఁగావించి। గురుజనంబులప్రేమఁ జూరఁ

తే॥ పుత్రక్షేత్రసుమిత్రాది భూరివిభవ గొనుము
మాయురారోగ్యసంపద లతిశయిల్ల
సంతసంబునటీచర్లు సంస్తుతింప
విద్యకధికారపదవిని వెలయుమమ్మ

# ఫోటోగ్రాఫు

శ్రీమతి రత్నావళిగారు:

౧

"ప్రభా!" అని పిలిచాడు ప్రసాదరావు సావిట్లో బూటువిప్పుతూ. ప్రభావతి లోపల 'రెంకిపాటలు' పాడుకుంటోంది సన్నని గొంతుకతో. ప్రసాదరావప్పుడే వచ్చాడు కాలేజీనించి. ప్రభావతి నవ్వుతూ యెదురుగా వచ్చింది పాటలుపాడుతూ.

సల్లన్ని యెన్నెట్లో సాపేసికూకుంటె
ఒట్టమ్మ నావొల్లు ఉలికులికి పడతాది
నన్నిడిసి పెట్టెల్లినాడే
నారాజు
నిన్న తిరిగొస్తనన్నాడే.

"ఓహో రాణీగారు, ఉషారుగా ఉన్నారీవేళ. సిద్ధంగా ఉండాలి. బలరామ్ 'కెమెరా' పట్టుకొస్తున్నాడు. తప్పదింక."

"అబ్బ! పోనిస్తురూ, ఫోటోలు గీటోలూను. రోజా యిదే తగాదా. నేనేమో పల్లెటూరుదాన్ని. నాగరికతాలక్షణా లింకా పట్టుపడలేదు. నేర్చుకొంటున్నా నొక్కొక్కటే. కష్టపడి నేర్పారు రెంకిపాటలని. అవి పాడుకుంటున్నా నిప్పుడే."

ప్రభా! యెల్లాగ నేర్చుకోకపోతే? నేనేమో బి.యే., యల్.టి. పేసయినవాణ్ణి. కాస్తో కూస్తో ఉద్యోగం చేస్తున్నాను కాలేజీలో. కొంచెం సాగ సరివని పెళ్లాడాను పల్లెటూరిదానివైనా. కొంచెం తెలుగు చదవడం నేర్చుకున్నావు నీ పుణ్యమా అంటూను. చూడు నీచేత యిల్లాంటి ఇంగ్లీషు పేపర్లు కూడా చదివించకపోతే కొన్ని నెల్లల్లో" అని చేతిలో 'హిందూ' పేపరు పడేశాడు.

ప్రభావతి కాగితాలు తిరగేస్తోంది. చూస్తూ చూస్తూ "ఇదేమిటండోయ్, వీళ్లెవళ్లు!" అని ఒక ఫోటో చూపించింది.

"ఆయన ఒక పెద్దఉద్యోగస్థుడు. ఆవిడ ఆయన భార్య" అన్నాడు ప్రసాదరావు.

"వీళ్లు దీనిమీద కెల్లాగొచ్చారు."

"వాళ్లు ఫోటో తియ్యించుకుని పేపరుకి పంపారు."

"ఇదేమిటి, సిగ్గులేదు? మొగుడు పక్కనినుంచుంటే తను కూచుండేం కుర్చీమీద మొద్దులాగ? ఇదేమిటి ఫోటో ఫోటో అంటున్నారు రోజా? నాకొద్దు బాబూ అయితే ఫోటో."

ప్రసాదరావుకి నవ్వొచ్చింది.

౨

"ప్రభా! నాకు కాలేజీ టైమయిపోతుంది. చప్పున రావాలి."

"ఇదిగో ఇంక రెండే అతుకులున్నాయి. కొంచెం ముదురుగా ఉన్నాయండీ.

ఇంకా లేతమోదలుండవు మార్కెట్టులో?"

"ఉండకేం, Trade Deppression."

"అంటే."

"వర్తకమందం."

"రెండు సమానంగానే తెలిశాయి లెండి."

"ఓహో! ఇలా చూడు!"

"అబ్బ చాల్లెద్దురూ! మాబాగా అయిందిలెండి. ఆ మీసాలనిండా కాటికే."

"సరేగాని ఫోటో మాటేం చెప్పావు? నిన్న వృథాగా తిరిగిపోయాడు బలరామ్. బండి అద్దె దండుగ మనకి."

"ఫోటోగ్రాఫా! అలా అయితే తియ్యించుకోను బాబూ. బొత్తుగా సిగ్గులేకుండానా?"

"అలా ఒద్దులే. నే చెపుతాగా! యేం ప్రభా?"

"ఏదో ఆలోచిస్తాను గాదూ."

"అదిగదీ దారి!" గుమ్మందాటాడు.

౩

"ప్రభా!"

"యేమండీ."

"పాకం వొచ్చిందా?"

"మెల్లిగా అడుగుదురూ? యెవరేనా వింటే నవ్వుతారు."

"ఎందుకు నవ్వుతారు? ఏమేనా అక్షరాలు గుర్తుపడుతున్నావా?"

"ఓ! పేపర్లో Headingలు కూడపలుక్కుంటున్నాను."

"ఇంకేం, మరి ఫోటోమాట."

"అబ్బ, సరే అలాగేలెండి. కాని పేపర్లో ఫోటోలాగమాత్రం నే తియ్యించుకోను."

"అలావొద్దులే. రమ్మన్నా బలరామ్‌ని ఈవేళ?"

"సరే లెండి."

"ఆల్ రైట్! ఏదీ..........."

"యేమిటండీ."

౪

"బలరామ్! యెలాగోయ్ తియ్యడం ఫోటో? మాఆవిడ నేచెపితే నమ్మడంలేదు." ప్రసాదరావు సంజ్ఞచేశాడు.

"నిజమేనండమ్మా. ఈ కెమరా ఈ చట్రంమీద నుంచి తీసేటప్పుడే ఫోటోపడుతుందండి" అన్నాడు బలరామ్.

ప్రభావతీ ప్రసాదులు డ్రెస్సయ్యారు నీటుగా. పల్లెటూరు భార్యను 'ఫాన్సీలేడి'ని చేశాడు ప్రసాదరావు.

బలరామ్ కెమరా అమరాచ్చడు. కుర్చీఒక్కటే ఉంది.

"ప్రభా! కూర్చో!" అన్నాడు ప్రసాదు.

"అబ్బా, నాకు తెలుసుగా మీమెత్తులు. నే కూచోను."

"అదికాదు. ఇప్పుడు బొమ్మ పడదుకామా? నేనూ కూచుంటాను యేదోయ్, వీరాస్వామీ కుర్చీ?"

ప్రభావతి చీరసద్దుకుని కూచుంది కుర్చీలో. ప్రసాదరావు చిరునవ్వుతో నించున్నాడు కుర్చీపట్టుకొని. బలరామ్ తెలియకుండా నవ్వుతున్నాడు. 'కమెరా' స్వయంగానే expose చేసుకుంది. అది Automatic self-exposer.

వీరాస్వామి కుర్చీ తెచ్చాడు. "రండి" అంది ప్రభావతి. ఇద్దరూ చెరోకుర్చీలోను కూర్చున్నారు. బలరామ్ కెమెరా రెండుమాట్లుతిప్పి Remove చేశాడు.

"చాలా బాగుంటుందండీ ఫోటో."

ప్రభావతి లోపలికెళ్లింది.

బలరామ్‌కీ నవ్వాగలేదు. ప్రసాదరావుకీ నవ్వాగలేదు.

౫

"ప్రభా!"

"ఏమండీ."

"ఎందాకా వొచ్చింది యింగ్లీషుచదువు?"

"పెద్ద పెద్ద పంక్తులు చదివేస్తున్నా."

"అబ్బో యింకనేం. అయితే యిదిగో నీకు Present క్రొత్త Magazine."

ఆనందంతో చూచింది ప్రభావతి.

మొదటే వాళ్ల ఫోటోఉంది. పేపర్లోలాగే. కించిత్ పరిజ్ఞానంతో యిలా చదువుకుంది.

Neo Magazine
Mr. & Mrs. Editors
Prabhavathi and Prasada Rao.

నవ్వుతున్న కళ్లతో చూచి అంది భర్తత

"ఎంతటివారండీ."

"ఏమనుకున్నావు. రేపు బెజవాడలో s
చెయ్యాలిది."

"అవును పుష్కరాల్లో 'అమ్మాలి' కాదూ?"

"ఎంతటిదానివే."

# హిందూసుందరి

కర్లపాలెం కృష్ణరావుగారు

రాజాధిరాజు ముద్దుబిడ్డవు, అతిసుకుమారవతివి, అమితలావణ్యవతివి,— నీహృదయము నవనీతకోమలము, ఆకార మానందప్రదము.

* * * * *

అతడి కేలడానికి రాజ్యంలేదు, ధరించడానికి దువ్వలువలులేవు, కను సన్నలమెలగడానికి సేవకులులేరు, వీటిఅన్నిటి కేమిగాని, "అల్పాయువు" విన్నంతనే గుండె బ్రద్దలవుతుంది.

* * * * *

తల్లి దండ్రులు తగదన్నారు, బంధువులు వలదన్నారు, చెలికత్తెలు శిర మూపారు.

ఎంత సాహసము ? సుందరీ ! ఎంతటి మనోనిశ్చయము ? అక్రమమునకు వెఱచి, అధర్మానికి లోబడక, నిజమనోనాయకుని అల్పాయువునా పరిణయ మాడితివి ?

* * * * *

దినములు లెక్కపెట్టుచూ, ఆత్మశక్తిని వృద్ధిజేసుకొనుట, కనివిని యెఱుగని యమధర్మరాజును జూచుటకా ? ఆహా ? తపోమహిమ !

* * * * *

మహాభయంకరములు సింహశార్దూలాది క్రూరమృగాలు దిరుగు దుర్గ మారణ్యలు దాటి, బుసలుగొట్టుచువచ్చే త్రాచుబాములను తప్పించుకొని, భీభత్సమునకాలవాలమగు వైతరిణీనిదాటి యమలోకానికేగుటా ?

ఇవన్నీ ఒకయెత్తు,

రుద్రమూర్తియగు యముని, చండశాసనుడగు యముని, నీతపోశక్తిచే పాతివ్రత్యమహిమచే, గడగడలాడించి, ప్రాణపతిని సంపాదించు టొకయెత్తు, సుందరీ ! ధన్యచరితవు. నీశక్తి సామర్థ్యాలు వర్ణనాతీతములు.

* * * * *

ఇట్టి లలనారత్నములున్న, భరతమాత కేమిలోటు ? మే మెందుకు గర్వపడకూడదు ?

# మా ధ వు ని మం ద లిం పు

వసుమర్తి కృష్ణమూర్తిగారు

మ॥ అదియట్లుంచుము పార్థ బుద్ధికిదురూహ్యం; బిట్టులంజూడు నీ
మదినేమైనఁదలంచితే స్వకులధర్మంబున్? మహారాజ్యసం
పదయో స్వర్గనివాసమో పరమధర్మ్యంబైన యుద్ధంబునం
గద చేకూరునుమీకు: రాజులకుయోగ్యంబైన సకర్మంబిదే.

చ॥ కడుఁగడుధన్యజీవనులు గారొకొ రాజులు? చిన్నయీతపం
డిడియొక తాటిపండునుగడింతురు చూడుము దేహ మాజిలో
విడచి బిరానఁజొత్తురు దివిన్; మరిరారటనుండి! కష్టముల్
పడిపడియిష్టకోరుకొనువారికి లేదది యింతసూటిగా.

ఉ॥ కావుననీవుధన్యుఁడవు కాలికిఁజిక్కెసమందువే రిదే
త్రావుమునీకుఁగల్గునమృతత్వము; లెమ్మికనేప్పమానిగాం
డీవముఁజేతఁబూనుమువడిన్ మరియట్లులఁజేయకుందువా
పోవునుగీర్తిధర్మములు బూడిదపాలయి: పాపమబ్బెడిన్.

శా॥ అంతేనా? అపకీర్తియీపుడమిలో నాచంద్రతారార్కమౌ
"కుంతీదేవికిఁబట్టెగొడ్డరికమే కొండంత మేలిట్టిదు
స్సంతానంబునకంటె"నంచుయువతీసంతానముల్ సవ్వరో
యంతల్ సేసినమేరుధీరునకునీకా నింద! చారాదొకో.

మ॥ వినఁగానేమనుసవ్యసాచివను నీవిఖ్యాతనామంబు నే
జననాథుల్ పరువెత్తుచుండిరొకఁటన్ శ్వాసంబులంబట్టి యా
ఘనులేవా రరుగో మహారథు లయోగాండీవియేమోయటం
చనుకొన్నారమె మమ్ముఁజూడఁగనె యారా పారినాఁడందురే.

చ॥ పదఁపడినావు ఖాండవముభస్మముసేయవె? మూడుకన్నులవాఁ
డెదురయినన్ వహావ్వయనిపించుచు నాతనిచేతిమన్ననం
బొదలవె? మన్నుగొట్టుకొనిపోవునవన్నియు నింకదిట్టలె
వదరుదు రెన్నియే నెదిరిదివారది పీకులవిందె యర్జునా.

మ॥ అతివాదంబనియెంచఁబోకు మొకముఖ్యాంశంబువాక్రుత్తుఁజ
చ్చితివా నీకిఁకజన్మలేదు: సురసంసేవ్యుండవై యుందు; గె
ల్చితివా నిస్తులరాజ్యభోగముల నోలింగొందు; కాఁబట్టి నం
స్కృతబుద్ధిన్ మరిలెమ్మువై రిజనవిచ్ఛేదంబుఁగావింపఁగన్.

# వధూవరులు

దామెర రాజగోపాలరావు గారు

౧

ఈ మధుమాస నిశీథమున,
ఇరువురు కలసికొని రేకముగా
ప్రేమ ప్రశాంత నిశాంతమున,
ప్రేయసీ ప్రియతము లేకతమున్;

౨

అంచితగతి తెరచిరి,సుప్త
హాటక క్రమ కవాటములున్;
మించులవలె మెఱయు చుండిరి,
మిలమిలమని కాముకు లిరువురున్;

౩

ఓ విజన విభావరీ, యిటు
ఒకపరి పరికింపుము సొంపుగా,
తావక మనోహర నీరవ
తారా విమలవీక్షణ వితతిన్!

# మా కమల పెండ్లి

శ్రీరంగం జగన్నాథంగారు

౧

బారిష్టరు నారాయణమూర్తిగారు అక్కడ ప్రాక్టీసు చేసుకొనుచుండిరి. వారిది చాలా పెద్ద మేడ. ఆవీధిలోనే యున్న రామశాస్త్రిగారికిన్నీ వీరికిన్నీ చాలా పరిచయ ముండడంవలన రెండు కుటుంబముల వారును చాలా స్నేహముగానుండిరి. బారిష్టరుగారి కూతురు శేషమ్మకు, రామశాస్త్రిగారి కుమార్తె కమల అరప్రాణం. "మల్లెపువ్వులు చూద్దాము మా పెరటికి రావమ్మా శేషూ" అంటే, "పొగడపువ్వు లేర్దాము మా పెరటికి రావమ్మా కమలా," అని ఇద్దరూ మాట్లాడుకునేవారు. బాలికాపాఠశాలలో కమల కన్నా తెలివైన పిల్ల లేరనేవారు.

"రమణమ్మగారూ! మా కమల, రత్నంలాంటిపిల్ల సుమండీ" అని ఇరుగుపొరుగు వారన్నప్పుడు ఎంత సంతోషం కలిగినా రమణమ్మ నవ్వుతూ "మా కమల పట్టివెర్రిపిల్ల" అనేది. శేషమ్మ చాలా విద్యావతి కాదుగాని, గొప్ప దయార్ద్రహృదయ. ఒకసాయంకాలం కమల శేషమ్మ చేయి పట్టుకొని "శేషూ! మన ప్రేమబంధం మన వివాహములతో తెగిపోతుంది కదూ" అని ఎంతో విషాదముతో అన్నది. కమలా శేషమ్మలు ఒకరినొకరు కౌగలించుకొని వెక్కి వెక్కి ఏడ్చిరి. కొంతసేపయిన తరువాత శేషమ్మ సంతోషముగా "కమలా! మన ప్రేమబంధం తెగదు. మరచిపోయినావేమో నీవు..." అని ఏమో చెప్పబోగా, కమల ఆమెను మరి మాట్లాడనియ్యకుండా ఒక్క ముద్దుతో ఆమె నోరు మూతవేసెను.

౨

ఆదివారం. బారిష్టరుగారి సతి పార్వతమ్మ, కమల, శేషమ్మ, వీరుముగ్గురు మేడగదిలో ఆనందముగా మాట్లాడుకొనుచుండిరి. శివాజీ, దయానంద సరస్వతి మొదలగు మహాపురుషుల చిత్రపటములతో ఆగది అలంకరింపబడియుండెను. టేబిలుమీద చిత్రవిచిత్రవర్ణములుగల ఆకులతో చేర్చి కట్టబడిన పూలగుత్తులు వానికై ప్రత్యేకముగా చేర్పడిన గాజుసీసాలలో ఉంచబడెను. ఆపువ్వులు, ఆకులు, బారిష్టరుగారి పెరటిలోనివైనను, వానినెంచి, అందముగాకట్టి, అమర్చిన రచనాచమత్కృతిమాత్రం కమలదే. పార్వతమ్మ "చూడవే శేషూ! కమల నేర్పు. ఎంత చక్కగా పూలగుత్తులు కట్టిందో" అన్నది. శేషమ్మ కమలవైపు పెంకితనముతోను, నవ్వుతోను కూడుకున్న ఓరచూపొకటి విసిరింది. ఇంతలో ఇంటిముందు మోటారాగినది. కమల శేషమ్మ చెయ్యిని గట్టిగా పట్టుకున్నది. బారిష్టరు నారాయణమూర్తిగారున్నూ, ఒక యువకుడున్నూ మేడమీదికివచ్చిరి. పార్వతమ్మ ఆకుర్రవాడిని కౌగలించుకుని ముద్దుపెట్టుకున్నది. అతడు ఆమెకొడుకు విశ్వనాథం. ఇంగ్లాండులో చదువుకొనుచు స్వదేశం వచ్చినాడు. ఆనందంవల్ల కలిగిన ఆందోళన తగ్గిపోగానే పార్వతమ్మ పనులు చూచుటకు వెళ్లిపోయినది. నారాయణమూర్తిగారుకూడా మేడదిగిపోయినారు. శేషమ్మ అన్నతో హాయిగా మాట్లాడినది. "ఏమే కమలా! విశ్వనాథాన్ని పల్కరించావు కావు. అన్నయ్యా! క్రిందటేడు నీవు కమలకిచ్చిన పొగడపూలహారం ఇంకా దానిపెట్టెలో ఉన్నది" అన్నది శేషు. విశ్వనాథం, తన ఆలోచనాపూరితములైన నేత్రములను కమలవైపు త్రిప్పి "ఆపువ్వులహారం ఎప్పుడూ వాడ"దన్నాడు. శేషమ్మ కర్థంకాలేదు. కాని కమలకుమాత్రం ఆమాటలలో ఒక ప్రబంధం ఏర్పడింది.

౩

విశ్వనాథం చిన్నప్పటినుండీ విద్యాలోలుడు. తీరికగలవేళలలో చెల్లెలితో మాట్లాడునప్పుడుకూడా అతనికి విద్యాప్రసక్తియేయుండెడిది. ఆసమయములలో కమల, శేషమ్మకు సహాధ్యాయిని గనుక బారిష్టరుగారియింట తరచుగానుండుట ఆశ్చర్యముకాదు. విశ్వనాథం చాలా బుద్ధిమంతుడనిన్నీ, ఉదార స్వభావుడనిన్నీ పేరుపొందినవాడు. ఆయన స్ఫుర

ద్రూపికాడు. కాని అతని గంభీర భాషణములలోను, మితవాదిత్వములోను, ప్రియోక్తులయందును, అణగి యున్న ఉత్సాహకందని చక్కదనము అందర్నీ తన వైపు ఆకర్షించుచుండెడిది. కమలావిశ్వనాథముల సహవాసం ఎవరికీ అగ్గజముగా కనపడలేదు. అవును; ఎందుకు కనబడవలెను. కాని ఒకరోజు శేషమ్మ ఇంటలేనప్పుడు కమలా విశ్వనాథులు మేడమీదనుంట చూచి పార్వతమ్మ నవ్వుతూ "కమలా, నీవు మా వాడ్ని పెళ్ళి చేసుకుంటావా?" అన్నది. కమలకు ఒకక్షణం మాటరాక తల వంచివేసినది. ఇది ఒక ఏడాది క్రిందటిమాట. ఆసంవత్సరమే, సంతోషమో విచారమో తెలియబడని అవ్యక్తనాదముతో, కమల, విశ్వనాథం చెయ్యిపట్టుకొని అతడిచ్చిన పొగడపూల హారం గ్రహించుట తటస్థించినది. ఒకరినొకరు ప్రేమించుకున్నారన్న సంగతి మాఢిగా తెలిసి పార్వతమ్మ కొడుకును మందలించింది. "నాయనా! కమల చక్కనిపిల్ల. గుణవంతురాలు. కాని దానికీ నీకు వివాహం కానేరదు. దాన్ని నువ్వెందుకు ప్రేమించాలి. నీ కింకొకపిల్లనిచ్చి పెండ్లిచేస్తా"మన్నది పార్వతమ్మ. విశ్వనాథం "ఎందుకు ప్రేమించాలి! ఎందుకా? సంగీతమునకు ఆనందానుభవమెందుకో, పువ్వులకు సౌందర్యసువాసనల ప్రకృతి ఎందుకో అందుకే. ఎందుకా ప్రేమించాలి? అది కమల గనుక, నేను విశ్వనాథాన్ని గనుక! అమ్మా!..." మఱి చెప్పలేక పోయెను. పార్వతమ్మ పాపం సత్యకాలం మనిషి; తెల్లబోయింది.

౪

ఊళ్ళో అమ్మలక్కలందరూ మూకలు తిరవడం గుసగుసలాడడం మొదలుపెట్టిరి. "సుబ్బమ్మక్కా! శేషమ్మకేమి. వాళ్ళనాయన బారిష్టరు; ఎంతకాలం అయినా పెళ్లి చేయకుండా ఉంచేస్తాడు. గాని రమణమ్మ, కూతురికి పెళ్లి చేయకపోవడం బాగులే"దన్నది లచ్చమ్మ.

"అవునోశే, నువ్వెలాఅంటావుగాని రామశాస్త్రికి బుద్ధిఉండాలి, రమణమ్మ ఏంచేస్తుంది?" అన్నది సుబ్బక్క.

"పెద్దమనిషైంతరువాత గావోను కమలకు పెళ్లి చేస్తారు?" అన్నది వెంకమ్మ. "ఊరుకోవమ్మా చెప్తావు, ఇప్పటి కప్పుడే పెద్దమనిషి కానట్టు" అన్నది రామప్ప.

ఊరిలో జాన్నాళ్ళకు ఒకవదంతి పుట్టింది. కమలకేమో ఇప్పుడు పెండ్లిచేయరనిన్నీ, విశ్వనాథం చదువు పూర్తిఅయిన తరువాత వానికి కమలనిచ్చి పెండ్లి చేస్తారనిన్నీ, నారాయణమూర్తిగారు రామశాస్త్రి గారు మాట్లాడుకున్నారనిన్నీ. అందరూ ముక్కుమీద వేలుపెట్టుకున్నారు.

౫

కమలా విశ్వనాథములు ఒకరినొకరు ప్రేమించుకొనుటలో నిజముగా ఆశ్చర్యమేమీలేదు. కాని కొంతమందికి ఆశ్చర్యమే కాదు, కోపంకూడా కలిగింది. "కలరా, ప్లేగు మొదలగు ఇన్ని జబ్బులకు కారణములున్నవి. వానిని ప్రచారము చేయుటకు ప్రత్యేక క్రిమిసంతతులున్నవి. కాని ఈ ప్రేమ జాడ్యము ఎందుకు పుట్టినదో, ఏవిధమున ప్రచారమయినదో గ్రంథములలో ప్రమాణం కానరాలేదు," అన్నారు రెండు బళ్ల తాటాకుల పుస్తకాలు చదివిన నారాయణశాస్త్రిగారు. "వివాహం శాస్త్రవిరుద్ధం. బారిష్టరుగారు నియోగులు. రామశాస్త్రిగారు ద్రావిళ్లు. ఈ రెండు శాఖలవారికి ఎక్కడైనా సంబంధం కలిగిందంటే, రెండు కర్రల రాపిడివల్ల నిప్పు ఎలాగు పుట్టుందో, అలాగే పెద్దమంట పుట్టి లోకాన్ని తగలబెట్టేస్తుందని, భగవంతుడు వేదంలో చెప్పినాడు. ఇలాంటి వివాహానికి సంఘం ఒప్పుకుంటుందా? ఎంతమాట" అన్నారు వెంకటావధాన్లుగారు. రమణమూర్తి అనే యువకుడొక ముసలాయనతో "అయితే ఒకరినొకరు ప్రేమించికొనుట తప్పా? నేరమా?" అన్నాడు. ఆ ముసలాయన "అయ్యో వెర్రిపిల్లవాడా! ప్రేమ యేమిటోయి?

పూర్వం ప్రేమ అంటూ ఒకటుండేది కాదు. మీ తాత నడుగు. ఆయన మహానుభావుడు; పూర్వాచారపరాయణుడు. ఇంగ్లీషు చదువులు రాగానే అన్నీ చిత్రాలు పుట్టాయి" అని చాలా తెలిసినవాడు గనుక ఒక చిన్ననవ్వు నవ్వినాడు.

౬

విశ్వనాథం సీమలో జదువుకొని స్వదేశం వచ్చినాడు. కమలా విశ్వనాథముల పెండ్లి నిశ్చయమైనది. "రామశాస్త్రిగారి పిల్ల కమలను బారిష్టరుగారి కుమార్డు విశ్వనాథంకే యిచ్చి పెండ్లిచేస్తారట. వాళ్లకివాళ్లకే వివాహం శాస్త్రవిరుద్ధం కాదూ? అందుచే వాళ్లు అలాగు పెండ్లికాని చేసుకొంటే, మన మందరము కలసి, ఒక మీటుంగుచేసి, వీరిని సంఘబాహ్యులను చేయాలి. వాళ్ల గర్వమును పోగొట్టాలి" అని డబ్బా డుబ్బామని రెండుపట్ల పొడుము యీ ముక్కున ఆ ముక్కున పీల్చి ఒక తుమ్ము తుమ్మి, ముక్కు ఒక్కమాటు నులుపుకున్నాడు వెంకటావధాన్లుగారు. "ఇలాగు రామశాస్త్రిగారు వివాహం చేస్తే మన సనాతనధర్మములకు లోటు గనుక మన మందరముకలసి వారిని సంఘబాహ్యులను చెయ్యాలి" అన్నారు నారాయణ శాస్త్రిల్లుగారు.

రామనభట్లుగారు లేచి, "ప్రస్తుతముయున్న సర్కారు రూలుప్రకారము సంఘబాహ్యులంటే వేయి రూపాయిలు జరిమానా వేస్తారుగదా! అలాగు మనం వారిని సంఘబాహ్యులంటే వారు దావా చేస్తే యెవరు రూపాయిలు యిచ్చుకొంటారు?" అన్నాడు. నారాయణ శాస్త్రిలుగారు లేచి "అయితే మనం అందరము వెలిఅని అనకుండా వాళ్లయింటికి వెళ్లడము మానివేదాం". అన్నారు. "అలాగు యెలాగౌతుంది. ఒకవేళ వాళ్లు సంభావనకు రమ్మన్నట్లయితే భోజనం మాట యేమిటిచేస్తాం" అన్నారు రామన్నభట్లుగారు. "భోజనానికిరమ్మంటే మాకు తీరుపాటు లేదూ, మేము రాజాల మందాము" అన్నా రవుధాన్లుగారు. "ఇది బాగున్నది. ఔను. నిజమే! మనం భోజనం మానివేసి దక్షిణలు పుచ్చుకొనివచ్చుట మంచిది" అన్నారు రామన్నభట్లుగారు.

౭

రామశాస్త్రి తనకూతురు కమల పెండ్లి చేయించమని పిలవడానికి వెంకటావధాన్లుగారి యింటికి వెళ్లాడు. "అవధాన్లుగారూ! నమస్కారమండోయి" అని యింటిలోనికి వెళ్లినప్పటికి అవధాన్లు సంధ్యావందనం చేసుకొని బయటకువచ్చి "ఓహో?...... శాస్త్రిగారా! యీమధ్య మీరు కనుపించడం లేదే? ఊళ్లో వున్నారా!"

"ఆఁ లేకేమి? యేవో కొన్ని వ్యవహారాల్లో తిరుగుతున్నాను. అంచేత కనుపించడం లేదు."

"నా కుమార్తె కమలకు పెండ్లి యెల్లుండి దశమినాడు పగలు $2\frac{1}{2}$ గంటలకు నిశ్చయించినాము. గ్రామస్థులందరిని తీసుకొనివచ్చి సానుకూలముగా పెండ్లి చేయించవాలి. మీరు కాస్త వేగిరముగా దయచేస్తే బాగాయుంటుంది."

"ఆఁ......అలాగే—వివాహము మీ యింటనేనా? కట్నాలు కానుకలు ఉన్నాయా?"

"అబ్బే! ఏమీ లేవండీ. యథాశాస్త్రముగా పెండ్లి జరుగుటే కావలసింది నేను వెళ్లుచున్నాను. మీరు తప్పక వేగిరముగా దయచేయాలి నమండీ, వెళ్లుచున్నాను."

వెంకటావధాన్లు వీధిలోనికి వెళ్లి తక్కిన తన వైదికబృందముతో "రామశాస్త్రిగారింట పెండ్లి యీవేళ. మీరు యావన్మంది వచ్చి ఆశీర్వచనము చెయ్యవలసిం"దని చెప్పి తాను రామశాస్త్రిగారి గృహమునకు పెండ్లి చేయించుటకు వెళ్లాడు. ఇంతలో తక్కిన బృందమంతా చేరుకొన్నారు. పెండ్లివారు సంసిద్ధముగానుండుటచే పెండ్లికి ఉపక్రమింతునా యని మంగళస్నానం లగాయతు మంగళసూత్ర ధారణవఱకూ విధిగా జరిపించాడు. బ్రాహ్మణ

ఆశీర్వాదము జరిపించారు. కాని దక్షిణలకు మాత్రం శాస్త్రులు నారాయణమూర్తి లేచి, "తమ యావన్మంది వైదికబృందము యిచ్చట భోజనంచేసి తాంబూలములు అందుకొని పోవలసిందని మా ప్రార్థన. అలాగు భోజనం చేయనివారు తాంబూలాని కనర్హులు" అనునప్పటికి "అన్నా చచ్చాముగా" అని కొంతమంది 'మా యింట నంది కేశ్వరుని నోము. మేము రాలేమండీ' అనియు, 'మా యింట దేవతార్చన' అని మరికొంతమందియు, ఈలాగున తలో విధముగా చెప్పి తప్పించుకొనుచున్నారు. కాని పైసా పోతుందన్న ఆశ చేత కాని, 'నేను రానంటే వాళ్లు రారుగదా! అప్పుడు నేను ఒక్కణ్ణే వెళ్లి భోజనంచేస్తే నా పైసా నాకువస్తుందిగదా'యని యెవరి మనస్సులో వారు నిశ్చయించుకొని, యింటికి వెళ్లిపోయినారు. అందరూ యింటికి వెళ్లి యెవరిమట్టుకు వాళ్లు మడులు కట్టుకొని, యెవ్వరిమట్టుకు వాళ్లు ఒక్కరే బయలుదేరినారు. తీరా రామశాస్త్రిగారి యింటికి వచ్చినప్పటికి వీరికి వారు వారికి వీరు తారసపడ్డారు. యేమండోయి అంటే యేమండోయి అని ఒకరినొకరు చూచుకొని, చిన్నమొగాలు చేసుకొన్నారు. ఎవ్వరికైన ప్రపంచమునందు ఒక్కమోస్తరుగా నడవదు. అందుచే మన ప్రాయశ్చిత్తము మనము అనుభవించినాము. ఇకమీద మనమెవ్వరికిగాని జాతివెలియనరాదని నిశ్చయించుకొనిరి. కడుపునిండ తిని దక్షిణ తాంబూలములతో సంతోషముగ యిండ్లకేగిరి.

## "సౌభాగ్యవతీభవ"

కొమ్మనమంచి జోగయ్యశర్మగారు

౧

॥సీ॥ జలకంబులార్చి క్రొంజవులీను కేశబంధము త్రికాగ్రంబుపై తాండవింప
కస్తూరితిలకంబు కాటుక రేకలున్ మోముపై దాగిలిమూతలాడ
అధరసముద్భూతహాసాంకురంబులు చెక్కుటద్దములనాశ్వాదింప
కెందమ్మిమాలపోల్కిని చీరకుచ్చెళ్ళుల్ మించుటందియల చుంబించుచుండ
సకియ! శ్రావణశుక్రవాసరమునందు
అంబఁబూజింప జపవేదికాంతరమున
హస్తములమోడ్చునిన్ను నే నరసినంత
వినుముప్రేయసీ, నన్ను నే విస్మరింతు.

౨

॥సీ॥ జరిలేనిమెద్దియోతలఁపుతో దేవిని మించుపూవులను బూజించునపుడు
షోడశియలిచ్చునాశీర్వచనాక్షత లంజలిపుటముతో నందునపుడు
వందనంబాచరింపఁగ పున్నెపుఁజెలుల్ నిన్ను దీవనలమన్నించునపుడు
నేనుచేయించియిచ్చినభూషదాల్చి నన్నరగన్నుమోడ్పుతో నరయునపుడు.
కాంచి, హర్షాశ్రుకణములు కంటికొనల
జాలువార, విశాలవిశ్వంబునందు
ధన్యుఁడను నేనటంచు గాద్గదికతోడఁ
బాడుకొందును ప్రేయసీ! భావగీతి.

# తెలుగుబిడ్డ

శ్రీమతులు వకుచూరి భువనేశ్వరీ దేవి
వకుచూరి అన్నపూర్ణా దేవిగార్లు

కడుపునిండార త్రాగంగ గంజిలేదు
కట్టుకొనుటకు చింపిబట్ట లేదు
నిద్రవచ్చుచో జానెడు నేల లేదు
దీనహరిజనస్థితియిది తెలుగుబిడ్డ!

దారిలో రాగ పొమ్మంచు తరుమువారు
యింటిగడపల ద్రొక్కిన గెంటువారు
పలుకవచ్చిన నేమైన బాదువారు
దిక్కు నహి హరిజనులకు తెలుగుబిడ్డ!

ఆశ్రయంబింతలేక అల్లాడుచున్న
కూర్మిగాంచువారలేమికి కుములుచున్న
ధరను నరకమనుభవించు హరిజనులకు
తెన్ను జూపించి బ్రోవుమా! తెలుగుబిడ్డ!

వీరు సాటివారంచు భావింపవేల
ఈశ్వరసుతులటంచు యూహింపవేల
రక్తసంబంధముంట తలంపవేల
నీకు సోదరుల్ వారుసూ! తెలుగుబిడ్డ!

ప్రభుమహేశ్వరదర్శన ప్రాప్తి లేదు
వారికొజకు తటాకంపుస్పర్శ లేదు
గ్రామమధ్య సంచారము కష్టము. దుర
దృష్టులో హరిజనులకు తెలుగుబిడ్డ!

గర్భగుడియందె యుండెడు గబ్బిలములు
జలములన్ నీదులాడు పందులు సతంబు
గ్రామమధ్యన తిరుగు కుక్కలు యథేచ్ఛ
తేలికింతుండె వారికి తెలుగుబిడ్డ!

వేటి ఆదిమకవులు వాల్మీకులెవరో
భారతామ్నాయకర్తలు వ్యాసులెవరో
స్త్రీలరత్న మరుంధతీ దేవులెవరో
యిలను పూజ్యులు వారగార తెలుగుబిడ్డ!

సృష్టినాల్గుజాతుల విలసిల్లుచుండు
బ్రాహ్మణ, క్షత్రి, వైశ్య, శూద్రంబు, లనుచు
పంచములటంచు నెడవవారు లేరు
దీనితత్త్వంబు తెలియుమా తెలుగుబిడ్డ!

కర్మవిన్యాసయోగులు గాంధిగారు
మదనమోహన మాలవ్య మాన్యమతులు
జాతిభేదంబు లేదంచు చాటుచుండ
కలిగియుంటిమి భేదంబు తెలుగుబిడ్డ!

పనసించెగాంధి యిరువదొక్క దినము
వారి క్షేమాభివృద్ధికి పాటువడుచు
పస్తు మొడ్డెను వారికై ప్రాణములను
పిలిచి జేరదీయవదేమి? తెలుగుబిడ్డ!

హరిజనోద్ధార కార్యంబు నాదరించి
వారి క్షేమాభివృద్ధికి పాటుపడుచు
వారు సోదరుల్ మనకంచు జేరదీసి
అలరుచుండుము దేశాల తెలుగుబిడ్డ!

గాంధిమహోజ్వలకఠినతపస్సు
శీఘ్రకాలమ్మున సిద్ధించుగాక!

# పడవలో

మల్లాది రామమూర్తిగారు

—అమృతకిరణుడు ఆకాశంలో తన శీతలకిరణము లను వెదజల్లుతున్నాడు. ఆ కిరణ ప్రసారం జనులం దరికీ ఆనందం కలుగజేస్తున్నది.

అదో నదీప్రవాహం. వేగం యెక్కువగా వుంది. చల్లని పిల్లవాయువులు వీయడం మొదలు పెట్టినవి. గట్లన్నీ చెట్లతో నిండివున్నై. అప్పు డప్పుడు ఒక్కొక్క పండు నీళ్లలో పడుతున్నది. అది ఆ నడిరేయి సమయంలో, సహజశాంతాకారం దాల్చివున్న ప్రకృతి కన్యను మెల్లగా కదలిస్తున్నది. ఆ చెట్లనుండి, పండ్లు, ఆకులు రాలి నీళ్లలో పడ్డ ప్పుడల్లా ఉలికులికి పడుతున్నది—ప్రకృతి.

ఆ ప్రవాహంలో ఓ పడవ. అదీ ప్రవాహం, యిద్దరూ బాల్యస్నేహితులు. ఇద్దరూ ఎప్పుడూ కలిసి మెలిసేవుంటారు. ఒకరినొకరు విడచివుండడం చిన్న ప్పటినుంచీ లేదు. అవాడు పడవా, ప్రవాహం, యిద్దరు కలిసి ఒకేదారిని పోతున్నారు. వాళ్లిద్దరూ ఏమో మాట్లాడుకుంటున్నారో ఎవరికీ తెలియడం లేదు. కాని యేదో 'బుంయ్యి' మను మ్రోతమాత్రం వినబడుతూవుంది.

పడవవాడు యేదో పాటపాడుతూ తెడ్డేస్తున్నా డు. ప్రయాణీకులంతా నిద్రపోతున్నారు. మధ్య మధ్య ఒకరిద్దరుమాత్రం గురక పెడుతున్నారు. పడవ వాడికి కష్టం అనిపించింది పాపం—తెడ్డువెయ్యడం. కాస్త నడుము వాలుద్దామనుకున్నాడు. పడవ పై భాగంమీద మెల్లగ కూర్చున్నాడు ఏమిటో దీర్ఘం గా ఆలోచిస్తూ. "ఇక నా యీజన్మ యింతేనా? నా జీవితవృక్షానికి పండ్లూ, ఫలాలు లేవా? నాటు కున్న వేళ్లుకూడా తెగిపోవలసిందేనా? చేసుకున్న భార్యతో సౌఖ్యం అనుభవించే గీత నానుదుటిమీద వ్రాయలేదు కాబోలు—భగవంతుడు. పోనీ, యీ పాటికి చేతికి అక్కరకువచ్చే బిడ్డడు........" అంటూ కండ్లు తెరచి చూచాడు—పడవకేసి. రెం డశ్రుబిందువులు రాలినై ఆ ముసలికండ్లలోనుంచి అప్రయత్నంగా. ఆనేత్రాలప్పుడు అరనిమీలితా లైనై. ఒక నిమిషము—ఒక ఘడియ—ఒక గంట— పడవ తనదారిన తాను పోతూవుంది. ముసలివాడు ఉలిక్కిపడి లేచి చూచాడు. ఎందుకు? ఏమో!!

మళ్లీ కళ్లు మూశాడు. తెలవజాము అయింది. పడవ ఒడ్డుదగ్గరకు చేరుతూవుంది. పడవవాడికి అది వరకు జరిగిన తన కథ జ్ఞాపకంవచ్చింది—కలలో.

అది మహాసముద్రమధ్యమం. అలలు, చిందరవం దరగా యిష్టంవచ్చిన దిక్కుకు, దాక్కుంటామని కాబోలు, పరుగెత్తిపోతున్నై. దారీడొంకా లేకుం డా. కొన్ని కెరటాలు ఆకాశంలోకి చొచ్చుకొని పోతున్నవి—భూమ్యాకాశాలు రెంటినీ కలిపి పైన స్వర్గంలోవుండే దేవతలకు క్రింద భూలోకంలో వుండే ప్రజలకు సాంగత్యం సమకూరుద్దామని.

అందులో ఓ చిన్నపడవ. అది ఆ చిన్నసముద్రం లో తూగుటుయ్యాలలాగ వూగుతూవుంది. అం దులో వుండేవాళ్ల హృదయములుకూడా సముద్రపు కెరటాల్లాగ చిందరవందరగా పైకీ క్రిందికీ వూగు తున్నై. ఆ ఒడ్డో—యీ ఒడ్డో—అంతర్భాగమో!

అంతట్లోకే ఓ మంచుకొండ. పడవ ప్రక్కకు ఒరుక్కుంది. కాని ప్రయోజనంలేదు. మంచుగడ్డ పడవను ఢీకొన్నది. పడవ విచ్ఛిన్నమైంది. ఒక ఆడమనిషికి ఓ చిన్న తెప్ప దొరికింది. అందులో తన చంకలోవున్న కుర్రాణ్ణి విసిరిపారేసింది. తాను కూడా అందులో కూర్చుంది. అంచులదాకా నీళ్లు వచ్చినై. లోపలికి ప్రవేశించడానికి మార్గం వెతుకు తున్నై.

* * *

ఆ పడవలో యిద్దరు యెక్కితే మునుగుతుంది. ఒక్కడు ఎక్కితే తేలుతుంది.

* * *

ఆ పడుచు యిది గ్రహించింది. "కొడుకు ప్రతికితే వంశం............" అనుకుంది. తాను సముద్రుడికి తన ప్రాణాన్ని అర్పించింది.

ఆ ముసలిపడవవాడు యీదుకుంటూ బయట పడ్డాడు.

పూర్వగాథ అంతమైపోయింది.

*  *  *

అప్పుడా ముసలివాడికి ఒక తేజోసంబంధమైన స్త్రీ వ్యక్తి కనిపించింది.

"ఎవరునీవ్?" అన్నాడు.

మాట్లాడలేదు.........చిరునవ్వు.

"అప్పుడే నన్ను మరచిపోయినారా?" అంది.

కండ్లు విప్పి చూచాడు.

"నేను నీ భార్యను కానూ?" అంది.

"నా భార్య యెవరు? ఆమె చనిపోయి చాలా కాలమైంది" అన్నాడు.

"ఆమెనే నేను.........నిన్ను వదలలేక యిట్లా యీ మూడేండ్లనుంచి నీకు కనిపించకుండా కాపాడుతూవున్నా. మన ఋణం యిక తీరిపోయింది. నా మనోమూర్తిని చూచి నే నొక్కసారి ఆనందించా. నీ అర్ధాంగిని చూచి నీ వొక్కసారి............" అంది.

"అయితే ఒక ముద్దు—తరువాత నీ యిష్టం—ఇక ఎవరిదారి వారిది. ఈ ఐహికప్రపంచానికీ నీకూ సంబంధం తెగిపోయింది."

"అది కాదు. అది కాదు. అదివల్లకాదు. ముద్దు—పడవలో పడుకున్న ఆ పచ్చనికుర్రాణ్ణి ముద్దాడు. అతడు నీ కుమారుడు."

కల అయిపోయింది. నిద్ర మెళుకూ వచ్చింది. కండ్లు తెరచి చూచాడు—ఆ ముసలివాడు. ఏమీ ఎదుట కనిపించలేదు. కండ్లలో అశ్రుబిందువులున్నై విభ్రాంతి—

"ఏమిటి యీకల?" అని ఆలోచించాడు. అది వట్టి కట్టకథ అని గ్రహించాడు. చనిపోయిన భార్య కండ్లముందు తాండవమాడుతూవుంది. ఆమె తుదిపలుకులు మరుద్దామన్నా మరుపు రావడంలేదు. తెల్లవారుజామునవచ్చిన కల వుత్తదిగదనుకున్నాడు. పడవలో కెళ్లి చూచాడు.

పడవలో మూడేండ్ల కుర్రవాడు. బొద్దుగా, పచ్చగావున్నాడు. ఎత్తుకున్నాడు. ముద్దాడాడు. సముద్రంలో జరిగిన కథంతా ఆ కుర్రాణ్ణి పెంచే తలిదండ్రులకు చెప్పాడు. అతను తన కుమారుడే నని ఒప్పించాడు. కుర్రాణ్ణి మళ్లా చేతులలోకి తీసుకున్నాడు. గట్టిగా కౌగిలించుకున్నాడు.

తనకూ వాళ్లకూకూడా ఆ కుర్రాడు ఒక్కడే అని అన్నాడు.

అన్ని కలలూ అసత్యాలేనా!

## సాధ్వి

భమిడి ఉమా మహేశ్వరావధానిగారు

అలసివచ్చినవేళ నధిపుపజ్జనజేరి శ్రమదీర్చి సమకూర్చు సంతసంబు;
వంతనొందినవేళ కాంతుచెంతనుజేరి హేతువారసికూర్చు కౌతుకంబు;
మాటదోచనివేళ మగనియండనుజేరి మనసారఁబలికెడు మంతనంబు;
క్రోధమూనినవేళ నాథుదండనుజేరి మనముఁ గరిగించుకనికరంబు;
పతిదైవంబు, పతియెసర్వస్వమనుచు,
నిఖిలసుఖదుఃఖములఁ దోడునీడయగుచు,
క్షీరనీరన్యాయమునను జెలగుసాధ్వి
కన్నఁ బతికెన్ననన్యభాగ్యంబుకలదె.

గేది తెలియనట్లు తెలుగులో మాట్లాడతా దేమిటి అని ఆక్షేపిస్తున్నట్లుగా "My native place is Vizianagram city' అని సమాధానం చెప్పారు. అవ్యక్తికి అదెల్లా అర్థం అయిందో కాని ప్రాణం విసిగిపోయి "మీ కీ అకస్మాత్తుగా యేమి వాళ్ళయిందమ్మా" అని తీవ్రంగా ప్రశ్నించేడు. అసేటప్పటికి నిప్పులేకుండా అంటుకు పోయింది వాళ్ళిద్దరికి. "What is this? ఏమిటయ్యా యీ అవస్థ? మాకు మాత్రం వాక్యండ్స్ లేదనుకొన్నా వుటయ్యా" అని గట్టిగా గద్దరించారు వాళ్లిద్దరూ చేసోమూలాను. ఈలా వాళ్లు కేకలేసేటప్పటికి అందులో ఉన్న ఆడాళ్ళంతా కలిసి వాళ్లిద్దర్నీ "ఓసి మీజిమ్మడ, మీకేం జాడ్డింపచ్చింది. పార్వతీదేవి లాగ తనుప్రాణకు బొట్టుకుంటే ఆయిదాళ్ళ చూసి నవ్వుతా గెందుతూ" అని ఒక్కమాటు కేక పెట్టారు. దిలికిపిలికి గాలివానైంది. ఎక్కడ కొట్టుకుంటారో అని భయపేసి మా తల్లిదండ్రులదగ్గిరనా కూర్చున్నాను. అప్పుడు వాళ్లిద్దరూ యీగోడవలో బతికి బెంగాబూ అని లేవరాగానే ముఖో పడవెక్కి లేచ్చొక్కపోయేరు. నాలో నేను నాగరికత ఎంత పనిచేసిందయ్యా అని ఆశ్చర్యపడుతూ చూస్తూవుండగానే నిద్దరొచ్చింది. ఇల్లావుంటే, నవనాగరికత-- లోకంలో దొరసాన్లు అయిపోదాం అని. ఇది జరిగింది ప్రత్యక్షంగాను. కల్పితం కాదు.

—:o:—

# మరపింపు

కనకదండి గోపాలకృష్ణశాస్త్రిగారు

౧

కాంతుడెట్టులనేగె; ననియన
కలువకన్నియ చులకతనముతో
విరుగబడితా నవ్వుకొనుచును
వెళ్లిపొమ్మనియెనే.

౨

ప్రియునిజాడలు తెలియునా, యన
పికము రుసరుస విసుగుకొనుచును
కనులనెఱ్ఱగచేసి చూచుచు
కసరియేవేసెనే.

౩

ఆత్మవిభుడిటు చనియెనా, యన
నిలువునీరైనడలి పోవుచు
మలయపవనుడు మాటలాడక
వేగమే చనియెనే.

౪

ప్రియుండిపు డెటుచనియెనో, యని
పిలచియడుగగ ఉత్తరముతో
శిరము నెత్తక పర్వతేశుడు
తెల్ల తెలబోయెనే.

౫

ఇటులెకద! ప్రియుడేగె? ననియన
వేగమే కేరాణి ననుగని
పులకరించిన తనువుతోడను
రిచ్చవడిచూచెనే.

౬

నాథుజాడలు తెలియునా? యన
సగము విడచిన పూవుకన్నుల
నన్ను చూచుచు మల్లికాంబిక
కంటతడినిడియెనే.

౭

వెఱ్ఱినై నే వెదకుచుండగ
వెనుక వెనుక నె కూడతిరుగుచు
మాటలాడక యూరకొనినను
మరుపచూచెదనో యే?



# వెన్నెల్లో—రహస్యప్రేమ

జనమంచి కామేశ్వరరావుగారు

౧

వెన్నెల్లో:—

కలువలు కన్నులువిప్ప
కన్నెలవలపులు విరియ
ప్రేమలబాధల పొగలు
నింగికి పైగానెగయు.

౨

రహస్యప్రేమ:—

చుక్కలారా! మీరుచూడరాకండీ
చందమామా! నీవుచక్కబోవోయి
గాలిమాదేవుడా! కనికారముంచు
మావలపులెచ్చుటా! ఊదిరాకోయి.



# ప్రతిక్రియ

శ్రీమతి గంగవరపు సీతాదేవి గారు

ఏకాంకనాటకము

ఇందువచ్చుపాత్రలు

రంగారావు:—కలెక్టరాఫీసు గుమాస్తా

మీనాక్షి:—అతనిభార్య

శ్రీనివాసరావు:—9 యేండ్లబాలుడు } వారి పుత్రుడు
భానుమతి:—7 యేండ్లబాలిక } పుత్రికయు.

## రంగము 1

స్థలము:—సౌధాంతర్భాగమందలి గది.

(రంగారావు కుర్చీలో కూర్చొని భార్యతో మాట్లాడుచుండును—పిల్లలు బొమ్మలపుస్తకము చూచుచుందురు.)

రంగారావు:—అయితే నీమాటే గెలుస్తుందంటావు.

మీనాక్షి:—కాక—

రంగా:—కాకలేదు జ్వరమూలేదు.

మీ:—అదుగో మళ్లీ యిటు తిప్పారా?

రం:—నీవన్నమాటేగా!

మీ:—నావుద్దేశ్యం "నామాట గెలవక మీమాట గెలుస్తుందా" అని.

రం:—మొత్తానికి నే చెప్పింది కాదనటం నేర్చుకున్నావు, ఇంకాయేం.

మీ:—మరి అందులో నాతప్పేముంది నిజం చెప్పానుగా!

రం:—నిజమేమిటంటావు?

మీ:—భానే తెలివిగలది.

రం:—శ్రీనంటే నీకంత కసియెందుకు?

మీ:—కసేముంది యిద్దరు సమానులే నాకు.

రం:—పోనీ ఆమాటన్నా వొప్పుకోవేం?

మీ:—సమానులంటే తెలివియందు కాదు—నా ప్రేమయందు.

రం:—ప్రేమసంగతేమి వచ్చిందిప్పుడు.

మీ:—కసిసంగతేవా వచ్చింది?

రం:—నీవింకా కొన్నిరోజులకు "మహిళామండలి" అధ్యక్షురాలవయ్యేదవు!

మీ:—అంటే?

రం:—అంత తెలివి వుందని.

మీ:—తెలివంతా మూటకట్టి మీజాతికే యిచ్చాడట్లా బ్రహ్మదేవుడు?

రం:—అందులో సగం స్త్రీలదిగూడాను.

మీ:—యెట్లా?

రం:—సగం కాబట్టి

మీ:—సగంఅంటారు నిండాఅంటారు, అన్నిటికీ సమర్థులే

రం:—సామర్థ్యంవుంటే నీవిట్లా యెదిరిస్తావా?

మీ:—ఉన్నమాటంటే వున్నవూరు అచ్చిరాదంటారు పెద్దలు.

రం:—పెద్దలమాటవింటే బాగుపడేపోదువు.

మీ:—యేం వినక?

రం:—నేను నీకు పెద్దనుకానా.

మీ:—అయితే!

రం:—నామాట వింటున్నావా?

మీ:—వినటంలేదా?

రం:—మరి శ్రీనే తెలివిగలవాడని ఒప్పుకో.

మీ:—అందుకనే కాబోలు తండ్రికి పెద్దకొడుకుమీద ఆపేక్షంటారు.

రం:—తల్లికి తుదివారిపైన అని గూడా.

మీ:—నాకుమట్టుకు భేదంలేదు.

రం:—నాకుండదనేనా నీభావం?

మీ:—నేనన్నానా?

రం:—సరే రేపట్నుంచి భానుకు నీవే గుడ్డలు సామ్ములు చేయించుకో.

మీ:—ఆ తెలివితేటలు మాజాతికుంటే యిలా మాట్లాడతారా మగవారు!

రం:—ఒక అంగడిపెట్టి అమ్మరాదూ నీవు?

(అంగడిమాటవిని శ్రీనివాసరావు తండ్రి దగ్గరకు

వచ్చి)

శ్రీని:—నాన్నా కొనిపెట్టవు?

రం:—యేమిట్రా?

మీ:—తెలివి

శ్రీ:—అదికాదే పిప్పరమెంట్లు.

రం:—పిప్పరమెంట్లా సరేలే.

(పిప్పరమెంట్ల మాటవిని భానుమతివచ్చి)

భా:—నాకో నాన్నా.

రం:—మీఅమ్మనడుగు.

రం:—యేమే అమ్మా నాకేమో పిప్పమెంట్లు

మీ:—అన్నీ నీకే కొనిపెడతాన్లే. మా అమ్మకదూ!

(అంటూ యెత్తుకొని ముద్దుపెట్టుకొనును. అది చూచి)

శ్రీ:—మాఅమ్మ. మీఅమ్మకాదు. పో, దిగు.

భా:—మాఅమ్మ. యేమే అమ్మా, కదూ?

(శ్రీను భానుకాలుపట్టి గుంజును. భాను శ్రీను ను గిల్లును. ఇద్దరూ యేడ్తురు.)

రం:—వెధవగోల. యింట్లో ఒక్క నిమిషం వుండ నివ్వరు (లేచును తెరజారును)

రంగము 2

సాయం సమయము

స్థలము—సౌధబహిర్భాగము

(భాను శ్రీను ఆడుకొనుచుందురు.)

శ్రీ:—యెందుకే అమ్మ మనన్నూరికే బాదుతుంది?

భా:—తోచక:—

శ్రీ:—నిజంగా అంతేనే. లేకుంటే నిన్న నేనూరికే కూచుంటే తన్నిందే!

భా:—పిలిస్తే రాలేదని.

శ్రీ:—నాకు వినబడితేగా మరి.

భా:—అందుకే నేమోకాని నన్నేమో వూరికనే కొట్టింది. నాన్నతో చెప్తానన్నా, మళ్లీకొట్టింది.

శ్రీ:—అందుకేనా వంటింట్లో యేడ్చింది?

భా:—ఔను గాని నిన్నేమో నాన్న అన్నను తిత్తిందెందుకురా?

శ్రీ:—పులుసులో వుప్పెక్కువైందని.

భా:—వుప్పెక్కువైతే కొట్టకుండేనికి, తియ్యరాదు?

శ్రీ:—కలిసిపోతుందిగా, మరి తియ్యటంయెట్లా?

భా:—అట్లాగైతే పులుసులో వుప్పెక్కువైతే అమ్మకు తిత్తెనన్నమాట.

శ్రీ:—యెక్కిరిస్తే తంతుందేవ్!

భా:—అవున్రోయి-మరెప్పుడమ్మ-అప్పుడు మనం బాబయ్యగారింటికెళ్లే చూచా; అప్పుడు తన్నాద్రా.

శ్రీ:—......

భా:—యేరా, కాదూ?

శ్రీ:—వుందనే.

భా:—యేమిట్రా అట్లా వున్నావ్?

శ్రీ:—నేనొకటి చెప్తాగాని అమ్మతో చెప్పవుగద?

భా:—తన్ను.

శ్రీ:—మనం రాత్రికి పులుసులో వుప్పేద్దాం. యెక్కువవుతుంది. చీవాట్లు తగుల్తాయి. మనన్ని కొట్టింది కదూ?

భా:—అన్నింట్లో వేద్దాం నాన్నకు యింకా కోపం వస్తుంది?

శ్రీ:—ఔనేవ్!

భాను:—యెప్పుడేద్దాం?

శ్రీ:—రాత్రికే.

భా:—రాత్రికే!

శ్రీ:—రాత్రి కమ్మ పనౌతుంది.

భా:—నాకేమొ నవ్వువస్తుంది.

శ్రీ:—అమ్మ నిన్ను కొడుతుంది.

భా:—అమ్మ నిన్నే కొడుతుంది.

శ్రీ:—అన్నఅన్నమాటంటుంది.

భా:—అన్న.

శ్రీ:—నాకేమొ లేదుగా!

(తెరపడును.)

రంగము 3

స్థలము—భోజనాలసావడి.

రాత్రి భోజనసమయము. చెరుగుపరుచుకొని నేలపరుండియున్న మీనాక్షి వినుచుండును.

దగ్గిర వేసియున్న వీధితలుపు చప్పుడు కాగా మీనాక్షి "యెవరు?" అని లోనుండి.

"నేనే మీనా, వంట పూర్తయిందా?"

మీ—యేమిటండీ యింత ఆలస్యంగా వస్తారింటికి? కాస్త పెందలకడే రాగూడదూ?

రం—:"నా మొగుడు రాని స్త్రీగా" (అంటూ ప్రవేశించును).

మీ—అదేమిటండోయి.

రం—మాపై అధికారి రానిచ్చాడు కాడు.

మీ—అధికారి మీ—

రం—అదంతా నీకెందుకు. అన్నం పెడ్తా ఆకలౌతున్నది. పిల్లలన్నం తిన్నారా?

మీ—చెవులు పగిలిపోయ్యేట్లిప్పటిదాకా గోల చేసి పడుకున్నారు. అన్నానికి రమ్మంటే రాలేదు.

రం—నీవు బాదావు.

మీ—ముద్దుపెట్టుకోమంటారా గోలచేస్తుంటే మరి.

రం—నిన్ను మా అత్తగారిట్లాగే పెంచినారా?

మీ—మా అమ్మ అయితేనా వీళ్లు చేసే గోలకు?

రం—చిన్నపిల్లల ఆటలు నీ చెవులకు గోలగావుంటుంది.

మీ—ఆటలేమిటండీ పూరికే నడిబజారులో పోర్లాడుతూ శివమెత్తినట్లు అరుస్తుంటేను.

రం—నీళ్లన్నా పోశావా?

మీ—పిలిస్తే వస్తేగా!

రం—పిల్లల్ని పెంచటం నీకు చేతకాకే రాకేం చేస్తారు? మగవాణ్ని చచ్చి చెడి యిప్పటికి ఆఫీసునుంచి ఇంటికివస్తే యీగోల. పిల్లల్ని పెంచటంగూడా తెలియనివారికట స్వతంత్రం కావాలట—సరే అలాంతె కట్టా తగలేయి—దొడ్లో యేన్నీళ్లున్నయ్యా?

మీ—............

రం—యేం వుద్యోగం యేడుస్తున్నా? వాళ్ల కర్మం. యీ చలిలో చన్నీళ్లు......(నిష్క్రమించును)

మీ—అడ్డమైన చాకిరీ చేస్తూన్నా చీవాట్లుగూడా పైన (అని సణుగుతూ వడ్డించును)

(రంగారావు బిడ్డలను తుడుస్తూ తీసుకొవచ్చి పీటపైన కూర్చుండబెట్టును.

రం—(భుజిస్తూ) శ్రీనూ మీరు సాయంత్రం బజారులో గోలచేసిం దెందుకురా. నే నేమని చెప్పి వెళ్లాను?

శ్రీ—మేమేం గోలచేశాం. ఏమే, మనం గోల చేశామంటే?

రం—మరెందుకు అమ్మ కొట్టింది. యేమే భానూ నిజం చెప్పు?

భా—మరేమో. మేమిద్దరం మేమో దసరా పాటలు పాడుకుంటుంటే నే గోలచేస్తున్నామనేమో అమ్మ కొట్టింది.

రం—యేమిటే కూరలో వుప్పెక్కువైంది?

మీ—కొద్దిగానే వేశానే!

రం—కొద్ది వుప్పు.........

మీ—అయినా యీ వెధవ లోకటితో చనిస్తారా?

రం—నీ మొఖం. వాళ్లను తిట్టమంటే వుండే సంతోషం వంట చేయటంలో వుండగూడదూ?

మీ—వాళ్లను తిట్టడం నాకు సంతోషమా?

రం—పులుసు.

మీ—ఆ!

(భానుమతి శ్రీనివాసరావును చూచి నవ్వును. శ్రీనివాసరావు గుడ్లురుమును)

రం—(కొద్దిగా పులుసు రుచిచూచి ఆవలికి త్రోసివేసి) యేం రోగం వచ్చిం దివాళ అన్నింట్లో వుప్పెక్కువేసే.

మీ—ఎక్కువ?

రం—ఎక్కువ! కషాయం మేలు. వళ్లంబలిసి కొట్టుకుంటున్నావు. ఇరవైయేండ్లు పైబడ్డవి యింకా వంట నేర్చుకునే దెప్పుడు?

మీ—ఇవాళేదో.

రం—నోరు ముయ్యి.

(భాను శ్రీనును చూచి చిరునవ్వు నవ్వును. శ్రీను మందహాసము చేయును.)

మీ—అదికాదండీ.

రం—పైన యెదురు మాట్లాడవస్తున్నావ్! మూతి పండ్లు రాలకొట్టేను జాగ్రత్త.

(మీనాక్షి కండ్ల వెంబడి నీరు కార్చుచుండును)

రం—మజ్జిగ

(మీనాక్షి గుడ్లనీరు గుడ్ల కుక్కుకొనుచూ మజ్జిగ వడ్డించును. రంగారావు రుచిచూచి వుమ్మేసి కోపముతో) నీవు రేపుదయం బండెక్కి పుట్టింటికి దయచేసి మీ అమ్మనడిగి పిల్లల్ని పెంచడం వంటచేయడం నేర్చుకొని మరీ యింటి ముఖం చూడు. కూర పులుసు మజ్జిగ యిల్లువాకిలి అమ్మ అంతా వుప్పుమయం.

(భానుమతి యేడ్వ ప్రారంభించును. శ్రీనివాసుడు గుడ్లురుమును. రంగారావు విది చూచును.)

రం—భానూ యెందుకే అలా యేడుస్తున్నావు?

భా—.....................

రం—యేమిట్రా శ్రీను అలా చూస్తున్నావు. యేమిటే భానూ?

భా—అమ్మ యేడుస్తుంది.

రం—యేడుస్తుంది అన్నిటికీ సాహసురాలే. రెండు బాదితేకాని పూర్తికాదు.

భా—(బిగ్గరగా యేడ్చుచూ) అమ్మకాదు వుప్పేసింది అన్నయ్య.

రం—యేరా.

శ్రీ—అదే, నేకాదు.

రం—నిజంచెప్పవే భాను.

భా—పులుసులో వుప్పెక్కువవేస్తే నేమెం నాన్నకు కోపంవస్తుంది. అమ్మకు చివాట్లు వస్తవి వేద్దామన్నా డన్నయ్య. సరే, చాలావాట్లో వేద్దాం చాలా వస్తవన్నా. పరేవన్నాడు. నేనేసె అమ్మ భావికాడికెల్లింది చూచా. అప్పుడు వాకిట్లోనుంచున్నా చూస్తూ. వాడు వేశాడు. (మరీ బిగ్గరగా యేడుస్తుంది)

రం—భలే పనిచేశావ్ శ్రీనూ (చేతులు కడుగుకొనును)

మీ—అదేంటి చేయి కడుగుతున్నారు. కాస్త వూరగాయితో తింటుండండి పాయమ్మత్తనడిగి మజ్జిగ పోయించుకొస్తా. (రెండడుగులు ముందు వేయును)

[శ్రీను తనవైపునకు వచ్చుచున్న మీనాక్షిని గాంచి "అమ్మ కొడుతుందేవ్" అంటూ బయటికి పరుగెత్తును. భానుమతి భయపడి అన్న ననుసరించును.]

రం—కాదులే, చెప్తావుండు.

(అని చేతులు కడుగుకొని లేచి మీనాక్షి రెండు చేతులు పట్టుకొని)

ఎవరు తెలివిగలవారో తెలిసినదా? మీనూ, యింత చేసినది శ్రీనా, భానా?

(మీనాక్షి సిగ్గుచే తలవంచుకొని మాటాడదు)

రం—(మీను గడ్డముపట్టుకొని తలయెత్తుచూ) మీనూ యిప్పటికైనా వొప్పుకుంటావా తెలివి తేటలు మా జాతివేనని.

మీ—ఔను కాబట్టే భాను సలహా, సహాయము గూడా కావలసివచ్చింది. అది లేకపోతే గాడిద యింకా యేడుస్తుండేవాడు.

రం—సరే రాజీ. మాజాతి కెంత తెలివితేటలున్నా మీజాతి దయలేకపోతే సానపట్టని వజ్రమే.

మీ—ఆ?.........సరే లెండి, చేయివదలండి, పాయమ్మత్తనడిగి—

రం—నిజానిజములెరుగక ముందే నిన్ను దూషించినందుకు గాను మళ్లీ నీకు శ్రమనివ్వకుండా హోటలునుంచి భోజనం తెప్పిస్తాను. మరి నీ వోడిపోయినందుకో.

మీ—నే వోడానా! రాజీకాదు?

రం—ఔను రాజీ—కాని ఖర్చులకు నీమీద డిక్రీ అయింది.

భా—ఖర్చులేమిటి డిక్రీయేమిటి?

రం—నీతో యీవిషయమై వాదించలేక నా నోరు నొప్పెత్తింది కావున (అంటూ భానుమతిని దగ్గరకు లాగుకొనును)

భా—ఆ! యెప్పుడూ మీకు సరసాలే......... వదలండి పది నిమిషాల్లో వంటచేస్తాను. కరువు కాలంలో డబ్బు దండుగ దేనికి?

(యవనికాపతనము)

# బొమ్మల పెండ్లి

శ్రీమతి సామినేని హనుమాయమ్మగారు

ఒక్కదినంబున నుల్లాసమొనవఁ
జక్కనిబాలికాచయము పెంపొప్పఁ
నమ్మలనొప్పించి యాహ్లాదముగను
బొమ్మలపెండ్లిదా రొప్పిందుగాఁజేయఁ
దమచిన్నిడెందాలఁ దలపోసి రంత
అమితసంతోషాబ్ధి నలరుచి తముల
నంతనా బాలిక లప్పుడొప్పార
కంతునిసరిబొమ్మ ఘనవేణియొకతె
రతిబోలునొకబొమ్మ రాజీవనేత్ర
మతిలోనబిడ్డల మారుగానెన్ని
సంబంధబంధంబు సలుపుదుమనుచు
నింబుగానొకదిన మెంచిర య్యెడను.
వరుగన్నవయ్యారి వరుసగానపుడు
ఇరుగుపొరుగునగ లెన్నియో తెచ్చి
కోడలిగని వీనిఁ గొనుమని చెప్పి
చేడెరో కట్నాలు సెప్పుమాకనిన
వధువునుగనుతల్లి వచియించెనిట్లు
విధిగాగవిదుషిరో వెలసెనాపిల్ల
తెలివితేటలుభువి తిన్ననై యుండు
నెలఁతరో మీరలు నెయ్యమింపార
లలనసద్గుణములు లలిఁజూచుకొనుఁడు
కలకాలముండదు కనక మెవ్వరికిఁ
జదివినముగుదలు నలితంబుమిగుల
ముదముతోఁ గాలంబు ముగియింతురెపుడు
అనితసతోడ నత్యాదరంబుగను
వినయమొప్పారగ వివరించెనంత
వరుమాతవినితాను వచియించెనిట్లు
సరెధనమూలము జగతిలోనమ్మ
కయ్యంబుఁ వియ్యంబు గలుగునెయ్యెడల
తియ్యదనంబుగాఁ దీరిచిచెప్పి
సందున మేమేమి యడుగమా నెదమ
మొందరో కట్నాలు హెచ్చుగానీయు
చున్నారు క్రొత్తయా? మానుడు మొన్న
నన్నన్నొ వేలతో నెదురింటివారి
కోడలువచ్చెను గుణవతి విదుషి.
మేడలోఁగనుపట్టె మెఱుపునుబోలి
మూడువేలిచ్చిరి ముదముతో వారు
మూడురోజులలోన ముగిసెను పెండ్లి
అతివరో యీరీతి నరమరలేక
అతులితంబుగఁగట్న మడుగనిచ్చెదరు.
మా దేమిదోషంబు? మదికనిష్టంబు
లేదేని జెప్పుము లేచిపోయెదము
ఈరీతినానాతి హీనతఁ బల్క
మారుమాటాడక మగువయిట్లనియె
వనితరో యొకవేయి వరుని కీయుదు
నని చెప్పనొప్పక యతివకిట్లనియెఁ
జాలుచాలమ్మ మా చక్కదనాల
బాలునికెందరో పనివడిచూచి
యుల్లముల్ విలసిల్ల యుప్పొంగి తాము
పిల్లలనీయగా పిలిపించిమాకు
దండిగాఁదగువర దక్షిణలొసఁగి
పెండ్లిసేసెదమంచుఁ బ్రేమనున్నారు
కాని మాకిష్టము గాని హేతువున
బోని, లే, మీపిల్ల పొంతనేయుండ
దూరముగాపోయి పురపిల్లనేల
వారిసంబంధ మవ్వారిగాఁజేయ
నాదుసెమ్మనమున నచ్చునందులకు
మీ దెసఁదిరిగితి మేలిమిదప్పె.

బాబురే యిక్కడ బాగుగాబుద్ధి
దబ్బునఁజెప్పితి తమవుకోకుండ.
భూమిపుట్లులేవ? భూషలులేవ?
యేమిలేదంచుమీా రెంచియీాపోల్క-
పలుచగానన్నుఁజూచి పల్కుచున్నారు?
పలుమాటలేలమా బాబుకేరార?
రత్నాలరాశితో రమణినిచ్చేరు
యత్నమింకేటికో యమ్మచాల్చాలు
యిష్టంబులేదని యింతిపోఁబోవ
కష్టంబుపైనప్డు కట్నంబుమాకు
వేలిత్తునంచుదా వేడినవిూద
కాలు నిలిపెనంత కనికరంబుగను
అమ్మలార తుదకు నతికష్టమొదవ
బొమ్మలపెండిలి పొందికయయ్యె॥
"వరదక్షిణలులేక వధువునెవ్వారు
కరముగ్రహింపక కదలఁజూచెదరు?"
పెళ్లిప్రయత్నాలు పెల్లుగాఁజేయ
వెళ్లిరిహితబంధు వితతులఁబిలువ.
చెలులునుదానును చెలిమిపెంపార
నలరారుచుండంగ నందఱుకలసి
వేసిరిపందిళ్లు వేడుకనంతఁ
జేసిరిపనులన్ని చేడియలపుడు
సుముహూర్తమపుడుజోశ్యులుసెప్పి [నారు
తమతమపంచాంగ ధర్మంబులరసి
విఘ్నంబులేకుండ వేదోక్తముగను
విఘ్నేశుఁబూజించి వివిధంబులైన
వేడుకలనుదీర్చి వేదికపైని
చేడియలప్పుడు చేరినిల్చుండ
వెలలేనిమోదంబు విలసిల్లునెదల
చెలులుగౌరీపూజ సేయించిరంత.

అడిగినకట్నంబు లల్లునికిచ్చి
యడుగుల గడిగి కన్యనొసంగెఁదల్లి.
జంటగా సంసారచక్రంబునీడ్వ
నంటగట్టిరి పూజ నందుసూత్రంబు.
కర్మానుకూలసుజ్ఞానసూత్రంబు
ధర్మార్థకామసంధానసూత్రంబు
మాంగళ్యమూలసమ్మాన్యసూత్రంబు
మంగళసూత్రంబు మహితలగ్నాన
మంగళవాద్యసమ్యగ్వేదనాద
సంగీతరవము లుత్సాహమొప్పగను
గట్టెవరుఁడు కన్యకాకంఠసీమ.
తనకూతునప్పగిం తలఁజేయతల్లి
మనము నుయ్యెలవలె మల్లాడుచుండ
వనిమె నీకూతురు నరసినరీతి
మనుపుముమర్యాద మాసిపోకుండ
వదినె నీయదియిది వదలి నీకడితి
సదయతగైకొమ్ము సరగునరమ్ము
యెన్నొన్నికష్టాల నెనసికన్నాను
కన్నులనిడుకొని కడకు నీకిడితి.
కనకంబుబొమ్మగా గాపాడినాడు
తనయ నీసుతునకు ధారవోసితిని
చిన్నారిపొన్నారి చెలిగాఁగఁజేసి.
యెన్నాళ్లుపెంచిన యితరులసొమ్మె
ఆడబిడ్డలటన్న యార్యులమాట
నేడుపుట్టఁగలేదు నేఁటనేఁజెప్ప.
నేఁతోగారాబాన నెత్తిపెంచితిని!
గొంతెత్తిగట్టిగాఁ గోపించిపిలువ
నామేల్మిబంగారు నామూలధనము
నీమూలధనమని నీతిగాఁజూడు
బిగ్గరగాఁబిల్వ బెదరిజూచెడిని
దగ్గరకురావన్న తహతహలాఁడు

పనులేమినేర్వ దీ బంగారుబొమ్మ
కొనినట్టినీప్రేమ కొనలుసెం పెక్క
తీపారుముద్దుగాఁ దేకువతోడ
కాపాడిరక్షింపు కసుభద్రముగను
అనియిట్లుతనపుత్రి నప్పగించుచును
ఘనవిచారగ్రస్త కార్శ్యసంతప్త
మానసయైయుండె మానినియంత
మానుగకన్యనా మరునాడెయత్త
వారుగొంపోయిరి వైభవమొప్ప
తీరుగానీరీతి తీరెనీపెండ్లి.
"కయ్యంబునకువచ్చు కన్యయత్తయును
వియ్యంపురాలెప్డు విలపించుచుండ,
వియ్యముకయ్యమై విశ్వధరిత్రి
తియ్యదనంబున దీపింప' దనుచుఁ
బెద్దలుసెప్పిన ప్రియవాక్యమెన్నఁ
దద్దయుసత్యమై ధరలోఁ బ్రసిద్ధి
యాచంద్రతారార్కమైయుండుననుచు
యోచింతునామది. ఉవిదలగన్న
చింతతోపరియగు చెకుగులోకమున
నెంతటివారికి నీశ్వరా తప్ప
దంచు నామనమున నరసిప్రారబ్ధ
సంచితంబెడలింప సర్వేశుచింత
మునిఁగిధర్మము సత్యమును తానుఁగాగ
ఘనముగనుండిన కల్యాణమంచు
నీరీతిజెప్పితి నిదినిజంబంచు
నారీజనంబులా నందంబుసెంద.



## భావకవితలో మెఱుపుతీఁగ

శ్రీ చిలుకపల్లి సాఊ. గోపాలస్వామిగారు

ఆదృగంతవిశాలవక్షో
రుహవిహార విహంగసాధపు
మధ్యమధ్యాంత ద్వయానపు
మానినీమణి సొరుచూచుటచేన్

అస్మదీయానంద పరివృత
వార్ధివీచిక గణముఁ దేలుచు
సౌఖ్యసంపదలెల్లఁగోరెదు
జాణ గనుగొనుచున్

అర్థరహితంబైన గేయము
లందుపాల్గొను నగ్రజులలో
మేటియూ యీ మెఱపుతీఁగను
హాయి..కౌఁగిలిగ్రుచ్చెదన్

భావకవితా వార్ధివీచిక
భవ్యలక్ష్మి కటాక్షవీక్షణ
కలితసంస్తు స్తావలోకన
కాంతకాంతిని మెచ్చెదన్

భావకవితలో మంచిమెఱుపును
మెఱుపులోపల మంచితీఁగెను
తీఁగెయందున తియ్యదనమును
తినఁగనెంచియుఁ గోరెదన్

మెఱుపుతీఁగెలో మేల్మియున్నది
మేల్మిలోపల భావమున్నది
భావమందున హాయియున్నది
శోధసేయుట మేలగున్

# ప్రాచీన స్త్రీల స్థితి

బుర్రా వెంకటసుబ్బారాయుడుగారు, ఎమ్.ఎ.

ప్రాచీనకాలమున ప్రపంచమున స్త్రీకి హక్కులు చాల తక్కువయనియు, ఆమె మిగుల దుఃఖస్థితియం దుండెననియు మనకు పూర్వమునుండి నాగరికత గలవి యని పేర్వడసిన రోముయొక్కయు గ్రీసు దేశముయొక్కయు, చరిత్రలు తిరగవైచిన స్పష్టముగా గానవచ్చును. హిందూదేశచరిత్రములలమున గూడ కొంతవఱకిట్టి దుస్థితియే యున్నట్లు కనుపించినను గ్రుడ్డిలో మెల్ల యనునట్లు ఆనాటి స్త్రీయొక్క స్థితి గ్రీసు రోములలోకంటె భారతదేశమున కొన్నివిధముల మేలైనట్లు కానవగును.

భార్యాపుత్రులమీదను, సేవకులమీదను అధికారము చెలాయించుటే, అధికారప్రియుడగు పురుషుని అధికారపు చెలాయింపులో మొదటి మెట్టు అవదగును. కుటుంబములోని వృద్ధపురుషుడు పూర్వకాలమునుండియు కుటుంబమునంతకు ప్రభువగుచు వచ్చెను. అట్టి ప్రభువునకు నిజపశ్వాది జంతువులమీదను, ధనువాహనాదులమీదనువలె బాలబిడ్డలమీదగూడ సంపూర్ణమగు హక్కులుండియుండెను. ఆ రోజులలో బలవంతులు బలహీనులకు రాజులై యుండిరి. అట్టిరీతి బలహీనులగు స్త్రీ శిశ్వాదులకు బలవంతులగు కుటుంబపు పెద్దలు ప్రభువులగుట సమంజసమేయైయున్నది. అందుచే అట్టి కుటుంబపు పెద్దకు (గృహపతికి) స్త్రీ శిశ్వాదులు బానిసలరీతి ఆజమాయిషీకి బద్ధులైయుండిరి. సాంఘికమర్యాదలు గూడ ఆనాటికి పెరుగకుంటమి పురుషుడు స్వాతంత్ర్యమును నిరంకుశముగ చెలాయించుకొనుచుండెను. మన స్మృతులలోకూడ నీ స్థితియే కానవచ్చుచున్నది

స్త్రీ శిశు సేవకులందఱును నొకేవర్గీయులై కుటుంబ యజమాని యగు గృహపతియొక్క ద్రవ్యమని స్మృతులు చాటుచున్నవి. ఒకరిసొమ్ము ఉండుటే కాని ఎట్టి ద్రవ్యమును వీరికి లేదనికూడనున్నది. వీరికెట్టి ద్రవ్యము లభించినను అదియుంగూడ గృహపతికే చెందును. మనుస్మృతి—8-416.

గృహపతికిని వీరికి నెట్టి వివాదవచ్చినను, అట్టి తగాదాలో తీర్పుచెప్పుటకు పరులకు హక్కు లేదని కూడ మితాక్షరిలో నుదహరింపబడిన యొక స్మృతి వాక్రుచ్చుచున్నది. ఇందులకు కారణము, నిజవస్తువైన పురుషునకు సర్వవిధముల నుపయోగించుకొనుటకైయున్న హక్కేయని తోచును. అట్టి నిరంకుశ ప్రభుత్వమున కింకొక రద్దువచ్చుట తప్పేమగును.

ఇట్టి పురుషస్వామిత్వము నానాటికి ప్రవృద్ధమై కొంతకాలము నాటికి పరిపాటియైపోయినది. పిల్లదికి పురుషయాజమాన్యముపై నాధారపడియుండుట హెచ్చి నవీనస్మృతులనాటికి పూర్తిగా భార్య మగనిపై ఆధారపడియుండునట్టి స్థితికలిగెను.

తండ్రికి బిడ్డల నమ్ముకొనుటకుకూడ హక్కు ఉండెను. అట్టిచో జనకులు నిజతనయులను శుల్కమునకు వివాహమున నమ్ముకొనుటకుగాని, బానిసలకైవడి విక్రయించుటకుగాని స్వతంత్రులైయుండిరి. కొందఱు శాస్త్రపరిశోధకులు దీనినిబట్టి యాసుర వివాహము బ్రాహ్మముకంటె ప్రాచీనమైనదని తలంచుచున్నారు. ఈ రెండు విధముల వివాహముల లోను (కన్యాదానమైనను, కన్యావిక్రయమైనను) కన్యనిచ్చుటయే ప్రధానమైనదయినను పశ్వాదిదాన విక్రయములకు కన్యాదాన విక్రయములకు నిసుమంతయైనను భేదములేమి మగువ సామాన్యవస్తువలె ఎట్టి హక్కులును లేనిదైయున్నది. పై నుదహరించిన రెండు సందర్భములలోనుగూడ హక్కులు ఒకరినుండి యొకరికి మారినవేగాని విక్రీత—(లేక దత్త) విషయమున నెట్టి మార్పును లేదు. కన్యకకు పైతృక స్వామిత్వముపోయి భర్తయొక్క ఆధిపత్యము వచ్చినది. అట్టి కన్యయొక్క భర్త నిజజనకునికి లేక

గృహపతికి లోనైయున్నయెడల భర్తసామ్మగు నీ యువిదగూడ భర్తతోపాటు శ్వశురునకు లేక గృహపతికి స్వాధీనయగుచుండును. అందుచే నామె, భర్తచే నార్జింపబడెను ఇతర వస్తువాహనముల భంగి కుటుంబమునకే (పుత్రోత్పత్తికై) యార్జింపబడినది అగుచున్నది.

ఇట్టి యుద్దేశములతో నాకాలపు మనుష్యుల మనంబులు నిండియుండుటచే స్త్రీయొక్క యిష్టానిష్టములు గణింపకయే నిజకార్యముల నామె నుపయోగించుకొనుట యొక తప్పని ఆకాలపువారికి తోచకుండుట వింతకాదు. యాజ్ఞవల్క్యని I 88 ప్రకారము విధించిన నియోగవిషయమునగూడ స్త్రీయొక్క యిష్టప్రసక్తియే లేక పై నుదహరించిన స్త్రీయొక్క సామాన్యవస్తువదాశ్రితత్వము వెల్లడియగుచున్నది. యాజ్ఞవల్క్యని నాటివఱకును హైందవనారీమణుల సాంఘికస్థితి యిట్టిదైయున్నది.

స్త్రీశిశుసేవకులపై పురుషుల కిట్టి స్వామ్యముండుట ఒక హిందూదేశముననే కాదు. ప్లూటార్కుని "జీవితములు" ప్లేటో "ప్రజాస్వామ్యము" మొదలగువానిని జదివి ప్రాచీనగ్రీకుల (యవనుల) చరిత్ర తెలిసికొనిన విజ్ఞానులకును రోమక ధర్మశాస్త్రమును గూర్చి చదివినవారికిని ఆ రెండు దేశములలోగూడ స్త్రీలస్థితి యిట్టిదే—కాదు, ఇంతకంటె హీనమైనదే—యని తోచును. గ్రీసుదేశములో స్త్రీల నమ్ముట, లేనిచో కేవల భోగార్థమైకాని సుపుత్రోత్పత్తికై కాని మిత్రుల కెఱవిచ్చుట వాడుకయట!

[C Plato's Republic Bk. IV c. 3 Bk. V c. 7 (2 Bohn's Edn.) pp 107, 141 but see contra. Ardist's Politics II c. 2. Hist. Animals IX. 1.)

ఇట్టి సంగతులే లైకర్గస్ అనునాతని జీవితచరిత్రయందు స్పష్టమగుచున్నవి. ఈ లైకర్గస్ అనునాతనికి స్త్రీకొఱకు పుట్టి లెగురగొట్టుకొనువారిని చూచిన నసహ్యమట. అట్టివారిని చూచి పరిహాసము చేయునట. వృద్ధునకు యౌవనవతియగు భార్యయుండిన నామెకు మిక్కిలి సౌందర్యవంతుడగు నొక యువకుని పరిచయము గలిగించి యాతనివలన నామెకు గల్గిన సుపుత్రుని నిజపుత్రునివలె పెంచుకొను వృద్ధులను జూచిన నాలైకర్గసున కిష్టమట. (Life of Lycurgus, the Spartan Law-giver) దీనిని లైకర్గస్ ఈవిధముగా సమర్థించును. "పిల్లలు దేశముయొక్క సొత్తుగాని పితరుల సొమ్ము కారు. దేశ మెల్లప్పుడు నిజలాభము నిజశ్రేయస్సునకై తన పుత్రులు శ్రేష్ఠులు బలిష్ఠులునై పుట్టవలెనని కోరుచుండును. అందుచే నట్టి పుత్రు లుదయించునట్లు తల్లిదండ్రులు ప్రయత్నించవలెను."

[Plutarch's Lives-Lycurgus (ward Lock) p. 36.]

ఇట్టి సాంఘికసమయములవలన స్త్రీల నైతికవర్తనము చాల బాగుపడినదట.

భార్యాదాన పరిగ్రహములు గల్గినవారు స్పార్టా నాగరికులలో మిక్కిలి గౌరవనీయులుగను, అట్టి గౌరవప్రదమగు పదవిని పొందలేనివారు తుచ్ఛులుగను నీచులుగను పరిగణింపబడుచుండెడివారు.

భార్యల మిత్రుల కెఱవిచ్చుట ఏథెన్సులో (Athens) నొక గొప్పయనుగ్రహము మహాప్రసాదమునైయుండెను. సోక్రటీస్ వంటి మహనీయుడు నిజకళత్రమగు జాంటిపీ (Xantippe) యను నామెను సచ్ఛాత్రుడు మిత్రుడునగు అల్కిబియడీస్ (Alcibiades) అనునాతనికిచ్చి యనుగ్రహించినట్లు చరిత్రవలన తెలియుచున్నది. కేటో (Cato) జీవితచరిత్రయందు గూడ భార్య మిత్రదత్తయైనట్లు కనబడును. క్వింటస్ హోర్టెంషియస్ అనునాతడు పుత్రోత్పత్తికై నవోఢయగు పోర్షియా (Portia) యను తనయనిమ్మనగా నామె తండ్రియగు కేటో హోర్టెంషియస్ (Hortensius) పై మైత్రిచేసైన గౌరవమున్నను, నవ్యదత్తయగు కూతు నాతని కివ్వనని హోర్టెంషియస్ ప్రార్థనపై కేటో నిజభార్యనే ఆమె జనకుని యనుమతిని గైకొని, యెరువిచ్చుటయేగాక కేవలము కానుకగ నిచ్చెనట!

[Plutarct's Lives—Cato the younger (Ward-Lock) pp 536—9.]

ఎథీనియన్ న్యాయపద్ధతి ప్రకారము వివాహచ్ఛేదమునకు వీలున్నది. కాని దానికై భార్య, నిజోద్దేశమును తెల్పుచు పత్రము నొకదానిని స్వయముగా ఆర్గన్ (Archon) అను నొక సభవారికి సమర్పింపవలెను. అట్టి సందర్భమున భర్త కిష్టముండినయెడల నామెను తీసికొని పారిపోవచ్చును. అందుచే తేలిన పర్యవసాన మేమనగా భార్య కిష్టముండి వివాహచ్ఛేదము కలిగించుకొనుటకు హక్కున్నను నట్టి హక్కును చెడగొట్టుటకు భర్త కవకాశముండుటచే నామెకు హక్కు ఉండియు ప్రయోజనములేక పోయెను.

(Cf Ibid. Alcibiades p 144)

యవనరోమక దేశములలో ప్రాచీనకాలమున స్త్రీ లెల్లప్పుడు నేకాంతసేవ చేయుచుండునట్లును, పసితనముననే వివాహములగుచుండునట్లును, మగండ్రు వృద్ధులగునెడ స్త్రీలు యువకుల సాంగత్యము సంపాదించి బలులగు బిడ్డలగనుచుండునట్లును తెలియుచున్నది. పై నుదహరింపబడిన లైకర్గస్ అనువాతడు కడపటి విషయమునుగూర్చి మఱియొకచోట సమర్థించుచు నిట్లు వాదించుచున్నాడు. "మనము మన ఇంటిలోని పశుశ్వాన మార్జాలాదులు మంచిపిల్లలగనుటకై ప్రయత్నము చేయునప్పుడు మన పిల్లలే బాగుండునట్టి మార్గమేల చూచికొనరాదు?" ఇట్టి ప్రశ్నలతో నాతడు, "భర్త ఎట్టి కురూపి బలహీనుడు నైనను, భార్య యాతనినే దైవముగ నమ్మి యాతని వలననే పుత్రుల బడయవలె" నను మర్యాదగల దేశపు ప్రజలజూచి యా లైకర్గస్ పరిహాసము చేయునట. అట్టివారిలో పారసీకులు, అస్సిరియనులు, బాబిలోనియనులు, హిందువులు చేరుదురు.

స్త్రీయొక్క జీవితచరిత్రలో నీ పైజెప్పినదంతయు రెండవ యవస్థ యనదగును. మొదటిదశలోని విశేషములు హిందూస్మృత్యాదులనుండి యుదహరించితిమి. ద్వితీయావస్థలో స్త్రీస్థితి కొంత మార్పుజెందినను నామెకు పరాధీనతయు గృహోపకరణపరోపయోగ్యతయు తప్పినవికావు. ఆమె యుపయోగము కేవలము భర్తకుటుంబవృద్ధికై ప్రజోత్పత్తి యేయైయున్నది.

హైందవధర్మశాస్త్రమునందువలె రోమక న్యాయశాస్త్రమునగూడ వివాహమొక సంస్కారముగా నెంచుకొనబడుచున్నది. అగ్న్యుదకాది భూత సమక్షముననే రోమునందు వివాహములు జరుగుచుండెడివి.

గ్రీసునందువలె రోమునందుగూడ మొదటినుండియు బహుపత్నీకత్వము నిషేధింపబడియుండెను. కాని భర్త వేఱొక స్త్రీని ఉంచుకొనుట యాచారమై అగస్టస్ కాలమునాటికి శాస్త్రవిరుద్ధముకూడ నయ్యెను. అట్లుండుటచే నొప్పుకొనబడి యది (ఒక స్త్రీ నుంచుకొనుట) కూడ, శాస్త్రసమ్మతమగు వివాహమువలెనే పరిగణింపబడుచు వచ్చెను. ఈ ఆచారము మొదటినుండియు శాస్త్రసమ్మతము కాక పోవుటకు కారణమేమనగా, రోమునందు స్వతంత్రులగు స్త్రీపురుషులకు తప్ప ఇతరులతో స్వతంత్రులగు స్త్రీపురుషులకు రోమక న్యాయశాస్త్రము ప్రకారము వీలులేదు. అట్టి శాసనమూలము సంబంధములు సుఖప్రదములుగానుండక—యుంపుడుకత్తెల వలన సాంగత్యమే పురుషులకు సుఖావహమై తోచి పురుషులందఱు నీరీతి వివాహములనే కోరుచుండెడివారు. ఉంపుడుకత్తెలను సామాన్య ప్రజలనుండి గాని, బానిసలనుండి గాని ఏఱికొనుచుండెడివారు. కాని ఎంత హీనకులజలైనను ఉంపుడుకత్తెలే, అగ్నిసాక్షిగ పరిగృహీతలైన కులకాంతలకంటె నైతికవర్తనమున మేలని పేరుగాంచిరి. అందుచే గౌరవనీయులగు వారందఱును ఉంపుడుకత్తెలనే యుంచుకొనుచుండెడివారు కాని ఇట్టి సంబంధమువలన పుట్టిన పిల్లలకును, సామాన్య వేశ్యలకు లేకజారిణులకు పుట్టిన పిల్లలకును భేదముగలదు. వేశ్యాదుల బిడ్డలకు పైనుదహరించిన ఉంపుడుకత్తెల పిల్లలకున్న కొన్ని హక్కులు లేవు. జస్టినియన్ చక్రవర్తి శాసనమూలమున ఉంపుడుకత్తెల బిడ్డలకు ప్రసిద్ధ జనకుని యాస్తిలో నాలవవంతు ఇచ్చునట్లును వేశ్యాదుల

సంతానమునకు భరణముమాత్రము నచ్చునట్లును నియమించెను.

బహుపత్నీకత్వము ఆశియా ఈజిప్టులయందు గూడ నున్నట్లు చరిత్రవలన తెలియుచున్నది. సాలొమన్ అనువతనికి 700 రాణులును 300 సానులు (ఉంపుడుకత్తెలు) నున్నట్లు కనుపించును. (I Kings XI. 3.) ఇట్టి దురాచారమును విడియాకులచట్టమే తరణోపాయమని కొందఱి యుద్దేశము, అందుచే క్రీస్తు శిష్యులుగూడ విచ్ఛేదమునకు వీలులేని వివాహము విషమించునని తమయభిప్రాయమును వెల్లడి చేసియుండిరి. (Mathew XIX. 10). అనేకభర్తృకత లేక బహుభర్తృస్వీకారము హేయముగను, పాక్షికముగను నెంచుకొనబడినను నాయాచారము పూర్తిగ భరతఖండమున లేకపోలేదు. అట్టి యాచారమునకు మనమహాభారతమున నొకని దర్శనముగలదు. అందు ఆదిపర్వమున వైదపయాశ్వాసమున ద్రౌపది కైదుగురుపాండవులతోడి వివాహము దైవప్రేరితమునియు, నారదుడు ద్రౌపదిభర్తలతో నియమితకాల మొక్కొక్కనితో నుండునట్లేర్పాటు కావించెననియు నున్నది.

ఈఆచారము (స్త్రీ పలువురుభర్తలతో నివసించుట) చాలవఱకు నశించిపోయినను నిప్పటికిని హిమాలయపరిసరమందున్న కొండజాతులలోను, పంజాబునందున్న కొన్నిజాతులలోను కలదని తెలియుచున్నది. ఇట్టి ఆచారమునకు స్త్రీదౌర్లభ్యమే కారణమనియు, పురుషులసంఖ్య అవసరమైనదానికన్న నెక్కువకాగోరిన ప్రాచీనకాలపు ప్రజలచే నామోదింపబడుటచే నశింపక నిలచియుండెననియు కొందఱు చరిత్రపరిశోధకుల యభిప్రాయము. ఇట్టి వాంఛయే ధర్మశాస్త్రములు నియోగమును విధించుటకుగూడ కారణమని కొందఱందురు. (గౌతమధర్మ—XVIII. 8. కాని మను 9-52 చూడుడు)

అనేకభర్తృకత కొచ్చి మలబారులందిప్పటికిని కొన్ని జాతులలో కలదని తెలియుచున్నది. ఇటీవలవఱకును నాయరుజాతియం దీయాచారము కొద్దిభేదముతో నుండెడిది. ఆయాచారము రూపుమాసినను తచ్చిహ్నాలు మాత్రమిప్పటికిని వారి దాయశాస్త్రమును వీడినవికావు. ఇట్టి యాచారమును గూర్చి విచారించుటకై నియోగించిన మలబారు వివాహకమిషనువారు తమనివేదికలో నిట్లు వ్రాయుచున్నారు. (ఈసభవారి యుద్దేశము, "అనేకభర్తృకత హిందూదేశమున (మలబారున) ఉన్నదా లేదా యను ప్రశ్నకు జవాబు ఆపదముయొక్క వ్యాఖ్యానమునుబట్టి యుండు"నని.) "అనేకభర్తృకత" అనుపదమును, పలువురు భర్తలిష్టపడి యొకతె నుంచుకొనుటగాని బాహాటముగా వివాహము చేసికొనుటగాని లేనిచో (ద్రౌపది యందువలె) భర్తలందఱు భార్యయందు సమానహక్కుగలిగియుండుట— యని యర్థము చేసికొనినచో—నట్టి వివాహములుగాని యాచారములుగాని మలబారుననే కాదు హిందూదేశమున నెచ్చటను కానుపించవు. కాని యాపదమునకు విస్తృతవివాహమున గాక: ఒకస్త్రీ పలువురుపురుషులతో రమించిన జాతిభ్రష్టత లేకుండుట యని మాత్రము సంకుచితమగు నర్థముతో వ్యాఖ్య చేసిన నట్టి యాచారము మలబారున చాలచోట్ల కనుపించును."

Gait's Centers of India. (1911) Vol. I, Part I Pp. 242, 294.

ప్రాచీన ధర్మశాస్త్రమున, ననేక వివాహములు పరస్పరానురాగమాత్రమూలములై మన కనైతికములుగ గాన్పించునవి అనిషిద్ధములైయుండెను. ఇందులకు నిదర్శనము. (1) అబ్రహాము నిజసోదరిని వివాహమాడెనట. (2) ఈజిప్టులో భిన్నజనకులు గల యేకోదరులగు స్త్రీపురుషులకు మిథునసంబంధము లత్యుత్కృష్టములని పరిగణింపబడుచుండెను. (Genesis XII 19) అందుచేతనే (Cleopatra) క్లియోపేట్రా అనునామె తమ్ముని వివాహమాడి యాపదల పాలు గావలసివచ్చినట్లు తెలియుచున్నది. (3) స్పార్టాయందు భిన్నక్షేత్రజులగు సోదరనులకును, ఏథె

స్సనందు భిన్నజనకులగు సహోదరులకును వైవాహికసంబంధము లుండెడివి. రోమునందుమాత్రము ధర్మశాస్త్రవేత్త లిట్టి వివాహములు నీతిదూరములని యెంచి నిషేధించిరి. (ఇట్టి నిషేధములు రోమునందు కంటె హిందూదేశమున మిక్కిలి యెక్కువయయ్యెను.)

రోమకధర్మశాస్త్రరీత్యా స్త్రీలు సదా అస్వతంత్రలై (అనగా పరతంత్రలై) యుండవలెను. రోమనులయుద్దేశమున స్త్రీజాతి, పురుషజాతిని సంతోషపెట్టుటకేపుట్టెను. విధేయతయే స్త్రీధర్మముగాదు, నామె సదా (ఎంతవయసువచ్చినను) అవివేకియు, అనుభవశూన్యయునని వారి యభిప్రాయము. అందుచే రోమను స్త్రీలందఱును గూడ భర్త, తండ్రి, పోషకుడగు ఇతరపురుషుడు వీరిలో నెవరొకరిపైననైన సదా ఆధారపడియుండవలెను. హిందూ ధర్మశాస్త్రమున గూడ స్త్రీజాతిని గూర్చిన యభిప్రాయమిట్టిదే. మనుస్మృతి 5. 148 శ్లోకము ప్రకారము స్త్రీ చతుర్విధావస్థలలోను పురుషునిపై నాధారపడి యుండవలెననియు స్వాతంత్ర్యమున కనర్హురాలనియు నున్నది. IX. 2. శ్లోకమున మాత్రము స్త్రీస్వాతంత్ర్యమునకు కొంత యవకాశమీయబడినది.

రోమకధర్మశాస్త్రరీత్యా భార్యాపుత్రులు గృహవృద్ధుని ద్రవ్యమగుట వానికి వారిపై స్వవశ్యాదులపై నుండు హక్కులన్నియునుండెను. ఇందుకు తార్కాణ (1) భార్యను పరుడు దుర్మార్గమును ద్రొక్కించిన వానిపై భర్త తీసికొనవలసినచర్య చౌర్యమునకై గాని జారత్వమునకుగాదు.

(2) పుత్రికాపుత్రులు గృహపితసామ్మగుట నాతనియనుమతి లేకుండ వారెవరిని వివాహమాడరాదు. రోమునందు వివాహమొక సంస్కారముగ నెంచకొన బడుచుండెనని ఇదివరలో చెప్పియుంటిమి గదా. వైవాహికసంస్కారమునకు రోమునందు (Confarratio) కన్ ఫేరషియో అందురు. ఈసంస్కారమున జరిగిన వివాహమునుండి విడగొట్టుకొనుటకు భర్తకు హక్కుగలదు. కాని భార్యకులేకుండెను. అట్టి విచ్ఛేదమునకై పురుషుడు భార్యపై వంధ్యత్వదోషముమాత్ర మారోపించిన చాలును కొంత కాలమునకిది యన్యాయమని ప్రజలాందోళన చేయుటచే స్త్రీకిగూడ పురుషునికిగల వివాహవిచ్ఛేదమునకైన హక్కులన్నియు శాసనమూలమున నివ్వబడెను. ఇట్టి హక్కులనుపొంది స్త్రీలు వానిని దుర్వినియోగపరచుటచే జువెనల్ మొదలగు కవీశ్వరులు స్త్రీజాతి నెగతాళిచేయుచు, "నొక్కొక్క ఇల్లాలైదేండ్లలో నెనమండ్రు పురుషుల కంటాశ్లేషవనుభవించుచుండె" నని వ్రాసిరి.

ఒక్కమాఱుగ స్త్రీలకింత స్వాతంత్ర్య మిచ్చుట వలన నిట్టి చేటు వచ్చినదిగదా యని ధర్మశాస్త్రవేత్తలు తత్తరపాటు నందిరట—సంస్కారమై ప్రారంభించి వివాహమనునది రోములో ఒడంబడికవలె సామాన్యవస్తువు లిచ్చి పుచ్చుకొనుటవంటి దైపోయెను.

రోము గ్రీసులందు హిందూదేశమునందు వలె, పూర్వము బాల్యవివాహములు పరిపాటియైయుండెను. నూమా అనువాతడు, భర్త తనభార్యను తనకనువగునట్లు విధేయత కలిగియుండునట్లు శిక్షించుకొనుటకుగాను, వధువునకు ద్వాదశాబ్దము లుండవలెనని శాసించెను. లైకర్గస్ కాలమునాటివఱకు గ్రీసునందుగూడ నిట్లేజరుగుచుండెను. కాని గ్రీసునందు రోముప్రజలకున్న గౌరవము వివాహవిషయమున లేదు. గ్రీకులకు సౌందర్యము వీర్యము ప్రధానమై యుండుటే దీనికి కారణము—లైకర్గస్ సంఘసంస్కరణకు పూర్వము చతుర్దశవర్షములైన నిండని బాలికలకు తఱచుగా వివాహములగుచుండెను. లైకర్గస్ పెండ్లియీడు హెచ్చుచేసెను. దుర్బలులు అంగవికలులునగు శిశువులను చంపివేయుట కితడు తల్లుల కనుజ్ఞయిచ్చెనట.

గ్రీసునందు భిన్నోదరులై యేకోదరులగు అన్నచెల్లెం డ్రన్యోన్యము పెండ్లాడుటకు వీలుండెను.

ఇట్టి వారిస్థితి సామాన్యుల స్థితికంటె నీచల్లఘువుగా నుండెను.

గ్రీసు దేశపు స్త్రీలెల్లప్పుడును వారికై ప్రత్యేకముగ నియమింపబడిన గృహములో నొకభాగమున నివసించెడివారు. వారివద్దకు దగ్గఱబంధువులు తప్ప నితరులు పోకూడదట. స్పార్టాలో దప్ప నింకెచ్చటను స్త్రీ యాస్తిని సంపాదింప వీలులేదు. బయటికి వచ్చునపుడు మేలి ముసుగు ధరింపవలెను. ప్రాచీనకాలమున ప్రజల యార్థికస్థితి హెచ్చిన కొలదిని సాంఘికదుస్థితి, అవినీతియు హెచ్చినట్లు కనుపించును. రోమునందు వివాహము లన రోతఁబుట్టి క్రీ. పూ. 131 నాటికి మెటెలస్ అనువాఁడు ప్రజలు దేశోద్ధరణకైనను వివాహముల జేసికొనవలెనని హెచ్చరింపవలసిన యవస్థవచ్చెను. కాని యెంత దుస్థితివచ్చినను రోములోని సామాన్యగృహిణిస్థితి, సామాన్యయవనగృహిణిస్థితికన్న చాల మేలనుట నిశ్చయము. మొత్తముమీద వీరిద్దఱును భర్తలకు లోఁబడిన వారే యైనను యవనస్త్రీవలె గాక రోమను స్త్రీలు స్వేచ్ఛగా నెచ్చటకైనను, ముసుగులేక నే వెళ్లుచుండెడివారు. రెండుదేశములలోను బలువుర పెండ్లాడుట నిషేధింపబడినను ఉంపుడుకత్తెల నుంచుకొనుట యాచారమై అట్టి వారి కుదయించిన సంతానము దాయార్హముగా నంగీకరింపబడెను.

వీరితో పోల్చిచూచిన ప్రాచీన హిందూయువతి స్థితి వేయిమడుంగులు మేలని చెప్పకయే చెప్పుచున్నది. హిందూగృహిణి గృహమున సర్వాధికారిణియై యున్నది. ఆమెకు ప్రత్యేకించి యాస్తియుండుటకు హక్కున్నది. సంతానములేక భర్త చనిపోయిన నాతని స్వార్జితమంతయు భార్యకే చెందును.

---

# ఒక నాఁడు

శ్రీమతి ఆచూరి లీలావతీదేవిగారు

నా గృహప్రాంగణోద్యానా ననాటబడిన
తరుణసురపొన్నమూలవితర్దిమీద
కరముదక్షిణానిల తరంగములుమలయ
కూరుచుంటిని నేనందుకొంతదనుక.
తొగరువిరులవగరు గొనితూలిపోయి
జీవగానమ్ము కోయిలజిమ్ముచుండె;
జాఁజమార్గాలయందునఁ బూలచెంత
మధువునాని పాటల మధుమక్షి పాడె;
ఒక్కఫలశాఖ రాచిలుకెక్క పలుక
జిలుగుపలుకుల కులికియు సొలసిపోవ
మధుర హేమంతమధుమాస మధ్యమునకు
అతులితానందసౌఖ్యంబులందఁజేసె.

విరియబూసినమాలతి విరులపజ్జ
పూవుసెజ్జల నిదురింపబోవ మనసు
పడగ లేచివెళ్లితి తీవకడకు అపుడు.
కావిరంగులసంధ్య నల్గడలనలమె
కొడవలితోకొంత వచ్చికకోసి కాపు
కన్నె తనచింతపూవన్నె చిన్నయావు
వెనుక మోపుతో తోలుక వెళ్లుచుండె.
కాపాకంపు తనపాలాన కష్టపడియు
జేరుచుండెనువల్లెకు చెలియతోడ.
వింతవింతయందాల నొకింతసేపు
అరసిఅరసియు యింటిలోకరుగ, ప్రకృతి
నిద్రజెందెనోయన మౌనముద్రదాల్చె.

# పూఁదోఁటకు

సామవేదం జానకిరామశర్మగారు

౧

కలకలమంచు నీవిహంగగానము నిద్దురమేలుకొల్ప, మం
దలలితకల్యవాయుసముదాయము ప్రీతిరచింప, వేకువన్
చెలులనుగూడి పుష్పవనిఁ జేరెదు నీవు హిమాంబుసంతతిన్
వలిపములార్ద్రిమూటఁ గొనెదవి పుష్పపరీతచిత్తవై.

౨

ఓవికచారవిందచరణోజ్జ్వలినీ! బహుకంటకావృతం
బీవనమార్గ మెట్లు చరియించెదవో, అణుమాత్రమేని బా
ధావిధి నోర్వలేని పసిదానవు! తావకముగ్ధమోహనేం
దీవరనేత్రయుగ్మముఁ బథిం బ్రసరింపగనిమ్ము లెస్సగన్.

౩

ఓనవనీలనీరదనిభోజ్జ్వలకైశిక! రాత్రిసుప్తియం
దానసకీర్ణమైన అలకాళిని గోరులదువ్వవేల? భా
రానతశాఖశాఖలఁ బటాంతర మంటుటగానవేల? నీ
తోనరుదెంచుచేడె లతిదూరమునుండుటఁ గాంచవేలకో!

౪

విచ్చినపూలగుత్తులస్రవించెడు స్వాదుమరందమాని, నీ
సచ్చరితంబు భృంగ మటు శ్రావ్యముగానినదించి, ప్రేమతో
వచ్చెడు నిన్నుఁ జూడ; కనవా? అటులేల వృథాగ సాధ్వసం
బచ్చుపడంగ పర్విడెదు? వాత్మనుతిన్ సహియింపలేవొకో!

౫

తూరుపుకొండపైఁ దొగరుతోఁచి ముహూర్తములోన జీవులం
దేరిచె సుప్తినుండి, యువతీమణులెల్లరు గేహకృత్యముల్
దీరుపసాగినారు, గృహి దేరినవారి విధానకృత్యముల్
దీర్చి నేర్పుతో మగనితీయనిచూడ్కుల నందుమీ వెసన్

టయెు కాదా! పైఁగా వివాహములు మంగళకత్తులవలె గలుకువాలేయుంటచే సరస్వతి మీయొద్దికి రానేర దును గదా! సరే! ఇఁక నామాట చెప్పనేటికి? అయిన నే నేల? సరస్వతి యేల? మీ మిత్రత్వము, మీ పీత్వాపీత్వాపునః పీత్వాలు, మీబొమ్మలాటలు, మీ వేదాంతములు, మీ మాంసాహారములు,—మీ కుండినఁ జాలును. వహవ్వా! చూచుచుండఁగనె యెట్లు పరిణమించినది!

మిసకుండ నిద్దురపోవుచున్నారా? నిద్దురపోని వ్వను. నన్ను జూడఁగనే మీకు నిద్దురవచ్చును గాఁబోలు! ఓపటినుండి మీరాకకయి చకోరముల వలె గ్రుడ్లు తెఱచుకొని వడికిరేయి నలుకును వేచి యుండను. ఇది ముమ్మాటికి నిజము. మీకొఱకెంత శ్రమించుచున్నను మీతో క్షణమైన బ్రసంగించు భాగ్యము లేదాయె, ఇఁక నీజన్మ మెందులకు? కాల్పనా? గ్రుక్కెడు ప్రాణ మెట్టులేని పోక పోదు. అమ్మాయి సరస్వతిని జూచి యూఱకుంటిని గాని లేకున్న నీపని యీపాటికి చేసియుందును.

లజ్జాభిమానము లేని మగని నేమి యనిన నేమిలాభము? నోరునొచ్చుట దక్క వేఱు ప్రయోజనము లేదు. ఇంతకుముందు నామాటలకుఁ బ్రత్యుత్తరించుటయైనను గలదు. ఇప్పు డది మారినట్లు లున్నది. ఏమనిన తుమ్మచెట్టుతీరిఁ బ్రత్యుత్తర మే లేదు.

రెండుమూఁడు దినములకు దేవీనవరాత్రము లారం భమగుచున్నవి. సరస్వతి పుట్టిన దినముగూడ దగ్గ ఱించుచున్నది. దాని కొక కంఠాభరణము సేయిం పవలెనని యెున్నాళ్ళనుండియో కలదు. ఎక్కడి ద్రవ్యమును జ్ఞానపత్రములకును, జాట్లకును, జాల నపుడు కంఠాభరణముల కెచ్చటనుండివచ్చును. కానిండు.

తాము దేవ్యారాధనమునకుఁ గడంగుదురా? అక్లైని ద్రవ్యమెక్కడిది? మీవిరాళములు, మీ గ్రంథములు, మీసభలక్రింద ద్రవ్యమంతయు వ్యయ మగుచున్నది కదా! అట్టి యెడ శక్తిపూజ లెట్టులఁ జేతురు?

మాయమ్మ మూసాన్నెళ్ళక్రిందట సరస్వతికిచ్చిన యున్నూఱురూపాయ లీయమనుచున్నారా? అందొ క్క పైసయేని నీయను. మీరును మీస్నేహితులును దప్పఁ గ్రావి మత్తిల్లి నేలఁగలిచి తందనాలాడుటకే గదా మీరీద్రవ్యమును వాంఛించుట! శక్తిపూజ యను పేరితో నెన్ని దుష్కృత్యములు జరుగుచున్నవి? ఈవిధముగఁ జేయుట న్యాయమేనా? విధి యను చున్నారా? విధినిషేధములు తమకును దమ యను చరులకును గలవా? లేనియెడ నావిధులఁ దగులఁ బెట్టుఁడు. మద్యపాయులు వ్రాసిన గ్రంథములు ప్రామాణికములా? పూర్వము మనదేశమున తద్దిన ములఁ బెట్టునపుడు మద్యమాంసములు వడ్డించువారని యిపుడుగూడ వడ్డించిన నగరా? మన మహర్షులు గోభక్షణులని మీరుకూడఁ దినుట కారంభించిన ఛీ యనరా? మీరింతకాలము చదివిన చదువా యిది? అక్లేని గోమాంసమును మెసవెడి యాంగ్లే యులను దురుష్కులను దూషించుటేల? "నాతండ్రి గారు యజ్ఞముసేసి మాంసభక్షణ మొనర్చె"నని యను చున్నారా? మీరిట్టి యసత్యముల నాడకుఁడు. మీవలె వారు శక్తిపూజాధురంధరులయి, మద్యపా యులయి, అప్రాచ్యపుఁ బనుల నేమియుఁ జేసి యుం డలేదు. యజ్ఞమునందు మాంసమును దినుట నంశము తమకుఁ దెలియదు కాఁబోలు! హింసయే లేనపుడు భక్షణ మెట్లు పొసగును? శక్తిపూజ యని పేరుపెట్టి కొని వేదబాహ్యులయి, నీతిదూరులయి, అప్రాచ్య పుఁ బనులఁ జేయుచు నలుగురిలోను ద్రాగుబోతులని పిలువఁబడుచు వ్యర్థజీవనము సేయుటకన్న ముక్కు మూసికొని నీరులేనిబావిలోఁ బడుట యుత్తమము. మీకు నిజముగా శాస్త్రములందు విశ్వాసము గాని భక్తిగాని లేశమపిలేదు. దౌర్భాగ్యుల పొత్తువలన నాయాపదార్థముల నారగింప నభ్యాసపడి దేవ్యా రాధనము పేరితోఁ బనికిమాలిన వస్తువులను వర్ణ సాంకర్యమునకుఁ జూపు పదార్థములను యథేచ్ఛఁగా స్వీకరింపఁ బ్రయత్నము సేయుచున్నారు. కాని నాకిష్టములేదు. కావున మీగుట్టు రట్టుచేసెదను.

శక్త్యారాధనమున మోచనము గలదనుచున్నారా? వహవ్వా! మోచన మెట్లున్నను ఏనాదిముక్కిడివలె మత్తిల్లి మాటాడుచు సొక్కిసోలుచు, దిగంబరులయి పొఱలుట మాత్రము కానిపించుచున్నది. ఇదియే విమోచనమా? మతమును పేర నిట్టి దుష్కృత్యములు




'నటి'



గుజ్జు

వయసు సం. 22 లు

పొడవు 32 అంగుళములు

జరుగుటచేతనే మనదేశ మిట్టి దౌర్భాగ్య స్థితియందున్నది. అన్యదేశీయుల సుగుణము లెట్లున్నను దుర్గుణములు మాత్రము మనవారు నేర్చికొనుచున్నారు. యోగ్యతను, సముపార్జింప దుర్ఘటముగాని యయోగ్యతను సేకరింప క్షణము పట్టదు. ఏమిా యీ వెర్రి. "కలౌ పంచసహస్రాణి జాయతే వర్ణసంకరః" అని మాతండ్రిగారు చెప్పుచుండెడివారు. కులము, జాతి, మతములు చెడుచున్నవి. అబ్బా! నాకెందుల కీగొడవ!

మఱచితిని. ఈనడుమ గీతాలు వ్రాయ మొదలిడిరట! నిజమేనా? అవి చూచి మీస్నేహితుఁడు అగ్రహారీకుఁడు, మీసోదరుఁడు కపి, మీబంధువు సేతుపతి ఉబ్బి తబ్బిబ్బు లగుచున్నారట కదా! మీ రేమిచదివినారండీ! పట్టుమని పది తరగతు లయినఁ జదువలేదుగదా! మీకుఁ గవిత్వ మెట్లు వచ్చినది. గీతాలు వ్రాయుచున్నారే! అవి మీ గీతలేనా లేక మీస్నేహితుల, సోదరుల, బంధువుల గీతలా? కంటికిజోడు, కాలికిజోడు, ఒంటికిజుబ్బా, చేతిలోకఱ్ఱ,—ఉండఁగనే మీరు నలుగురిచేత మెప్పువడయుదు రనుకొంటిరా? మీవృత్తి యేమనుకొను? ఋజువర్తనమా, అల్లరిమూక. క్లబ్బులో చేరినంత మాత్రముననే హృదయమాలిన్యము పోవునిది మిమ్ములను క్లబ్బుమెంబర్లు గౌరవింతురా? ముందు నడచుచున్న వెనుక నవ్వుచుండుట గాన్పించుటలేదా? అవును. ఎట్లు కానిపించును. ప్రక్కతాళములు వైచువారును, తందానతాన యని పాడువారును, చెక్కరున్నపుడు మీకుఁ బెద్దలయొక్కయు, మర్యాదస్థులయొక్కయు, భావము లెట్లు తెలియఁగలవు? తెలియుట కవకాశమున్నదా? మీ తెలివికి, మీపాండిత్యమునకు,—ఇతరులు కాదు, మీరే భ్రమపడి మీయంతటమీరే యొకతోఁకను దగిల్చికొనుట యేల? శెబాసు! మెచ్చికొనవచ్చును. ఈమధ్య మీస్నేహితులు,—కాదు మిమ్ముల నథోగతికిఁ దెచ్చువారు,—మిమ్ముల నాంధ్రషైరవుఁడని గౌరవించినారట! నిజమేనా! అవును. కాకేమి. సార్థకబిరుదమే! దిగ్విజయము లొంటిని విడిచినచో మూఁడులోకములందును జయలక్ష్మిని వరింపవచ్చును. మీనామాక్షిని జక్కఁగా గ్రహించినచో మీనడవడి మీరు చక్క దిద్దికొనవచ్చును. లేకున్న అధఃపతనమే! గ్రహింపుఁడు. ముమ్మాటికి గ్రహింపుఁడు!! నేఁడుగాకున్న రేపయిన దమకు సిద్ధించక తప్పదు. మీసంగతి యిచ్చట నేగాక ఖండాంతరములకుఁగూడ బోయినదట నిజమేనా? మీకుఁ గులగోత్రాదులు తెలియవే! మన మత మూఁడక్షరములు తెలియవే! అట్టియెడఁ దాము ఖండాంతరము లందలి సోదరుల కేమి చెప్పుటకుఁ బోయెదరు? ఇచ్చట పోస్ట్యాస్పదు లగుటయు గాక చెంపదెబ్బలు, తన్నులు తినుట యటుండ ఖండాంతరములలోఁ గూడ పాదతాడనములు కలుగఁ గలయోనా? నేను, సరస్వతి,—ఇద్దఱమున్నాము. లేకున్న మీ రిచ్చట తిన్నులఁదినినను అనుకొనువారు లేరు. ప్రాణనాథా! నామాటవిని మీగీతలకుఁ దగినట్లు గీతాలు వ్రాయుట మానివేయరాదా! నాకుఁ బతిభిక్ష పెట్టరాదా? నీవు నాసంగతిలో శోక్యము గలిగించుకొనవల దనుచున్నారా?

నేను మిమ్ము వివాహము చేసికొన్నదిమొదలు ఒకరాత్రియైనను గంటినిండ నిద్దుర లేదుగదా! అది నాదుష్కృతము కాఁబోలు! నాకు మరి సంతానయోగ్యత లేదుగదా! ఇంకెక్కడి సంతానము? సంతానశోధనసమస్య వెడలినదికదా! వరానువారిపోకిళ్లు పోవుచున్నా రా యేమి? అయ్యో! అందుల కవధిపలదా? మగపిల్లవానికి మనసగుచున్నదే! తప్పిజాతి యొక్క యాఁడుపిల్ల కలిగినది. మీపిత్రార్జిత మంతయుఁ బోయినను, విద్యావిరహితులయి దాంబికమునకు విద్యావంతుల మని విఱ్ఱవీగినను, మాయమ్మగారి యాస్తి కొంచెము మిగిలియుండుటచే మీదౌర్భాగ్యపు బెత్తనమునకుఁ గనిపెట్టికొని యుండనక్కఱలేదుగాని యేమిచెప్పుదును? అదిక్కుమాలిన వనజాక్షి యెచ్చట దాపురించినది? ఆరండ నాకాపురమునకు దుమ్ము చల్లినది కదా! అగ్నిహోత్రుని సాక్షిగాఁ బెండ్లియాడిన కులకాంత యుండఁగా నొక అంకుటాలు దిక్కయినదా! హోధైవమా! ఏమిగతి! అయ్యో! ఇంకెక్కడి కాపురము? అని వెక్కివెక్కి యేడ్చుచు వనజాక్షిని దూషించుచు దాని నింటినుండి వెడలనడపు యోజనము సేయుచు నిద్దుర పోయినందునఁ దరువాతి విషయము మనకుఁ దెలియదు. ఆశరీరవాణి మాత్రము "ఈదంపతులు గాఢప్రేమానుబంధమున జీవగ్రాహపీడావిమోచనులయి సంతానప్రాప్తులయి సుఖింతురుగాక!" యని యనిరెను. అహో! ఏమి యీచిత్రము!

# చిన్న చెల్లాయి

శ్రీమతి తాయి రత్నమాలగారు

ఉమా, బిందూ యిద్దరూ అరుగుమీద కూర్చుని ఆడుకుంటున్నారు ఉగాదినాటి సాయంకాలం. నాన్న తెచ్చిన బొమ్మలతో ఆట. ఉమ పెద్ద సెల్యులాయిడ్ బొమ్మని కాళ్లమీద పడుకోపెట్టుకొని 'వుత్తి తి నలుగుపెట్టి బిందూ నీళ్లు పొయ్యవమ్మా పాపాయికి' అంది. బిందు చిన్నలక్కపిడత పుచ్చుకొని పట్టినీళ్లు పోసినట్లు నటించింది. నీళ్లుపోయటం అయిపోయినతరువాత వొళ్లుతుడిచి ఫ్రాక్కు వేసింది ఉమ. ఇంతట్లో బొమ్మనికూచోపెట్టి లోపలికివెళ్లింది ఉమ. బిందు ఆబొమ్మనిఎత్తుకొని బాత్ రూములోనికివెళ్లి పొయ్యిలోవున్న నిప్పులు పైకిలాగి సాంబ్రాణిపొగ వేసినట్టుగా సెగ చూపిస్తోంది. ఇంతలో బొమ్మఫ్రాక్కుకు నిప్పుతగిలి అంటుకొని బొమ్మకూడా కాలడం ఆరంభించింది. బిందు భయపడి బొమ్మ నక్కడపడేసి అక్కదగ్గరికి పరుగెత్తి అక్కను తీసుకువచ్చింది. ఉమకు కోపమూ, ఏడుపూ వచ్చాయి. గబగబా అమ్మదెగ్గిరకెళ్లి 'అమ్మా, బిందు నా బొమ్మని కాల్చేసింది' అని ఏడ్వటం మొదలెట్టింది. 'బిందును కేకలేసి చూడండీ' అన్నాది అమ్మ మడికట్టుకుని వంటచేస్తూ. బిందు ఓమూలగదిలో కూచుని ఏడుస్తోంది. ఉమ నాన్నతో గదిలోకివచ్చి ఏడుస్తూన్న చెల్లాయిని చూచింది. 'నాన్నా, బొమ్మ పోతేపోయింది లేండి. ఇప్పుడు చెల్లాయి నేమీ అనకండి. ఊరుకోవే చెల్లాయీ, ఏడవకు! నాన్న ఏమీ అనరులే. మరి పండుగనాడు ఏడవకూడదుటే!! ఈపండుగనాడు ఏడిస్తే ఎప్పుడూ ఏడుస్తుంటారట. రా!! నీచిన్న బొమ్మలతో ఆడుకుందాం' అని చెల్లాయిని బుజ్జగిస్తూ కళ్లనీళ్లుతుడిచి బయటికి తీసుకువచ్చింది. వెలుతుర్లో చూచేటప్పటికి బిందు చేతివ్రేళ్లు కాలివున్నాయి. అదిచూచి నాన్న దెగ్గరకు తీసుకువెళ్లి మందువేయించింది ఉమ. నాన్నా, అమ్మా ఉమకుగల సోదరీప్రేమకు ఉప్పొంగిపోయారు. నాన్న మర్నాడే మళ్లా ఉమకు బొమ్మ తెచ్చిపెట్టాడు.

# చల్లని తల్లి

"ఇందిరాదేవి"

చిన్నతనంనుంచీ నేనూ మాబావ ఆడుకుంటూ ఉండేవాళ్లం. మాబావకి నన్ను చూస్తే ఎంతో ప్రేమ. ఏంతెచ్చుకున్నా నాకుపెట్టకుండా తినేవాడుకాడు. మేమిద్దరం ఎప్పుడూ పోట్లాటలెరుగం. మాఅయ్య మాకిద్దరకు పెళ్లిచేశాడు. బ్రాహ్మల పొలం పాలికితీసుకొని మేమిద్దరము వళ్లువంచి పాటుపడుతూ, ఒకళ్లజోలి అక్కర్లేకుండా కాలక్షేపం చేసేవాళ్లం. ఇట్లావుంటూండగా కొన్నాళ్లకి మాఅయ్య మంచాన్ని పట్టాడు. మాఅయ్యను మాయింటికే తీసుకువచ్చి ఉపచర్యలుచేస్తూ ఉండేవాళ్లం. ఒకయేడాది తీసుకొని మాఅయ్య చనిపోయినాడు. తరువాత నాలుగేళ్లు యథాప్రకారం సుఖంగా కాలగడిపాం.

నాకష్టాలకు మొదలు నాకొక మొగపిల్లవాడు పుట్టాడు. ఏడాదిపిల్లడై యుండగా నాభర్తకు దగ్గు, జ్వరం పట్టుకుంది. అదే తగ్గుతుందని అశ్రద్ధచేశాము. తరువాత ఆ జబ్బు బాగా తీవ్రమైంది. అపుడు మావూరి పూజారిఅయ్యగారు మందు యిస్తాడేమోనని ఆయనవద్దకుపోయి బ్రతిమాలుకొన్నా. కొంచెం తగ్గాక మీరేం యివ్వమంటే అది యిస్తాను. ఇప్పుడు నావద్దయేమీలేదు. కూలికి వెళ్ళటంలేదు. మందేమైనా యివ్వండని వేడుకున్నా. ముందు పదిరూపాయిలు యిస్తేనేగాని మాట్లాడవద్దని ఆయనలేచిపోయాడు. నేను గుడ్లనీళ్లు గ్రుక్కుకుంటూ అక్కడనుంచివచ్చి, మాకులంలో కొంచెం డబ్బున్న ఓ ఆసామివద్దకుపోయి మాగుడిసె తాకట్టుపెట్టి యిరువయిరూపాయిలుతెచ్చా. పదిరూపాయిలు బాపనయ్యకిచ్చి, మందు తెచ్చా. తక్కిన పదిరూపాయిలు పెట్టి రెండు నెల్లు యింటిఖర్చుగడిపా. దైవం నాపాలిట లేనందున బావను తీసుకు వెళ్లిపోయాడు. నేను యేడుస్తూ కూర్చుంటే పిల్లవాడు బెంగపెట్టుకుంటాడని యేడుపుదిగమ్రింగుకొని పిల్లవాణ్ణి పెద్దవాణ్ణి చెయ్యాలిగదా యనుకున్నా. బావపోయిన పదిరోజులకే అప్పిచ్చినాయన నువ్వింక తీర్చేదేమిటి యిల్లు స్వాధీనంచేయమని యింట్లోనుంచి లేవగొట్టాడు. చిన్నప్పటి స్నేహితురాలుంటే ఆమె నడిగి పంచతీసుకొని పొద్దాకులూ కూలిచేసికొని అక్కడే గంజికాచుకుని తాగేదాన్ని. ఇల్లా ఓ ఏడాదిగడిచింది. ఇల్లాకూడా నేనుండటం ఆ పరమాత్మునికి యిష్టంలేదు. నా చిన్నతండ్రికి నాలుగు రోజులు జ్వరము వచ్చి పోయినాడు తండ్రి దగ్గరకు. ఈపాపికి ప్రపంచకంలో నాదనే వస్తువు లేకుండాపోయింది. ఏడుస్తూ కూర్చునేందుకు కూడా లేదు. రెక్కలాడుతేనేగాని డొక్కలాడవు. అల్లాగే యేడుస్తూపడియుంటే ఆ యిల్లాలు రెండు పూటలు గంజిపోసింది. మా కులంలో ఒక మనిషికి సంరక్షణ చేయటానికి, మరుపూటకున్న మహారాజు లేడుగా! అల్లాగే లేచి పన్లు చేసుకుంటున్నా. ఇల్లావుంటుండగా నాకుకూడ జ్వరం ప్రారంభించింది. నా చిన్నతండ్రిని నాలుగు రోజుల్లో యెత్తుకు

పోయిన ఈ జ్వరం నెల్లాళ్లువచ్చి దానంతటదే తగ్గింది. ఈ నెల్లాళ్లూ ఒకపూట కాచుకొని, యింకోపూట కాచుకోకుండా కాలం గడిపా.

ఆరోజు, గంజి కాచుకొని తాగుదామంటే యింట్లో నూకలు అయిపోయాయి. వూళ్లోకివెళ్లి అడుక్కు తెచ్చుకుందామని బయల్దేరా. అది వేసంకాలం. తీవ్రంగా గాడ్పులేస్తున్నాయి. ఎవరు వీధి తలుపులు తీయటం లేదు. వీధివెంట యెవ్వరు నడవటం లేదు. సంపన్నులు యింటిగుమ్మంలో వట్టివేళ్ల చాపలు కట్టించుకుని నౌకర్లచేత నీళ్లు జల్లించుకుంటూ యెండవేడిమి సహిస్తున్నారు. ప్రాణం చాలోస్తుంది. కళ్లు పచ్చబడుతున్నాయి. మెల్లిగా పాకుతూ వెళ్లి రెండు మూడు యిళ్లవద్ద అరిచా. ఎవరు వినిపించుకోలా. ఇంకో యింటిదగ్గరకు వెళ్లా. తలుపువేసుంది. అరవటానికి కోపిక లేక, యిక కదలలేక, అల్లాగే కూర్చుండి పోయాను.

నాకు కొంచెం తెలివొచ్చేటప్పటికి ఆ యింటితల్లి గాబోలు, నాతల ఆమె తొడమీద పెట్టుకుని, చిన్నగిన్నెలో మజ్జిగా అన్నం నా గొంతుకలో వేస్తోంది. నాకు విభ్రాంతిగావుంది. "ఇదేమిటమ్మా నేను మాలదానను నన్ను ముట్టుకున్నారు"అన్నా. "నాకు తెలుసులేవే! చస్తోంటే చూస్తూ వూరుకోమన్నావా" అందామె. నాకు కొంచెం సత్తువవచ్చి వెడదామని లేవ బోతుంటే ఆ యింట్లోంచి ఒకాయిన ఆమెను ఏమేవ్ అంటూ వచ్చాడు.



నాదగ్గి రామె కూచునివుంది. ఇంకేముంది మండిపడి"నీకేమయినా మతిపోయిందా? నీ మొహం తగలెయ్యా. మాలదాన్ని ముట్టుకుని సంరక్షణ చేయటానికి, నీకేమి పొయ్యేకాలం వచ్చిందే!మళ్లీ యింట్లోకి ఎల్లా వచ్చి వండిపెడదామనుకున్నావు? అంతదయ కలదానవవుతే ఆకులో వడెయ్యకపోయావు?" అని వురిమాడు. ఆమె "కాదండీ, వీధిలోకి బండొచ్చిన చప్పుడవుతే, ఎవరు వచ్చారోనని వాకిట్లోకివస్తే ఇది గుమ్మంలోపడివుంది. ఎన్ని పిలచినా పలకలా. చచ్చిపోయిందనుకున్నాను యీగాడ్పుకి. అల్లాంటప్పుడు యెల్లా వూరుకోను చెప్పండి"అందా అమ్మ. "ఓసి నీ సముజాయపీమండ! అంతగా అవుతే వెంకిచేత పోయించరాదూ." అంటూ ఆదే విని అడ్డమయిన మాటలూ అనుచు నాకేసి కోపంగాచూచి ఆయన లోపలికి పోయాడు. ఆమె నన్ను వెనక్కిపిలచి "ఆమ్మీ, నీవు చాల నీరసంగాఉన్నావు. కూలి చేసుకోలేవు. ఎక్కడవుంటున్నావు" అంది. ఆమెకు నా సంగతి టూకీగా చెప్పి, ఆమెవద్ద సెలవుతీసుకుని నేను వచ్చేశా.

మర్నాడు ప్రొద్దున్న నా పంచవద్దకి పాలేరువా డొకడువచ్చి ఆ మహాతల్లి నీకిచ్చి రమ్మన్నారని కొన్ని వూరగాయలు నాలుగుకుంచాల బియ్యం యిచ్చి వెళ్లి పోయాడు. నాకు బలం వచ్చేదాకా ఆ లక్ష్మిదేవి పంపినవి సరిపోయాయి. ఇప్పుడు మామూలుగా కూలి చేసుకుంటున్నా.

ఉంటా రిటువంటి చల్లనితల్లు లక్కడక్కడ!

# సతీత్వము

శ్రీమతి బి. లక్ష్మీవెంకాయమ్మగారు

"కీర్తివంతంబు తేజోమయంబు సర్వగుణములకు నలంకారంబు గురుతరంబు
కాంతలకు పతిభక్తి అనూనమైన భూషణం, బిట్టివే పెరభూషణములు."

ప్రాణేశు ననవరతము సేవించి కీర్తిబడసిన సతీమణి జన్మమే ధన్యమైనది. సావిత్రి తన పాతివ్రత్యమహిమచేతనే గాదా యమునిపై తము గెలువజాలినది. సుకన్య, అంధుడును వృద్ధుడును అగు ప్రాణేశుని యౌవనునిగా జేయగలిగినది ఆమెయొక్క పాతివ్రత్యమహిమచేతనే గాదా. దుర్మార్గుడును పరస్త్రీలోలుడును అగు ప్రాణేశుని సుమతి, తన పాతివ్రత్యమహిమచేతనే గాదా సన్మార్గునిగా జేయ గలిగినది. పతివ్రతయగు కాంత భర్తను ఎడబాసి జీవించలేదు. ఇందుల కీ సతి యొక్క చరిత్రయే నిదర్శనము. పౌరాణికయుగములో మోహినీహరీతులను దంపతులు నివసించుచుండిరి. వారికి చిరకాలమువరకు సంతానములేక వృద్ధాప్యమునందు బేహులాదేవి అను కుమార్తె జన్మించెను. ఆమెయొక్క సౌందర్యము త్రిజగన్మోహనమై శుక్లపక్షసుధాకరునిమాడ్కి వృద్ధిబొందుచుండెను. యుక్తవయస్సు వచ్చినతరువాత జననీజనకులామె నొక సుగుణవంతుడగు వరున కొసంగి పరిణయము గావించిరి. వివాహమునాటిరాత్రియే బేహులాదేవియొక్క ప్రాణేశ్వరుడు సర్పదష్టుడై మరణించెను. బేహులాదేవి బాల్యమునుండియు పతివ్రతల కథలను శ్రద్ధతో వినుచు వారివలెనే తానుగూడ పతినిసేవించి మోక్షము బడయవలయునను వాంఛ గలిగియుండెను. ఆమె తన వాంఛ భగ్నమైనందులకు చింతించి నిజమైన పతివ్రతకు వైధవ్యములేదని ధైర్యమవలంబించి పతియొక్క శవమున కగ్నిసంస్కారములు జరుగకుండ ఆటంకపరచెను. ఆమె పరిశుద్ధమైన మనసుతో ప్రాణేశ్వరునియొక్క పవిత్రనామమును జపించుచు కళేబరమును భుజముమీద వేసుకొని సముద్రతీరమునకు వెళ్లెను. అక్కడ బేహులాదేవి వటవృక్షముక్రింద కూర్చుండి పతియొక్క శవము నొడిలోనుంచుకొని త్రిమూర్తులనుగూర్చి తపస్సుచేయ నారంభించెను. కొన్ని రోజులకు శవము కుళ్లి పురుగులు బయలుదేరి భరించరానిదుర్వాసన వచ్చెను. అప్పటికిని ఆమె శవమును ఒడిలోనేయుంచుకొని తీవ్రముగా తపస్సు చేయుచుండెను. ఆమెయొక్క పతిభక్తికి సంతోషించి త్రిమూర్తులును ప్రత్యక్షులై ఆమె కనేక వరము లిచ్చి పతిని బ్రతికించి అదృశ్యులైరి. సతికి పతియే దైవము.

# మీరాబాయి

శ్రీమతి వి. యస్. నారాయణీ అమ్మగారు

భక్తకోటిలో ననన్యసామాన్యమగు యశమును నార్జించిన ఈ భక్తురాలి జీవితచరిత్ర చిరస్మరణీయము. వినిర్మలకాంతినొప్పు నీమె కీర్తితారకలు నేటి మహిళాలోకమునకూడ ప్రశాంతపూరితముగ మెఱయుచున్నవి. ఉత్తరహిందూస్థానమున నాబాలగోపాల మీమె నిప్పటికిని పూజించుచుందురు. నిర్మలయగు నీ ధ్యానతత్వజ్ఞ చవిజూపిన మోక్షమార్గ మాదర్శప్రాయమని చెప్పనొప్పును. లేబ్రాయముననే వైరాగ్యదీక్షనుబూని క్రమమున బ్రహ్మజ్ఞానమునుజూరగొనిన నీమెపరాక్రమ మద్వితీయమనుటయేకాక దైవప్రేరేపణమనికూడ భావింపవచ్చును.

1475వ సంవత్సరమున మార్వాడదేశమునకు జెందిన రాథోడ్ వంశీయుడగు జయమల్లునకు నీ పుణ్యశీల పుట్టెను. విద్యావతియై చిన్నతనముననే పురాణాది భక్తిరసప్రధానగ్రంథములను జదువనేర్చి, భాగవతోత్తముడగు తన జనకునిచే ప్రాథమిక శిక్షలను బడసినది.

కొంతకాలమైనతరువాత జయమల్లుడు తన యేకైకపుత్రికకు తగిన వరుడు లభింపమి—వెదకి వెదకి వేసారి విచారించుచుండెను. అదృష్టవశమున సమానగుణసంపదలచే పేర్వడసిన ఉదయపురాధీశుడగు కుంభరాణా, తనంతతానే,—వినుతికెక్కిన నీ విదుషి గుణగణముల ప్రాశస్త్యమును విని జయమల్లుని యనుమతినిబడసి యామెను బెండ్లాడెను. దంపతు లిరువురును సమానవిద్యాగుణరూపములు గలవారగుటచే పరస్పరముగ నల్లుకొనినవారి యనురాగబంధములు నానాటికిని దట్టములై, బిగువగుచుండెను. ఇరువురును సమానపాండిత్యమును గడించినవారు గుణప్రాశస్త్యమందన్నను ఒకరిని మించినవా రింకొకరు. ఇరువురకు భేద మొక సందర్భమున చాల గలదు. భర్త కేవల మిహలోకవిషయ లాలసుడు. భార్య పారమార్థికధ్యానతత్పర. ఇదియే వీరిలో గొప్పలోటు.

మీరాబాయికి శ్రీమహావిష్ణు విలవేల్పు; సర్వకాలములం దామె కాతని చింతనమే; దినమున నగముకాలము పూజలం దామె వినియోగించుచుండెను. కొన్ని సమయములను ప్రార్థనలు సల్పుటకు మరికొన్నివేళలు పరమేశ్వరుని స్తుతించుటను, కీర్తనముల వ్రాయుటకు నియమించుచు భగవధ్ధ్యాననిరతయై కాలమును గడపుచుండెను. అంతఃపురమున దాసిజన మామెయుపదేశములచే భగవధ్ధ్యానమందే లీనులై నిర్మలమనస్కులగుచుండిరి.

రాజాంతఃపురము ధ్యాననిష్ఠల కనుకూలముగ నుండదని యెంచి, ఊరివెలుపల శ్రీకృష్ణాలయము నొకటి నిర్మించి, ఆ భక్తురాలు ప్రతిదిన మచటికేగి, పరమేశ్వరునిగా భావించి ప్రతిష్ఠించిన అందలి శ్రీ కృష్ణవిగ్రహమును నిశ్చలభక్తిని పూజించి, ధ్యానతత్పరమతియై కీర్తించుచు, పాటల పాడుచు కొన్ని సమయములందు తెలివితప్పి భక్త్యావేశమున క్రిందపడిపోవుచుండెను. కోకిలస్వనమును కించు చేయు నాభక్తురాలి మృదుమధురమగు రాగతాళముల సమ్మేళనము నాట్యానుసరణీయమై, చుట్టుప్రక్కలనుండువారిని మైమరపించి భక్తిరసమున ముంచుచుండెను. క్రమమున నీ భక్తురాలి యశోప్రాశస్త్యములు నల్దెసలు వ్యాపింప భగవద్భక్తు లనేకు లామెను, జాతిమతవివక్షత లేశమైనను గణింపక చూడవచ్చుచుండిరి. అసంఖ్యాకులుగ యోగవిద్యాధికులు విష్ణుభక్తిపరాయణులు వచ్చి యామె చెంతవసించుచుండుటచే, ధ్యానతత్పరమతియగు నా బాలతపస్వినికి దినదినమునకు భక్త్యావేశ మిళితమగు ఉద్రేకము మెండగుచుండెను. కేవల భక్తిరసమున దేలియాడు నామె జీవచరిత్రమున విద్యాధికులగు భక్తజనులతోడి పరిచయ మొక నూత

సాధ్యాయము గల్పించెను. భక్తుల వాదప్రతివాదము లచే యోగవిద్యమూలమున బ్రహ్మజ్ఞాన మలవరచు కొనవచ్చునని మీరా తుదకు దెలిసికొనగలిగెను.

అపారమగు మీరాబాయికీర్తి దేశమంతటను వ్యాపించెను. భక్తిపూరితములగు నామెరచించిన కీర్తనలు, జనులు కంఠస్థములుగ పాడుచుండిరి. పరమ పావనియగు నామె నామము వందనీయమును పూజ్య మును నయ్యెను. సమకాలికుడగు అక్బరు చక్రవర్తి మీరాబాయియొక్క ఖ్యాతి విని, యామె నొక సారి చూడనెంచెను. కాని మీరా రాజపుత్రకాంత యగుటవలనను రాజపుత్రులకును మహమ్మదీయ చక్ర వర్తికిని వైరములు విరివిగ ప్రబలియుండుటచేతను, ఢిల్లీపాదుషా కోరిక ఫలించు వీలులేకుండెను. ఎట్ట కేల కాతడు తన యాస్థానమందలి "తాన్సేన్" అను గాయకుని రావించి వానితో నీవిషయమునుగూర్చి యాలోచించెను. తాన్సేన్ తనవెంట సన్యాసివేష మునుదాల్చి వచ్చినచో మీరాను చూడనగునని చక్రవర్తికి సలహా జెప్పెను. చక్రవర్తి తన యను చరునితో గలసి మీరామందిరమును జేరెను. మూర్తీ భవించిన యా భక్తురాలి నిర్మలదీక్షాపరతంత్రత కును, ప్రశాంతిపూరితమగు భక్తితత్పరతకును వచ్చెరు వంది, చక్రవర్తి ముక్తిసాధన ముపదేశింపుమని ఆ పవిత్రహృదయ పాదములపైబడెను. మీరా కరు ణార్ద్రహృదయయై "దైవభక్తియే ముక్తిని సాధించు టకు మార్గము" అని యుపదేశించెను. ఢిల్లీ చక్ర వర్తి ఆనందకందళితహృదయుడై సాధారణ మానవుని కన్న అధమమగు తన జన్మ ముపదేశమును బొందు టచే తరించెనని యెంచెను. ఉపదేశమును బొందిన యనంతర మాతడు కృతజ్ఞతాపూర్వకముగ గురుదక్షి ణగా తనయొద్ద దాచియుంచిన రత్నహారమును నొకటిదీసి యిచ్చెను. సన్యాసుల కలభ్యమగు నా రత్నహారము నీ కెట్లు వచ్చినదని మీరా సందేహా స్పదముగ బ్రశ్నింప, దానిని తన కొకరాజు బహూ కరించెనని మారువేషముననున్న ఢిల్లీచక్రవర్తి బదులు జెప్పెను. మీరా అమూల్యమగు నాహారమును గై కొనుట కిచ్చగింపలేదు. కాని తుదకా కపటసన్యాసి ఆమె నెట్లో యొప్పించి దానిని శ్రీకృష్ణస్వామి మెడలో వేసి చనెను.

కొంతకాలమున కా రత్నహారమునుగూర్చి రాజు నకు దెలిసెను. అది ఢిల్లీపాదుషాదని వినికూడ నాతడు స్థిరపరచుకొనెను. తన భార్య సౌశీల్యము నకు గళంకము తెచ్చెనని యాగ్రహపరవశుడై, పూత చరిత్రయగు నామెకు ఆత్మహత్య యొనరించుకొమ్మని యుత్తరువొసగెను. పతి యాజ్ఞానుసారిణి గావున మీరా మరునాటి రాత్రి తన దుస్తులనువిడచి యొక చీదరాలివలె చినిగిన యుడుపులను ధరించి, సమీప మునమున్న సరస్వతీతీరమున కేగి పతిని స్మరించుచు నందు ప్రవాహమున బడిపోయెను. కొంతసేపటి కామెకు దేహస్మృతి తప్పెను. కాని అంతరంగిక మగు నాత్మకుమాత్ర మించుకైనను చలనము గలుగ లేదు. పిదప మూర్ఛాపరవశయగు నామె కొక దివ్యతేజము గోచరించెను. ఆమె కపు డించుకంత తెలివి వచ్చినట్లుండెను. కాని కన్నుల దెఱువజాల కుండెను. వీనులకుమాత్రము దివ్యతేజమునుండి వెడలి వచ్చిన కొన్ని విస్ఫుటవాక్యములు వినవచ్చినవి. అవి "మీరా! నీ జీవిత మింకను ముగియలేదు. భావి కార్యమునకు గడంగుము. అదియె నీ కర్తవ్యము" తరువాత కొంతసేపటికా సాధ్వి కనులు దెఱచుసరికి తానొక నదీతీరమున జేరినట్లు దెలిసికొనెను. పూర్తిగ తెలివి వచ్చుసరికి తన కట్టెదుట పశువులు మేయు చుండ గొల్లపిల్లవాండ్రాడుకొనుచుండిరి. ఆకటి బాధచే చాల నొచ్చియుండిన యామెకు వారందరు పూజ్యభావమున పాలు గొనివచ్చి త్రాగనిచ్చిరి. కొంతసేపటికి గోపాలురు కొందరు దారిజూప మెల్లగ నడచుచు విశ్రాంతియైనను లేక మార్గమున నక్కడక్కడ యుపదేశములనుగ్రహించిన శిష్యులు వెనువెంటనె వచ్చుచుండ నాధీర శ్రీకృష్ణదేవుని క్రీడాపురమగు బృందావనమును ప్రవేశించెను.

బృందావనమున నిదివరకే "జీవగోసాయి" యను నొక గొప్పసన్యాసి వేలకొలది శిష్యులు చుట్టూ పరి వేష్టించియుండ ఆ యూరివారందరికి స్త్రీపరిత్యాగ వ్రతమువలన మోక్షము సమకూరునని బోధించుచుం డుట మీరా వినెను. స్త్రీ ద్వేషియగు నా సన్యా సికి మీరా "శ్రీకృష్ణభగవానునికి పురుషులైనను పతులకు సతులవలె బృందావనమున సేవింతురు.



పర్దేషి కులకాంత

(ఉత్తర హిందూస్థానము)

కాన నట్టి భక్తులు స్త్రీలైనను పురుషులైనను నొకటే యని భావించు టుత్తమము. స్త్రీయైనను పురుషుడైనను భక్తియే ఆ మహామహునికి ప్రధానము. కావున స్త్రీద్వేషమును బూని భేదాభిప్రాయుడైన పురుషుడు భక్తుడు కానేరడు" అని యొక భక్తుని ద్వారా వర్తమాన మంపెను. సన్యాసి తన యజ్ఞానమునకు సిగ్గుపడి, మీరాబాయి కడకేగి, నమస్కరించి క్షమింపవలయునని వేడుకొనెను. నాటినుండియు తనొక శిష్యునిగ భావింప సన్యాసి ప్రార్థింప భక్తాగ్రేసరయగు మీరాబాయి అందులకు సమ్మతించెను.

బృందావనమున శ్రీ కృష్ణమందిరమున వసించుచు మోక్షదీక్షాపరతంత్రత హృదయమున సల్లడల నలముకొన భక్తియుతమగు పాటలబాడుచు బృందాధినాథుడగు వాసుదేవుని గొల్చుచుండెను.

కుంభరాణా, సాధ్వియగు భార్యయెడ తను గావించిన యపకారమునకు మిక్కిలి పరితపించెను. బృందావనమున శ్రీ కృష్ణసేవాపరాయణయై వసించుచుండిన వార్తను విని యమాత్యసహితుడై ఆమెను జూడ బయలుదేరెను. కోటిసూర్యప్రభా తేజోమండితయగు నా దివ్యతేజస్స్వరూపిణిని జూచి రాణా "క్షమింపు" మని యామె పాదములపైబడెను. మీరా పతివ్రత గావున నాథుని లేవదీసి ప్రతిక్షమాపణను వేడుకొనెను. భర్త తనయెడల జూపిన యనుగ్రహమున కానందనిమగ్నయై ఆసతి పతివెంట శిష్యగణముతో గలసి నిజపురమున కేగెను. చిరకాలమువరకా పుణ్యదంపతులు వైరాగ్యమునుబూని, తుదకు సాయుజ్యమును వడసిరి.

# ఆక్షణమొక్కటె

వజ్ఝల కాళిదాసుగారు

(ప్రమద్వరకొరకు వెదకుచు రురుడు వనమున వెడలుచున్నాడు............అశుభసూచకముగా ప్రకృతియే కనబడును. అతని కనులలో సంభ్రమము......కాని విధి?)

గాలికదలెడుశబ్దంబుకాని, పూలు
రాలిపడుధ్వనికాని, దూరానగొండ
నుండిపడునేటిచడికాని, గండుకోకి
లము పలుకుగాని సోకదుశ్రవణములకు.
అబ్ధిగర్భంబునుండి బయల్వడి యొక
చిరుతమేఘముకప్పెను తరుణసూర్యు;
కొమ్మసందుల చీకటి గూటినుండి
యార్చెభయదాయకముగా దివాంధమొండు.
పూవులేలేక, సహజమౌ పొలుపులేక
జీవసత్త్వహీనములై యచేతనములు
గాగసంబడె నెల్లవృక్షములుగూడ
శైశిరాశ్లేష కాలపాశమునబోలె.
ఎందులకొకానిదుఃఖ మూహింపలేని
యాతనయొకండుకలచె హృదంతరంబు;
వానికనులలో మెరపులబరవజేసి
మొటనొక్కృతియించె నెదియొయదృష్టరేఖ!

వడివడిగబోవునాతనియడుగు లొక్క
మారుగానాగె భయదసంభ్రమపరీత
భావనాచాలితమ్ములై పట్టుపీడి,
పథము సాత్రాళమార్గము పట్టెననగ:
వానికన్నులబడె ప్రమద్వరయుచేత
నముగనేలపై నుంట, కృష్ణమణికలిత
సర్పమొండు మృత్యూగ్రనిశ్వాసమొదవ
పార్శ్వవల్మీకపథమునబరుగులిడుట:
హాయనుచునాతడునశుడై యామెచెంత
వ్రాలివిలపించె ప్రియ ప్రమద్వరయటంచు;
ఒక్కపల్కునియును లేక యొక్కమారె,
క్షణమె-యామె మెల్లన జూచెగనులువిచ్చి;
ఆక్షణమ్మొక్కటె యనంతమై యుగయుగ
విలయగతిలేనిశాశ్వత నిలయమందు
మూతపడబోని నిర్జరపూతదృష్టి
మాలికలుసోలెనమరత్వమహిమగొనిన?

# వియోగభ్రమరము

పురిపండా అప్పలస్వామిగారు (కవితాసమితి)

ప్రాణముకూడా అర్పిస్తానన్నాను.

నాపూవు మాత్రము నాకోసం ఈ ఆకులసందునేఉంటే చాలునన్నాను.

అదేలోకమనుకొని, దానికోసమే బ్రతుకుదా మనుకున్నాను.

ఒక చిన్నగాలివచ్చి తన రేకులుని కదిపేసరికి నిలువునా నాప్రాణాలు కదిలిపోయేవి.

ఎంతచిన్న మంచుబొట్లు దాని దళాలిని సోకినా నారెక్కలతో ఒత్తే వరకు నాకు చీకటిగాఉండేది.

తన పరిమళములో నేను స్నానమాడినపుడు, తన పరాగలేశము నా హృదయానికి అలందినపుడు నాకోసం తనమందస్మితంతోపాటు మధుకణంకూడ ఉపాయనమిచ్చేటపుడు నన్ను నేనేమరచిపోయాను. ఉన్మత్తుడనైపోయాను.

నాగర్వాన్నిచూసి పరమేశ్వరుడే తలవంచాడు. అయ్యో! నాసర్వస్వమూ తీసుకొని నాపూవును మాత్రము ఉంచమన్నాను.

నాప్రాణముపోయినా నాపువ్వునాకుంటే బ్రతుకగల నన్నాను.

కాని, ఈపాడు విశ్వములో జడపదార్థం సైతమూ నాసుఖాన్నీ, నా అనుభూతినీచూసి ఓర్వలేకపోయింది.

ఏక్రూరహస్తమో, ఏనిష్ఠురహృదయమో, ఆ మేఘనిశీథాన్ని: నా పూవును కోసుకొనిపోయింది. విశ్వాన్నిచూర్ణం చేయగలిగినంత బలంతో నా పూవును, నాప్రాణాన్ని కౌగిలించుకున్నాను. ముల్లోకాలూ కంపించేటట్లుగా రోదించాను. కాని, ఆకరమాగలేదు. నిష్ఠురహృదయం కరగలేదు.

లాగికొనిపోయినది.

# ఓర్పు

శ్రీమతి పాకల చంద్రకాంతామణిగారు

ఆమె యొకపేదవారి యింటిబిడ్డ. అతడొక శ్రీమంతుడు.

ఆమెనాతడు ఆమె సౌందర్యము—కాదు, వినయసౌశీల్యములు—జూచి పెండ్లియాడెను. వినయమే ఆమె పట్టుదుస్తులు. ఓర్పు, దయ, ఆమె రత్నభూషణములు. అత డామెఓర్పును బరీక్షింపనెంచెను.

సంవత్సరమాయెను. ముద్దులమూటగట్టు చిన్నపిల్ల నామెక [illegible] మాలవాండ్రను బిలచి ఆపసి సిసువును ఖండింప నామెయెదుటనే యాత డాజ్ఞాపించెను. వా రాబాలిక నెత్తుకొని స్వామియాజ్ఞ నెరవేర్ప వెడలిపోయిరి.

రెండవ సంవత్సరమాయెను. మరల పాలుగారుచెక్కిళ్లతో ముద్దుగారు పసిపాపని ఆమె కనెను. ఆమెయెదుటనే యాబాలునిగూడ మాలవాండ్రచేతులలో నిడెను.

ఐదు సంవత్సరములాయెను. అత డామెను పుట్టినింటికి వెడలిపొమ్మనెను. నాథునాజ్ఞనౌదలనిడి శాంతచిత్తముతో పతికినమస్కరించి ఆమె వెడలిపోయెను.

ఎనిమిది సంవత్సరములాయెను. అతడు ద్వితీయవివాహ మొనర్చుకొనగోరి ఆమెను వివాహకార్యములొనర్ప రమ్మనిపిలచెను. ఆమెయు వెంటనేవచ్చి నాథుని యనుజ్ఞబొంది వివాహకార్యము లొనర్పసాగెను.

వివాహముహూర్తము సమీపించెను. అత డామెను వధువునొద్దకు గొంపోయెను.

ఆమెచూచెను. వధువు అధికసౌందర్యవతి. ఆమె ఆనందముతో వధువును ప్రేమమీరకౌగలించి, ముద్దులిడెను. వెనుక నాథునిపాదములసద్ద మోకరిలి "హృదయేశ్వరా! నాదొకవిన్నపము. మీ రీసుకుమారిపాణినిగ్రహించెదరు గాని నావలెగాక నిర్మలప్రేమతో ఈసుందరాంగిని ప్రేమించెదరుగాక' యనిప్రార్థించెను.

ఇంక నాతడోరిమి పట్టలేక యామెను లేవనెత్తి బాహువులచే బంధించి ప్రాణేశ్వరీ! క్షమింపుము. నీఓరిమి పరిశీలింప నే గావించిన కార్యమిది. ప్రియా! ఈమెయే మనపుత్రిక, పార్శ్వముననున్న యాసుందరాంగుడే మనప్రియపుత్రుడు.

ఆమె వెంటనే ఆత్మేశునిపాదములపై బడి యాతనిపాదముల నానందబాష్పములచే నభిషేకించెను.

# గానము

### హిందుసాని తోడిరాగం—ఆదితాళం

సాసరిగమా, గారిసా, సనిసరి, సనిధా, ధనిసారిసాని॥

(1) పార్వఅలతీ, నందనా, భజనలఅలఅల, జేఎసేదనీకు॥
పాప్ప. పదపదప, మాన్మ్మమప, మపమ, గాగగమపదా।
పాలుమఅరు ఉ ఉ, వేడుచుంటి ఇ ఇ, పారమెఎశ్వరా।
గారిసా, సనిసరి, సనిధా ధనిసారిసా ॥సా॥
నందనా, భ క్త అ అ, అలఅ, చందానవేగ ॥పా॥

(2) మూషకవాహనా, భూషణా, దోషాపహరణ,
దాసపోషక, దోషమెంచక, పోషించిబ్రోవుమా,
భూషణా, చరితవేగ ॥పా॥

(3) మందారాకూసుమల్, మల్లే ఏ ఏ పూవూలసరులు
మారేడీ, దాళము ఉ ఊ, మాచిపత్రీ, కాలతోన
ర్చనా, జేసెదనీకు ॥పా॥

(4) పుండ్రాల్లూ, పెట్టెదరా, దండిగావండీనమంచి
ఖండచాక్కెర, నారికేళలు, ఖర్జూరఫలములుమెండు
గా, దెచ్చితివేగ ॥పా॥

(5) స్వారాజ్యవ్రతము, నిరతఅమూబూనీతి మదిలో
సరగున వెంకటమ్మకు, వరమూలొసగి బ్రోవుమా,
కోరికే, గై కొనువేగ ॥పా॥

## భరతమాత

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

భారతభాగ్యమాతా! మముబ్రోవు కరుణాసమేత॥

(1) రత్నగర్భయను రంజిలుబిరుదము రమణీయయశోగాన
మునెల్లడ మ్రోగుచుండియును మూర్ఖసుతులచే కా
నికైసకలువందగనయ్యెను ॥భా॥

(2) అగర్భశ్రీమంతులమగుమే మాకటిచేతహాతహా

## రాగిపాత్ర మహిమ :—

రాగిపాత్రను చిలుముపోవునట్లు చింతపండు పులుసుతోగాని నిమ్మపండు పులుసుతోగాని శుద్ధముగ తోమవలయును. ఆ తోమినపాత్రలో 3 శేర్ల శుద్ధ జలమును పోసి రాత్రి పరుండునప్పుడు తన పడక ప్రక్కన పెట్టుకొని ఆ పాత్రలో ధూళిదూసరములు క్రిమికీటకాదులు పడకుండ మూతపెట్టి భద్రపరచుకొనవలయును. మరుసటిదినము తెల్లవారగనే ఈ రాగిపాత్రలోయుండు $2\frac{1}{2}$ శేరు జలములో నోటిని పలుమారు పుక్కిలించిన నోటిలో చేరియుండు విష క్రిమికూటము నాశనముచెంది నోరు శుద్ధమగును. మిగిలిన అర్ధశేరు జలములో అరచటాకు తెల్లవుప్పును వేసి కరిగించి త్రాగిన మలబద్ధకమను క్రూరవ్యాధి మాయమగును. కఫరోగములకు, కళ్లరోగములకు యిది శ్రేష్ఠమైన చికిత్స. అరుగంటలకాలము తామ్రపాత్రలోనుండిన జలము క్రిమినాశనకరమని పరిశోధకులు కనుగొనియున్నారు.

## నల్లరేగడిమట్టి మహిమ :—

ఏటిగొడ్డునుండు శుద్ధమైన నల్లరేగడిమట్టి మహిమ యిప్పటివారికి విశేషముగ తెలియకపోయినను మన పూర్వీకులు చక్కగ గ్రహించియున్నారు. ఇప్పటికిని గ్రామములలో పేదసాదలు సబ్బు, సీకాయలకు బదులు యీ రేగడిమట్టినే వుపయోగించుచున్నారు. జిడ్డును పోగొట్టి చర్మమునకును తల వెంట్రుకలకును మెరుగుపెట్టుటలో యీ మట్టి శాశ్వతమైనది.

ఈ మట్టిపూతలవలన అనేక రోగములను కుదుర్చుచున్నట్లు ప్రకృతి వైద్యవేత్తలు చెప్పుచున్నారు. పాశ్చాత్యులు యీ మట్టిపూతలచేత స్త్రీల శృంగారమును పెంపొందించుచున్నట్లు ప్రకటించుచున్నారు. గనుక మనకు సులభముగ లభించు యీ బంకమట్టి మహిమను మనముకూడ గ్రహించి వాడుచుండవలయును.

## తులసి—వేపచిగురు :—

అయిదు తులసిదళములును రెండు వేపచిగురులును చేర్చి ప్రాతఃకాలముననే నమిలి మింగిన అన్నాశయమును శుద్ధపరచి నులిపురుగులను నశింపజేసి ఆరోగ్యభాగ్యము నిచ్చును.

## బచ్చలాకు :—

బచ్చలిలో మొక్కబచ్చలి తీగెబచ్చలని రెండు జాతులును తీగబచ్చలిలో పచ్చరకములును గలవు. ఆకుకూరలలో నెల్ల యీ బచ్చలికూర ఆరోగ్యమునకు శ్రేష్ఠమైనదని వైద్యులు కనుగొనియున్నారు. ఈ బచ్చలికూర ఆంధ్రదేశమునకు అపూర్వముకాదు గనుక అందరును దీనిని భుజించి ఆరోగ్యమును సంపాదించుకొనవలయును.

## గుమ్మడిపండువిత్తుల గుణము :—

అజీర్ణమువల్ల అన్నాశయమునపుట్టు నాడాపాములకు (Tapeworms) సులభమైన చికిత్స. గుమ్మడి విత్తులను చక్కగకడిగి రొండబెట్టవలయును. తేమ ఆరినపిమ్మట సుమారు అయిదుతులముల విత్తులను తీసికొని రోటిలోవేసి మెత్తగదంచి కొద్దిగ జుంటి తేనెను కలిపి లేహ్యముగ ముద్దచేసి పెట్టుకొనవలయును. ఈ ఔషధమును సేవించదలచుకొన్నవాడు అన్నమును భుజించకుండ వేడినీళ్లలో నిమ్మపండు రసమును పిండి త్రాగవలయును. అనగా ఒక గ్లాసుటమ్లర్ నిండు నీళ్లకు ఒక నిమ్మపండు చాలును. ఈప్రకారము దినము 4, 5 పర్యాయములుచేసి రాత్రి పరుండునప్పుడు పైనచెప్పిన గుమ్మడివిత్తులలేహ్యమును సేవించి పరుండిన గర్భములోని పురుగులు నశించి మరునాడు వెలపలపడిపోవును.

పడుచుంటిమి వృత్తులన్ని నశియించిపోయెనిక భిక్ష
వృత్తిబిరుదుగ గైకొంటిమి ॥భా॥

(3) త్రింశత్కోటి తనయులుగల్గిన తల్లికిదాస్యము త
ప్పదయ్యెనే ఓర్పునధరణీతుల్యననియెడి యుదాహర
ణముజూపితివమ్మ ॥భా॥

(4) వైనతేయునొక్కనివరతనయుగ వినతగాంచగను వ
దలెనుదాస్యము చెదలబోలుచెడు తనయులందరము
చేరుచుంటిమిలసేవకవృత్తుల ॥భా॥

(5) షోడశరాజులు షట్చక్రవర్తులు శివాజిమొదలగు
శూరతనయులు బొబ్బిలివీరులు పూర్ణచంద్రరస
పుత్రసింహములు భువినీసుతులని పూజింపబడిరి ॥భా॥

(6) అట్టిసంతతివారముమాకా ఆర్యులరక్తమునాశనాశ
ముల అణగియున్నదికపొంగుచుండెను అమ్మదా
స్యమికఅంతమొందును ॥భా॥

(7) వైనతేయునివలెనేగాంధి వదలించునునీదాస్యబం
ధములు వనటనొందకమ్మ వందనమమ్మా! వరధారుణి
యో తల్లిభారతీ! ॥భా॥

(8) దీవించుమియోదివ్యభారతీ! దివ్యఆశీస్సులదీనసు
తులపై ధనము, బలము మానంబుగైకొని ధర్మవర్త
నము తనయులుపొందగ ॥భా॥

## చిక్కుళ్లగౌరి

బండా కనకలింగేశ్వరరావుగారు బి. యె. (ఆనర్సు.)

చిక్కు, చిక్కునగాని,
చిక్కుళ్లగౌరీనోము,
చెల్లి—పట్టావె.
కంటికాటుక, కరగాకుండ,
చేతీగాజు, చెదరాకుండ
కాలీమట్టె, కదలాకుండ
చీకూచింతలు, చేర్రాకుండ
చిక్కుళ్లగౌరీనోము,
చెల్లి—పట్టావె.

విడిచినచీరాకట్టాకుండ
తొడిగినరవికాతొలగాకుండ
ఒంటీసొమ్ములు—వదలాకుండ
యింటీపురుషుడు వెంటానుండ,
చిక్కుళ్లగౌరీనోము,
చెల్లి—పట్టావె.



# సౌందర్యపోషణ

## పరిమళ తలనూనెలు (Hair Oils)

సువాసనతలనూనెలను తయారుచేయుటకు శుద్ధి చేసిన కొబ్బరినూనె, నువ్వులనూనె, ఆలివునూనెలు శ్రేష్టములైనవి. ఈమూటిలో దేనినైనను ఒక నూనెను సుమారు ఒక వీసెడునూనెను తీసుకొని పాత్రలోపోసి కొద్దిగకాచి వడియకట్టుకొనవలయును. వేడి కొద్దిగవున్నపుడే యిష్టమువచ్చిన అత్తరులను కావలసినమట్టుకు నూనెలో కలుపుకొని బుడ్డిలోపోసి కార్కుతోమూసి భద్రపరచుకొనవలయును. తలనూనెలో యేరంగు కలుపకుండ తెల్లగ నుండుట శ్రేష్టము. నూనెకు రంగు కావలసినవారు నూనెలో కలుపుటకు పలువిధములైన రంగులు విక్రయించుచున్నారు. వాటిని తెచ్చి కొద్దిగ కలుపుకొనవచ్చును. మల్లె, చంపక, రోజా, మెంగలి, గోరింట, పొగడ, వట్టివేరు, మరువం, దవనం మొదలగు అత్తరులు విరివిగ షాపులలో దొరుకగలవు.

### మల్లెనూనె :—

నల్లనువ్వులను మన్ను రాళ్లు లేకుండ చక్కచేసుకొనవలయును. వెడల్పాటిపాత్రలో యీ చక్కచేసిన నువ్వులను పలచగ పరుపవలయును. ఆ నువ్వుల పైభాగమున పూర్తిగ విచ్చని మల్లెపూలను పరుపవలయును. అనగా సాయంసమయమున కోసిన మల్లెపుష్పములు యిందుకు శ్రేష్ఠములు. ఇందుకు గుండుమల్లెలు మంచిది. ఆ పూలమీద మరల కొద్దిగ నువ్వులను పరచవలయును. ఈప్రకారము ప్రతి దినము ఒక్కొక్క పొరను పరచుచుండి మూత పెట్టుచుండవలయును. పదినములు యీప్రకారము చేసి అందుండు నువ్వులనుమాత్రము వేరుచేసి తీసుకొని గానుగ ఆడించిన మల్లెనూనె వచ్చును. అనగ యీ నువ్వులు మల్లెపూలలో క్రమముగ మాగిన సదరుపువ్వుల సువాసన నువ్వులు కిచ్చివేయును. పూలు వేసినకొలది వాసన జాస్తియగును.

### బొగ్గు పల్లుపొడి :—

చింతచెట్టు బెరడునుగాని తుమ్మచెట్టు బెరడును గాని తీసి నల్లగ బొగ్గుచేయవలయును. ఈ బొగ్గు రోటిలోవేసి దంచి జల్లెడపట్టవలయును. ఈపొడిని యిరవైతులముల తూనికెను తీసికొని అందులో వస్త్రకాళితముపట్టిన ముదురు వేపపట్టపొడుమును పదితులములకు కలిపి పిమ్మట మూడుతులముల తెల్ల వుప్పును, యిరువైచుక్కల పెప్పరమింట్ ఆయిల్ (Peppermint Oil) యిరువైచుక్కల లవంగపట్ట తైలమును కలిపి మరియొకతూరి జల్లెడపట్టి బుడ్డిలో పోసి భద్రపరచుకొని వాడుకొనవలయును. పెప్పరమింట్ ఆయిలుకు బదులు కర్పూరతైలము, యూకలిప్టస్ తైలము వాడవచ్చును. లేదా కర్పూరమును ¼ తులమును వాడవచ్చును.

# పాకకళ

## —:పనసకాయ కూర:—

గింజలు పట్టీపట్టని లేత పనసకాయను అప్పుడే కోసికొనివచ్చి దానిపైనున్న ముళ్ళను తీసివేసి ఆకాయను కడిగిచేసి సన్నముగ రంపముపొట్టువలె దానిని పొట్టుకొట్టవలయును. ఆపొట్టును నీళ్లు కళకళమరుగుచున్నపుడు దానిలోపోసి వెంటనే ఒకఉడుకు వచ్చినతర్వాత వార్చివైచి ఒకపళ్లెములో నుంచవలయును. ఒకగిన్నెలో కొంచెము నూనెవేసి ఆనూనె కాగినతరువాత దానిలో ఆవాలు, మిరపకాయముక్కలు, మినపపప్పు, కరివేపాకు. ఒట్టిపడియములు, వీటిని తగుమాత్రమువైచి పోగుపు కమ్మగ వేగినతరువాత ఇదివరలో నుడికించి పళ్లెములోనుంచిన పనసపొట్టును ఆపోగుపులోవేసి తగుమాత్రము ఉప్పు, పుసుపు, నూరిన ఆవపిండి, వీటిని కూడవేసి 5 నిముషములు ఉడకనిచ్చి క్రిందికిదింపి ఆకూరను అన్నముతో భుజించిన మిక్కిలి రుచికలిగి ఎంతతినినను ఇంకను తినవలెనని ఉండును. ఇది శరీరమునకు చాలా ఆరోగ్యకరమైనది. పనసపొట్టు కొట్టేటప్పుడు కనరెక్కకుండుటకు దానిలో కొంచెము పసుపు, నూనె, కలపవలయును. —పిడపర్తి అన్నపూర్ణమ్మ.

## —ఇంకొకవిధము—

పై విధముగ తయారుచేసిన పనసపొట్టును పెసరపప్పులో కలిపి ఉడికించి వార్చివైచి అందులో తగుమాత్రము ఉప్పువేసి పైవలెనే మిరపకాయముక్కలు, ఇంగువ, కరివేపాకు, మినపపప్పు, ఒట్టిపడియములు, వీటితో తగుమాత్రము తిరగబోతపెట్టి దించి అన్నముతో భుజించిన మిక్కిలి కమ్మతనముకలిగి నోటికెంతో రుచిగను, శరీరమునకారోగ్యముగను యుండును. —పిడపర్తి అన్నపూర్ణమ్మ

## —మెంతికూర సండిగపిండి—

వేసవికాలంలో, కాయధాన్యములన్ని చక్కచేసుకుని, ఉంటారుకదా? అందులో ముఖ్యముగా కంది పప్పులో పెద్ద నూకలువస్తవి. అవి బాగ చక్కబెట్టి బరకగా విసరి ఆపిండిని, వారి, వారి, సంసారమునకు కాబట్టినంత, తీసుకుని. ఒకగిన్నెలో కొంచెం నీళ్లుపోసి అరగంట వూరనిచ్చేది. తరువాత దానికి కావలసిన ఎండుమిరపకాయలు, ఉప్పు, ఇంగువ, అంత రోటనూరి, ఈవూరపెట్టినపిండి, కూడావేసి ఒకనూరు, నూరి, పెట్టుకుని, ప్రాయ్యిమంటవేసి, ఒకగిన్నెలోనీళ్ళు ½ పడిపోసి ప్రాయ్యిమీదపెట్టి బాగ మరగనిచ్చి, ఈపిండి పిడచలుచేసి ఒకటొకటిగా నీళ్ళలోవేస్తె బాగ తేలివుడుకుతవి. ఇంతలో రెండు, లేక మూడు మెంతికూరకట్టలు తీసుకుని దళములు గిల్లుకుని, కొన్ని లేతకాడలు కూడగిల్లి, ఒకచిటిక, ఉప్పురాచి వుంచేది. వుడికిన వుండలన్ని తీసి చల్లారనిచ్చి పొడిగ నలిపి, పెద్దబాణలిలో మరి కొంచెము నెయ్యివేసి, కాగనిచ్చి, కొద్దిగా మినపపప్పు, జీలకర్ర, కొంచెం ఆవాలు, ఇంగువ, పచ్చికరేపాకు, తిరగపోతవేసి, ఈ మెంతికూర నీళ్ళుపిండి నలిపినపొడి అందులోనేవేసి సన్నపుశఘనపొరిటి, దింపిన, పట్టునవెనుండును. ఈసండిగపిండి, బహురుచి, ప్రవర్తిసాఫీగా అగును, పిండి వుడికిననీళ్ళు చారులా పోసుకొనవచ్చును.

—కంకిపాటి రుక్మిణమ్మ

## —కొబ్బరిసుఖియలు—

నలుబదియారు తులముల కొబ్బరికోరును, యినుపకళాయిలోవేసి, పొయ్యిమీదపెట్టి వేయించవలెను.

వేగుచుండగా ముప్పదియారు తులముల బెల్లము లేక నలుబదిరెండు తులముల పంచదారను వేసి కొబ్బరి కోరు ముద్దఅయ్యేటట్లు వేయించవలెను. ముద్దగుట తోడనే దించి, ఉసిరికాయలంత ఉండలను చేయవలెను. ఆయుండలను బియ్యపుపిండి జావలోనుంచి నేతిలో వేయించి భుజింపవలెను. మిక్కిలి రుచిగా నుండును.

—యస్. అనసూయ

## —కొత్తిమిరి చట్నీ—

కొంచెము మంచిమినపపప్పు తగుమాత్రం నేతిలో బాగా వేయించి యుంచుకొనవలెను. అందులో కొతిమిరి (దనియాలకూర) కరివేపాకు, చింతపండు, ఉప్పు, పచ్చిమిరపకాయలు, (ఎండుమిరపకాయలు కూడా వేయవచ్చును.) కొంచెము అల్లము వేసి మెత్తగా రుబ్బవలెను. తరువాత మంచి నిమ్మకాయ లపులును అందులో పిండి ఉపయోగించుకొనవలెను. రుచ్యముగానుండును. అరుచిని పోగొట్టును.

—S. T. P. కృష్ణవేణమ్మ.

## —గోధుమ తుకుడీలు—

గోధుమరవ్వ తెచ్చి కొంచెము పంచదారవేసి పాలుపోసి ముద్దగాతడిపి ఒకఘంట నానబెట్టవలెను. తరువాత కొంచెము నెయ్యివాసి మెత్తగా దంచవలెను. తరువాత అప్పడాలకర్రతో అప్పడాలుచేసి దానిని చాకుతో ముక్కలుగాకోసి నేతిలో వేగించవలెను. గోధుమతుకుడీలు అందురు. యివి నెలరోజులవరకు బాగాయుండును.

—మరకాని తాయారమ్మ.

## —మాంసములేని పలావ్—

అరసోలెడు ధనియాలు, అరతులములవంగాలు, అరతులము యాలక్కాయలు, తులముదాల్చినచెక్క, తులము చినవుల్లిపాయలు, తులము ఆకుపత్రియును కచ్చాపచ్చాగా నలగగొట్టి 3¼ శేర్లు నీళ్లలో వేసి ఆనీళ్ళు శేరులక్షునటుల అనగా 2¼ శేర్లగా అగువరకు మరగకాచవలెను. కాగునపుడు మూతపదేపదే తీయరాదు. తరువాత నీళ్ళువడపోసి విడిగానుంచవలెను.

—పిడపర్తి అన్నపూర్ణమ్మ.

పెదవుల్లిపాయలు పదునైదుతులములు ముక్కలుగా తరిగి నేతిలో వేయించవలెను. తులము చినవుల్లిపాయలు, తులముదాల్చినచెక్క తులంఆకుపత్రి వీటినిగూడ నేతిలో మాడురాకుండ జాగ్రత్తగా వేయించి యుంచవలెను.

అరసోలెడు నేతిలో శేరుబియ్యము (సన్నబియ్యము శ్రేష్టము) కొంచెము రంగువచ్చుటుల వేయించవలెను.

తరువాత మరగకాచి యుంచిన నీళ్ళలో, నేతిలో వేయించియుంచిన పెదవుల్లి వగైరాదినుసులును బియ్యమును కలిపి పొయిమీద పెట్టవలెను. బాగుగా వుడుకుపట్టిన తరువాత వకసారి తెడ్డుతో కలయ కలుపవలెను. మూతతీయకూడదు.

ఈవిధముగా తయారుచేసిన పదార్థము మంచి రుచికరముగనుండును. మాంసాహారదూరులు పలావ్ రుచిని యీవిధముగా కొంత చూరగొనగలరు. పైన శేరుబియ్యము వండుటకు సరిపోవు పద్ధతులు వివరించితిని. హెచ్చు తగ్గులు దానినిబట్టి గ్రహించునది.

—వి. సీతారామాదేవి.

## —నీటివంకాయకూర—

లేత నీటివంకాయలను అప్పుడే కోసికొనివచ్చి ఒకగిన్నెలో నీళ్ళుపోసి ఆవంకాయలను గుత్తులుగ తరిగి ఆనీళ్ళలోనైచి కడిగివేయవలెను. ఇట్లుచేసినచో వంకాయముక్కలు గిజరక్కవు. ఒకగిన్నెలో కొంచెము నూనెపోసి ఆనూనె కాగినతరువాత దానిలో మినపపప్పు, మిరపకాయలు, జీలకర్ర, వీటిని వేసి వేయించి కమ్మగ వేగినతరువాత క్రిందికిదించి రుబ్బురోటిలోవేసి తగినంతవుప్పువేసి మెత్తగకారముకొట్టి ఆకారమును పైవంకాయలలోకూరి సిద్ధముగ నుంచుకోవలెను. తిరుగ ఒకగిన్నెలో కొంచెము నూనె నైచి దానిలో మినపప్పులు, జీలకర్ర, నైచి కమ్మగ వేగినతరువాత దానిలో పైకారముకూరిన వంకాయలను నైచి దానిలో చిక్కని చింతపండు పులుసును కొంచెము వేసి వంకాయలు మెత్తగ ఉడుకువరకు మంటపెట్టి ఉడికినతర్వాత దానిలో కొంచెము నువ్వులపప్పుపిండిని వేసి కలియపెట్టి క్రిందికిదించి దానిని అన్నముతో భుజించిన నోటికి చాలా రుచిగను ఆరోగ్యకరముగను నుండును. ఒకసారితినిన వాడు ఆకూరను జన్మలోనెప్పుడును మరువజాలడు.

# ఆరోగ్యబోధిని

## గొంతు జబ్బులు:—

కచోరముముక్క పాటకులు నోటిలోనుంచుకొని ద్రవము మ్రింగుచుండిన కంఠధ్వనిని బాగుపరచును.

సన్నరాష్ట్రము నమలి ద్రవము మ్రింగిన గొంతు కనపను హరించును.

కాసినిగింజల కషాయమును పుక్కిలించిన గొంతు కనొప్పి శమించును.

ఎర్రగుగ్గిలము తేనెతో గలిపి గొంతుకవాపుకు పట్టు వేసిన నది నయమగును.

నల్లవావిలిఆకు పసరులో నూనెకలిపి పట్టించి రుద్దిన మెడ గొంతుక పీటిబోలు నరములవాపు (Glandular swellings) తొలగును.

కొంతిని ఉప్పునీళ్ళలో అరగంటసేపునానబెట్టి ఆ కొంతినిప్పులపైన కొద్దిగకాల్చితీసి కాలినదానిపై పొప్పరకత్తితో గీసివేసి నూరి మెత్తగచూర్ణము చేసి దానిని 1–4 చిన్నములరొత్తుచొప్పున దినముకు 2-4 మార్లు తేనెతోగలిపి పుచ్చుకొనిన గొంతుకనొప్పి హరించును.

మునగవేరు తేలికకషాయముతో చేసిన పాకము (Syrop) పుచ్చుకొనిన గొంతుకబొంగురుపారడము మానును. అక్కలకర్రకషాయము పుక్కిలించిన గొంతుకరోగములు నివారణమగును.

కురువేరు. దీనియాకురసములో పటికపంచదార గలిపి యిచ్చిన గొంతుకలో పుండయ్యే రోగము తొలగును.

పాతచింతపండు చిక్కనిపులుసు గొంతుకపుండు రోగమును మాన్పును.

చేరేడు కషాయము పుక్కిలించిన గొంతుక పుండు నిమ్మళించును.

వాకుడు పండ్లరసము లోపలికిచ్చిన గొంతుక పుండు రోగమును పోగొట్టును.

సీమ కర్పూరపు ఆకు కషాయము పుక్కిలించిన గొంతుకపుండు పోవును.

భోజనకాలమందు ముందుగ నేతిలో మిరియపు పొడుముకలిపి పుచ్చుకొనిన కంఠమున బుట్టిన రోగములు హరించును.

కంఠరోగమున తువరి మన్నుపైన పూయనగును. త్రికటుక చూర్ణము గళరోగమును హరించును. గళరోగముకు పటికగలిపిననీళ్ళుపుక్కిలించిన నయమగును.

మామిడాకులు కాల్చినపొగ పట్టిన కొన్ని గొంతుక రోగములు నివారణమగును.

వసకొద్దిగకాల్చి నోటిలోనుంచుకొని ద్రవము మ్రింగుచుండిన గొంతునపుండు అణగును. మృదువైన దీని చూర్ణము 1 గోధుమగింజయెత్తు వేడిపాలలో వేసి పుచ్చుకొనిన గొంతుకనస గొంతుకపుండు నిమ్మళించును.

# నవ్వుతాలు

సుబ్బన్న:—ఒరే వెంకన్నా ఆదేమిట్రా రైల్లో పరుగెత్తుతున్నావు?

వెం:—8 గంటలకి మావూళ్లో పెళ్లి జరుగుతుంది. ఈరైలు 8-30కి అక్కడ చేరుతుంది. దీనిలో నేనుకూడా పరుగెత్తితే 30 నిమిషాలు కలిసి వస్తాయని.

— పాకల రాజామణి.

ఇంగ్లాండు దేశములో నొక నగరమున రోమాను అను నొక దొరగారును అతని సతీ తిలకమును కలసి ఒక హోటలుకు వెళ్లి తమకు కావలసిన పదార్థముల నాహరించిరి. ఫలహారానంతరము దొరగారు బిల్లు తెమ్మనెను. హోటలు మేనేజరు బిల్లునిచ్చెను. అందులో 'డిసర్టు' అనబడు పండ్లుకూడ చేర్చబడెను.

దొరగారు:—ఈ డిసర్టును మేము తాకనైన తాకలేదే.

మేనే:—అయ్యా, అది నా తప్పుకాదు. మీయెదుట పెట్టితిమి. మీరారగించినను మానినను దానికి సొమ్ము చెల్లించవలసినదే.

దొర:—సరే, మంచిమాటే.

దొరగారు సొమ్ము చెల్లించిరి.

మేనే:—అయ్యా, అయిదు షిల్లింగులు తక్కువున్నవే!

దొర:—నా భార్యను నీవు చుంబనము చేసుకున్నందు కాసొమ్ము తగ్గించినాను.

మేనే:—వింతమాట! నే నట్టి పనిచేయలేదే.

దొర:—చేయకున్నచో ఆతప్పు నాదికాదు. ఆమె నీయెదుట కనపడలేదా? నీ వామెను ముద్దిడినను మానినను నే నాసొమ్ము కొట్టివేయక మానను (అనుచు నడచిపోయెను.)

* * *

మాష్టరు:— అబ్బాయిలూ! దూరబంధుత్వమంటే తెలుసున్రా?

ఒకపిల్లవాడు:—తెలుసునండీ.

మా—అయితే నీకు దూరబంధువులెవరో చెప్పు.

పి—లండనులో చదువుచున్న మా పెద్దన్నయ్య.

* * *

కొడుకు—నాన్నా! నాకు డాక్టరు తొడుక్కునే వేస్టుకోటు కుట్టించవు?

తండ్రి—ఎందుకురా అది? అనవసరంగా వేస్టు.

* * *

టీచరు—(పిల్లలతో) నేనొక సంగతి చెపుతా వినండి. పూర్వం ఒక జాతిమనుష్యుల్లో ఒక ఆచారం ఉండేది. నల్లజుట్టువారు నల్లదుస్తులను, తెల్లజుట్టువారు తెల్లదుస్తులను తొడిగేవారు.....

పిల్లవాడు—బట్టతలవాళ్లు యేదుస్తులు తొడిగే వాళ్లండి?

* * *

"అబ్బాయ్, చిన్నబ్బాయికి జ్వరం కొలవగలవురా?"

"ఆ గజంబద్ద యెక్కడ?"

* * *

పల్లెటూరువాడు—క్రాపు కత్తిరించాలోయ్!

మంగలి—ఆ........(నున్నగా కత్తిరించును)

ప—ఇదేమిటయ్యా యిట్లా చేశావు?

మం—బోర్డుచూడు. క్రాపు కత్తిరించబడునని లేదా?

* * *

పిల్లవాడు—అమ్మా! ఎందుకే యేడుస్తావు?

తల్లి—మీ మామయ్య పోయాడురా.

పి—అత్తదగ్గరకా?

—కె. బి. మూర్తి.

# బాలవిజ్ఞానశాఖ

## తొక్కుపలుకులు

సుంకరి రామానుజమ్మగారు

పళ్లమ్మా పళ్లు
ఏంపళ్లు
మామిడిపళ్లు
ఏంమామిడి
నరమామిడి
ఏంనర
సేరున్నర
ఏంసేరు
కర్రసేరు
ఏంకర్ర
వెదురుకర్ర

ఏంవెదురు
పచ్చవెదురు
ఏంపచ్చ
ఆకుపచ్చ
ఏంఆకు
చిగురుటాకు
ఏంచిగురు
చింతచిగురు
ఏంచింత
పాపచింత
ఏంపాప

కన్నుపాప
ఏంకన్ను
నెమలికన్ను
ఏంనెమలి
మొగనెమలి
ఏంమొగ
గ్రామంమొగ
ఏంగ్రామం
సంగ్రామం.

---

## తొలేకాదశి

శ్రీమతి కంకిపాటి రుక్మిణమ్మగారు

దుక్కులుదుక్కులుదున్నేరు
ఏమిదుక్కులుదున్నేరు?
జాలారాయణితోంట్లో
జాజిదుక్కులుదున్నేరు.
దుక్కులుదుక్కులుదున్నేరు
ఏమిదుక్కులుదున్నేరు?

రాయప్పతోంట్లో రాగిపైరునాటేరు
కిష్టప్పతోంట్లో కిత్తలినారునాటేరు
వెంకన్నతోంట్లో వేరుశనగనాటేరు
వల్లభరాయనితోంట్లో వంగనారునాటేరు
సీతమ్మతోంట్లో చిక్కుడుపందిలిపెట్టేరు.

---

## అవ్వహాస్యము

శ్రీమతి పాకల రాజామణిగారు

అవ్వా తవ్వాదెచ్చి యివ్వకున్నావు?
మునసబుగారితో నేజెప్పి ముక్కుకుంగవ్వకట్టిస్తాను.
అవ్వా తవ్వాదెచ్చి యిద్యా, ఓహోహో ముసలిఅవ్వ!
కానిపోనితవ్వగాదు కంచుకట్లతవ్వమాది.

కిరణంగారితోనేజెప్పి ఖయిదులోనే పెట్టిస్తాను.
పనికిరానితవ్వగాడు పమిడికట్లతవ్వమాది.
భద్రగిరిరామస్వామితో జెప్పి పంప్లుగూడగొట్టిస్తాను.
వెదురుపేళ్ళతవ్వకాడు వెండికట్లతవ్వమాది.
వెలిమిడిసుబ్బారావుతో జెప్పి వెన్ను బద్దలకొట్టిస్తాను.

---

## దంపుళ్ళ పాట

పిండికొడదామక్క బండెక్కుదాము
రామగిరి వెడదాము రావే చెల్లెలా॥
ఎంతచక్కందమ్మ ఏలూరికోటా
ఎక్కికూర్చున్నారు ఏలమదొరలంతా॥
ఎంతచక్కందమ్మ యీవూరికోట
కలసికూర్చున్నారు కరణాలందారు॥
కలిగినవారు పేదవారు వియ్యమందితే
అరిచేతిబెల్లమ్ము చిరిచేదులాయే॥
మా వెంకు రామయ్య వియ్యమందితే
పానకంపన్నీరు కలిపినట్టుండే॥
దొడ్డిచుట్టూ రెండు దిడ్డికంతల్లు
నెడ్డిదివాణంబు నే పుట్టినిల్లు॥
బావ గురవయ్య బంట్రోతువయ్యా
నీవున్న సభలోను మగవారుండారు
బావ గార్లామిారు శక్తిగలవారూ
వెళ్లిన్న సభలోను పిండిగొట్టేరు॥

## శ్రీమతి పాకల రాజామణిగారు

మేడచుట్టూ రెండు మేటి స్తంభాలూ
మేనమామదివాణం అమ్మపుట్టిల్లు॥
మేనమామల్లార మేటిదొరలార
అమ్మున్న వాడలకు తమ్ములై రండీ
మేమున్న వాడకూ మామలై రండీ॥
మానికమువంటిది మాగూటిదివ్వె
మన్నె రాజువంటివాడు మామగురవయ్యా
అధికచక్కనిదమ్మ అత్తమంగమ్మ॥
నిమ్మపండువంటిది అమ్మనావళ్ళు
నీలిరవికలంపు అన్నలచేత॥
తోటికోడలవమ్మ దొరబిడ్డవమ్మా
నీవున్న పొరుగూన నిప్పట్టదమ్మ॥
అత్తగారన్నది తా పెద్దమనిషీ
కోడలికిదుడ్డట్టి తాగడ్డతినెను॥
గడ్డలుతిన్న అత్త గెడ్డలపాలాయె
దుడ్డుతిన్న కోడలు దుడ్డల్లెవుండె॥

---

# కథలు

## మంగల్ చండీవ్రత కథ

### కాంచనపల్లి వేంకటరంగారావుగారు

చండీబ్రాహ్మణరూపధారిణియై యొకానొక మంగళవారపు దినమున యొక బీదవర్తకుని యింటికి యాచనార్థ మేతెంచెను. ఆ వర్తకుడు "దరిద్రుడవకు సంతానము పొందన్నట్లు" బీదవాక్కేగాక యేడుగురు ఆడపిల్లలను సహితము సంతానముగా బడసియుండెను. ముష్టివేయుటకై ఆ వర్తకుని యిల్లాలు తన సప్తపుత్రికాసంతానముతో పరివేష్టింపబడి యేతెంచుచుండుట యామాయాస్త్రీ గాంచి ఆపెరావేగమే

"నీ కెంతమంది పుత్రులు" అని అడిగెను. తనకు పుత్రసంతానము భగవానుడు ప్రసాదించియుండ లేదనియు, ఉన్నదందరు స్త్రీలేయనియు నుడువ విని, పుత్రులులేని యిల్లాలి హస్తాంజలినుండి ముష్టి గైకొనవని, యొక పరిమళసుందరపుష్పము తీసి ఆమెకిచ్చి, యీ పుష్పమును నీటిలో వేసి, కొంతసే పైనతరువాత, ఆనీటిని సేవించిన పక్షమున గర్భము ధరించి యనంతరము పుత్రసంతానము నొందగలవని అభయమిచ్చి, అంతర్ధానమయ్యెను. తానేగుటకు పూర్వము మంగల్ చండీ వ్రతము యెట్లాచరించవల యునోగూడ సంక్షేపముగా చెప్పెను.

తదనంతరము యీ కపటబ్రాహ్మణస్త్రీవేష ధారిణి మరియొక ధనికుడైన వర్తకుని గృహాంగణము చేరి, అచ్యుట సహితము యాచన యాచించి, ముష్టి వేయబోవునరికి ఆ యిల్లాలిని గాంచి "నీ కెంతమంది పుత్రికలు" అని ప్రశ్నించెను. తనకుగల సంతాన మంతయు పుత్రులేగాని పుత్రికలు లేరని నుడివెను. ఒక పుత్రికయును లేని యిల్లాలి హస్తపుటంబుల నుండి ముష్టిగొనుట తనకు వ్రతభంగమనియు, అందు వలన ముష్టివలదని చెప్పి వెనుకటిరీతినే యొక పుష్పమునిచ్చి, పైభంగినే చెప్పి తాను మాయ మయ్యెను.

ఇట్లు కొంతకాలమగుసరికి యీ వర్తక లిరువురి గృహములయందును' బీదవానియింట యొక బాలుం డును, భాగ్యవతుని యింట యొక బాలికయును యేకకాలమునందు జననమునొంది, నామకరణదిన మాసన్నమగుడు యిరువురకు జయదేవ్—జయవతి యను నామకరణము గావించిరి.

ఇరుగుపొరుగువారలగుటను, యొకే ముహూర్త మున జననమునొందుటను, యొకేస్థలమున యాట పాటలు, విద్యాభివృద్ధులు గావించుటను, వార లొండొరుల స్నేహానుపయన్నుతో పాటు యొకే రీతిని దినదినాభివృద్ధి నొందుచుండిరి. ప్రాయము హెచ్చునకొలది యిరువురయందును భావోద్రేక మధికమై యొకరినొకరు విడువలేనంత ప్రణయమున తన్మయచిత్తులగుచు, యొకరినొకరికిచ్చి వివాహ ములు గావింపబడుటకై, యొనరి తల్లిదండ్రులవారు వేడుకొనిరి. జయదేవుడు, జయవతిని పెండ్లి చేసు కొనుటకు తనకుగల ప్రేమను వెల్లడిపరచెను గాని, యంతటి ధనవంతుని కుమార్తెను బీదవాడైన తమ కుమారునికీయ నిచ్ఛగింతురాయని జయదేవుని తల్లి దండ్రులు సంశయాకులచిత్తులగుచు, వీరిరువురి కల యిక యెటులనాయని యాందోళన చెందుచుండిరి.

ఒకనాడు మంగల్ చండికాదేవి జయవతి తండ్రి కగుపడి, తన కుమార్తెను జయదేవునకిచ్చి పరిణయ మొనర్పవలసినదని యాజ్ఞయిచ్చెను. చండిక యాజ్ఞా నుసారము జయదేవ—జయవతులకు శాస్త్రానుసార ముగా పరిణయోత్సవము గావింపబడెను. వివాహా నంతరము జయవతి, జయదేవు లొకదివసమున ద్విర దాధిష్ఠులై మార్గమధ్యమునగల యొకనదిని దాటు చుండ, తన భార్యయగు జయవతి తనలోతాను యేవో మంత్రోచ్చాటనలు సలుపుచుండినటుల విన గలిగెను. వెంటనే జయదేవుడు, "ఏమిటా మం త్రోచ్చాటనము? దానియర్థమేమి? ఎందుకు జపించు చుంటివి? ఆయుదంతమంతయు పొంగోపాంగముగ వివని"మ్మన మంగల్ చండికాదేవిని ధ్యానించు శ్లోకముల తిరిగి పఠించెను. అందునకు భర్త కడు ముదమంది, అది పఠించినందువలన కలిగెడు ఫలితం బేమి? అని అడిగెను. ఆమె తన భక్తులందరిని యెట్టి ఆపదలనుండియైనను రక్షించ సామర్థ్యముగల దని, అట్టి రక్షకురాలను తాను ధ్యానించుచుంటినని నుడివెను.

అంతట జయదేవుడు ఆయుదంతమందలి నిజానిజ ముల నరయ కుతూహలుండై, తన భార్యమెడలోని యాభరణములనెల్ల తీసి తనవద్దగల వస్త్రమునందు ముడివైచి, ఆనదిలో పారవైచెను. పాప మామె యందుల కేమియు భర్తనన లేదు సరిగదా, యథా ప్రకారము చండికాదేవిని ప్రార్థించుచుండెను. ఈ రీతిని కొంతకాలము గడువ, యొకనాడు జయవతి మామగారు, యొక పెద్ద మత్స్యమును తెచ్చి విందు చేయుమని కోరగా, అందునకు వల్లెయని దాని నందుకొని తరిగిచూడ అందున మూటపాళముగా తన యాభరణములన్నియు గాన్పించెను. జయ

దేవుడు మత్స్యగర్భమునందు గాన్పించిన యాభరణములఁ దిరిగి చూడఁగలిగియు, చండికయొక్క మహిమను యింతను తెలిసికొన్న కుతూహలుఁడై, యొక నాఁడు తన చిన్నికుమారుని కుమ్మరివాని యావమున దాచెను. కుమ్మరివాని కీసంగతి తెలియక ఆవమును అంటించ పలుమారు ప్రయత్నించెను గాని యొక మారును ఆవము అంటుకొనకయుండుట కనులార గని ఆవముమట్టును యిదేమి గ్రహచారమురాయని తిరుగుచుండెను. ఇట్లు తిరుగుచుండ యొక కుండపందున జయదేవుని పుత్రరత్నము సురక్షితముగా శయనించుచుండుటను చూచి సంభ్రమాశ్చర్యచకితుఁడై, తిరిగి యా కుర్రవానిని తల్లిదండ్రుల కప్పగించి, జరిగిన వృత్తాంతమంతయు వివరముగా వర్ణించెను. కాని జయదేవున కింకను యనుమాననివృత్తి గాక, ఆ కుర్రవానిని నదిలో పారవైచెను. ఒక నాఁడు జయపతి నీటికై యేటికరుగ, ఆ నీటితో పాటు కుండలోనికి యా కుర్రవాఁడు వచ్చెను. ఇటులనే అనేకరీతుల ననేకపరియాయములు మంగల్ చండీ దేవియొక్క మహిమను పరీక్షించి, విముక్తుఁడై, కడకు దేవియొక్క సత్యమును, ఆమెను ధ్యానించుటవల్ల యొనగూడిన ఫలితమును గని అది మొదలు మంగల్ చండీ దేవియందు భక్తితత్పరుఁడై, ఆపూజ జయపతీసహితముగా యవపరతము గావించుచుండెను. ఈ వ్రతము యెవరొనరింతురో వారలకు ఎట్టి యాపద లొదవకుండునట్లు పురాణములవల్ల తెలియునగుచున్నది.



## హంస, బ్రహ్మ

ఆదిభట్ల తరిణయ్యసిద్ధాంతిగారు

శ్లో॥ నిత్యానందరసాలయం సురమునిస్వాంతాంబుజాతాశ్రయం
స్వచ్ఛం సద్విజసేవితం కలుషహృత్సద్వాసనావిష్కృతం
శంభుధ్యానసరోవరం వ్రజమనోహంసావతంస! స్థిరం
కిం క్షుద్రాశ్రయ పల్వలభ్రమణ సంజాతశ్రమం ప్రాప్స్యసి॥

"శివానందలహరి"

ఒకానొక హంస మానససరోవరమును విడిచి కలుషభూయిష్ఠమగు నొక తటాకమును ఆశ్రయించినది. క్షుత్పిపాసలకు లోనై రేయింబవలు తన యాహారమగు తామరతూండ్లకు ముత్యములకు వెదుక జొచ్చెను. అవి యందు లభింపవు. ఆహారము లేనందున నది మిగుల దుఃఖించి యందులకై మిగుల ప్రయత్నింపసాగెను. ఎంత ప్రయత్నించినను ఒక తూఁడుగాని, ఒక ముత్తెముగాని దొరకలేదు. అడుగుభాగమునకు జొచ్చి ముక్కుతో గాలింపసాగెను. అచ్చట కంకరతప్ప మఱియేమియు దొరకదయ్యెను. నిరాశ జెందియు నయ్యది యా కంకరనే తినవలసివచ్చెను. లేకున్న నాకలిచే నలమల మాడవలసినదే. ఎట్లో కొంత తినగలిగెను. ప్రయోజనమేమున్నది? ఆకలి తీరకపోవుటయే గాక కడుపునొప్పి తప్పదయ్యెను. ఇది యాకలినొప్పియని తలంచి మఱింత కంకరను దినజొచ్చెను. అట్లే ఆకలియు ఆబాధయు వృద్ధిపొందుచుండెను. ఇంతలో పూర్వజన్మపుణ్యవశమున బ్రహ్మ ప్రత్యక్షమై, "ఓ హంసమా! కంకర నీ కాహారమగునా? దానిని తినకుము. నీవు మానససరోవరమునకు పొమ్ము. అచట నీకు తగిన యాహారము లభించి సుఖింపగలవు. నీచమగు నీ తటాకమును విడువుము. దీనిలో నిజమగు సుఖము నీ కెట్లు లభించును? దీనిలో ప్రకృతి ప్రధానము. జడభావ మిందు రాజ్యము సేయుచుండును. నా మాటయందు విశ్వాసముంచినచో మానససరోవరమునకు పోవుమార్గమును నే నుపదేశింపగలను. నీ శక్తికి తగినట్లు నిన్నచటికి చేర్పగలను. అందు మూలమున చైతన్యస్వరూపుడవు కాగల"వని యుపదేశించెను.

దీని భావార్థమేమి? సచ్చిదానందస్వరూపుడగు జీవుడు నిజపదవినుండి భ్రష్టుడై దేహధారియగు

నపుడు సంసారతటాకమున మునింగి తేలియాడుచు, సుఖమావంతయేని చూడజాలక తాపత్రయముతో స్రుక్కుచుండగా నింతలో పురాకృత పుణ్యపరిపాకమున సద్గురువు లభించి పరోక్షజ్ఞానము నిట్లుపదేశించును, "ఓ జీవమా! నీవు పరమాత్మస్వరూపుడవు. నీనిజధామ మిచ్చటకాదు. నిర్మలమైన చేతనప్రదేశమును నీవు చేరవలె" నని బోధించి యంతరదృష్టిని నెలకొనియుండునట్లు కొంత సాధనప్రణాళికను చేయించి క్రమముగా అపరోక్షజ్ఞానసంపన్నుని గావించి జీవబ్రహ్మైక్యము సాధింపజేయును.

---

## కపటపతివ్రత

శ్రీమతి తులసి వెంకటసుబ్బలక్ష్మమ్మగారు

అనగనగా ఒకవూరు. దాని పేరు వుజ్జయనీ నగరం. దానికి ప్రభువు భోజమహారాజు. బహున్యాయంగా పాలిస్తూవుండేవాడు. ప్రజలకు ఏకష్టాలు వచ్చినా వారించేవాడు. ఒక్కొక్కమాటు తన దేశంలో ఏమేమి మోసాలు జరుగుతవో చూద్దామని మారువేషంవేసుకుని తిరగడం ప్రారంభించాడు. ఓ వూళ్లో గొప్ప నిష్టకల బ్రాహ్మణుడు ఒకడున్నాడు. అతడు నిత్యం స్నానంచేసుకుని సంధ్యావార్చడం, దేవయజ్ఞం, పితృతర్పణం కాకబలి మొదలైన వైదికకర్మలన్నీ ఆచరించేవాడు. ఒకనాడు కాకబలికై అన్నము పిడుచచేసి విడిచినాడు. కాకులన్నీ కావుకావుమని రొదచేయుచు వచ్చినవి. ఆ కూతలకు జడిసి వడవడ వణకుచు ఆయన భార్య పరుగెత్తుకుని వచ్చి భర్తను కాగలించుకున్నది. భర్తగారు కాకులను తోలివేసి భార్య సౌకుమార్యమునకు పతిభక్తికి చాల మెచ్చుకున్నాడు. ఇదంతా భోజరాజుగారు చూస్తూనేయున్నాడు. ఆశ్చర్యపడ్డాడు. ఈ పతివ్రతను శోధించాలని బుద్ధిపుట్టింది. అది అమావాస్య రాత్రి. ఆ కటిక-చీకటిలో ఆగృహిణి ఫలహారములు ఆకులు వక్కలు మొదలైనవి చేతపట్టుకుని భర్త నిదురించిన పిదప తలపుజేరవేసి ఎక్కడికో బయలు దేరింది ఉపభర్తను చేరడానికి. రాజుగారు వెంబడించారు. నర్మదానది పెద్ద పెద్ద కెరటాలతో గోల పెడుతూవుంది. ఆనది దాటాలనుకుంది. పడవ యేమీలేదు. భయమేసింది. పెద్ద పెద్ద మొసళ్లు తిమింగలములుకూడ గంతులేస్తున్నాయి. ఒక వుపాయం తోచింది. చేతిలోవున్న ఫలహారములు నదిలో జిమ్మివేసినది. అవి లాక్కొని ఆ జంతువులు పోయినవి. యీపె యీదుకొని ఆవలి గట్టుచేరింది. రాజుకూడా వెంబడించి ఆమె చర్యనంతా గ్రహించి ఆస్థానంలోకివచ్చి కాళిదాసుగార్ని పిలచి యిలా అన్నాడు (దివాకాకరుతాద్భీతా) పగటియందు కాకికూతకు భయపడ్డది అని. వెంటనే కాళిదాసు (రాత్రౌ తరతి నర్మదాం) రాత్రియందు నర్మదానదిని దాటినది. రాజు ఆశ్చర్యపడి (తత్రసంతి జలే గ్రాహాః) ఆనదిలో మొసళ్లువున్నవి కావా అని. మరల కాళిదాసు నాల్గవచరణము యిట్లు చెప్పినాడు (మర్మజ్ఞా హైవసుందరీ) ఆమర్మము ఆమె యెరిగి యున్నదే అని. రాజుగారు కవి కాళ్లపైబడి నమస్కరించి విశేషబహుమాన మిచ్చినాడు. కాన సోదరీమణులారా! భర్తకనులగప్పి యిట్టి దుష్కార్యమాచరించి ఆనందించు వన్నెలాడి జగద్రక్షకుడగు నా యముని త్రోవల, ఎఱ్ఱగకాలిన యినుప స్తంభము కద, యమదండము శిరముపై నిడియుడు, గదేమని పలుకునో.

---

## తెలివిగల స్త్రీ

రాచూరి రామనారాయణరావుగారు

అనంగా అనంగా ఒక రాజున్నాడు. ఆ రాజు దగ్గర ఓమంత్రి ఉన్నాడు. ఆమంత్రి-తెలివైనవాడు కాదు. ఒకనాడు రాజు తన మంత్రిని పిలచి, మంత్రీ, నీవుపోయి ఒక గిద్దెడు ఎద్దుపాలు తెమ్మని యాజ్ఞాపించెను. "నీవు ఆరునెలలులోపున తీసుకొని రావలెను. లేనియెడల నీతల యెగిరిపోవు" నని చెప్పెను. మంత్రి ఆశ్చర్యముపొంది గిద్దెడు ఎద్దుపాలు ఎక్కడ తెత్తునని మనసులో అనుకొని రాజు

తో, "అల్లే తీసుకొనివత్తు"నని చెప్పి యింటికి పోయి ఎవరికి కనబడకుండా ముసుగువేసుకొని పరుండెను. ఈతనిభార్య భర్తనుజూచి పడుకొనుటకు కారణమడిగెను. రాజుగారు గిద్దెడు ఎద్దుపాలు తెమ్మన్నాడని భర్తచెప్పెను. అప్పుడు భార్య, "దీనికొరకింతవిచారమా! నేను తెచ్చి మీకిచ్చెద" నని చెప్పి భర్తకు ధైర్యము కలిగించెను. భార్య మంత్రిని యొకగదిలోనుంచి తలుపునకు తాళము వేసి యుంచెను. ఈలాగున అయిదు నెలలు గడచినవి. వారములు రోజులు గడచినవి. తెల్లవారి ఏడు గంటలకు రాజుగారికి గిద్దెడు ఎద్దుపాలు యివ్వవలెను. మంత్రి భార్య నాటిఉదయము వీధిలోకివచ్చి, "నాభర్త గర్భముతోనున్నాడు నాభర్త గర్భముతోనున్నా" డని, గట్టిగా కేకలువేసి ఏడువనారంభించెను. అంత ఊరిలో అందరు మంత్రి భార్య ఏడ్చుచున్నదని వచ్చి, మంత్రి కడుపుతోనున్నాడని తెలుసుకొనిరి. ఈ కబురు రాజుగారికి తెలిసెను. రాజు ఆశ్చర్యపడి వెంటనే మంత్రిగారి యింటికి వచ్చి జరిగిన విషయమడిగెను. మంత్రి భార్య తన మెగుడు గర్భముతో నున్నాడని చెప్పి వెక్కి వెక్కి ఏడ్చుచుండెను. రాజు అందులకు నవ్వుచూ, "అమ్మా, మగవారు కడుపుతోనుందురా?" అని ప్రశ్నించెను. అప్పుడు మంత్రి భార్య, "అయితే మీరు యేమని గిద్దెడు ఎద్దుపాలు తెమ్మని ఆజ్ఞాపించిరి" అనెను. ని రాజు ఆమె తెలివికి మెచ్చుకొని తన రాజ్యములో సగము మంత్రి భార్య పేర వ్రాయించెను. మరియెన్నడును యిటువంటి తెలివితక్కువ పనుల చేయమనవని అనుకొని రాజ్యము చేయుచుండెను. మంత్రి తన భార్యను మెచ్చుకొనెను.

## చిత్రప్రశ్నకు సమాధానములు

జూలై మాసపు 'గృహలక్ష్మి'లో కొత్త సూర్యనారాయణ చౌదరిగారు ప్రకటించిన చిత్రప్రశ్నకు అనేక బాలబాలికలును యువిదలును ఆలోచించి సమాధానములను వ్రాసినారు. గ్రంథవిస్తరభీతిచే అందరి పేరులను ప్రకటించలేదు. వానినిబట్టి యీదిగువ సమాధానములు సరియైనవని పాఠకులు గ్రహించునది.
(1) వలువ (2) మిసిమి (3) కిటికి (4) కచిక (5) ముత్యము (6) ముదము (7) ముఖము (8) పులుసు.

[గృహ॥ సం॥]

## చిత్రప్రశ్నలు

కంకిపాటి రుక్మిణమ్మ గారు

కందికంపలోకన్నది
ప్రత్తిచేనులోపారవేసింది
పిల్లివలె పిరికినై యుండక
కాకివలె కలకాలముండక
హంసనై ఆఋమాసములుండి ఆకాశమార్గమున విహరించెదనన్నది, ఒక స్త్రీ సన్యాసి— ఈమె ఎవరై యుండవచ్చును?

సోమయాజుల వెంకటాచలశాస్త్రి గారు

సీ॥ మద్యంబుదేనికై మానవుల్ త్రావుదు? రెందుసర్పములువసించుచుండు?
రాజమందిరముద్వారమున నెవ్వడుండు? శిష్యుండుగురునకు చెలగునెచట?
బాల్యమ్మునకునెప్డు బరగుతారుణ్యమ్ము? గగనమీశునకేమి యగునుసతము?
పాడగరిబట్టుకు పానగంగవలెనెద్ది? చంద్రబింబమున గాంచనగునెద్ది?
తే॥గీ॥ అన్నిటికిమూడుమూడుండునక్కరములు ఆదితుదియొక్కరూపుననమరియుండు।
ఆరుమాసమ్ములవధినినరయనిత్తు ముదముతోడుత దెల్పుడీముగుదలార॥

# విబుధవాక్యములు

**మానవజీవితమందలి పరస్పర వ్యాఘాతములు:—**

కార్మికుడు యజమానిసంపదకై కష్టపడును. సైనికుడు సైన్యవృద్ధికై జచ్చును. ప్రభుత్వములు ప్రజలయందలి వైషమ్యములకై చట్టముల నిర్మించును. స్వకీయనాశనమునకై బుణగ్రస్తు లప్పుజేయుదురు. వురిశిక్షలకై హంతకులు హత్యఁగావింతురు. కామోద్రేకమునకై తనొల్లనియువిదను కాముకుడు కాంక్షించును. మతగురువులు ముఖ్యముగా అన్యమతముల నిరసించుటకే బ్రతుకుదురు. విటుల ప్రేమాభివృద్ధికై కులటలొల్లనివారివలె నటింతురు. స్వీయనాశనమునకై శలభము దీపమును ముద్దిడుకొన యత్నించును. సత్యదూరములగు స్వకీయవిమర్శనముల వ్రాయ భారతీయులొకరితోనొకరు పోటీచేయుదురు.

ఇదే నేటి నాగరికతా బాహ్యసత్వపు ముఖ్యతత్వము. సద్బుద్ధిగలసంఘము యిట్టి కళంకములను తొలగజేసికొన ప్రయత్నింపనగును. యజమానికిని, పనివానికిని, పనియందలి యభిమానమే ప్రధానసంబంధమై యుండనగును. ఒక స్త్రీ తనబ్రతుకుకొరకు మాత్రమే తన శరీరము నమ్ముకొన్నచో ఆమెను కులటయందుము. అటులే పురుషుడు ధనమునకై తన్ను విక్రయించుకొన్నప్పుడు పణ్యపురుషుడగునుగదా! అయితే యీ సందర్భమున స్త్రీకి క్షమార్హమగు విషయము లొకకొన్నియైన నుండవచ్చునేమోఁగాని పురుషునకు యేకొలదిమాత్రమైనను క్షమింపబడుటకు తగినకారణము లుండజాలవు.

కాంచనపల్లి వేంకటరంగారావు.

**స్త్రీలు—గౌరవపదవులు:—**

స్త్రీలు ఇక్కాలమున రాజకీయరంగమున బ్రవేశించి పెక్కుగౌరవోద్యోగముల నత్యంత చాకచక్యముతో నిర్వహించుచున్నారలు. మునిసిపలు సంఘములందు, బెంచికోర్టులందు, తాలూకాబోర్డులందు, జిల్లాబోర్డులందు స్త్రీలు సభ్యురాండ్రుగా నియమింపబడుట మనము చూచుచునేయున్నారము. ఆయా సంఘములు స్త్రీలసభ్యత్వముచే పునీతములై పెక్కు ప్రజాహితకార్యము లొనరింపుచున్నయవి.

బెంచికోర్టులకన్న నేయిమడుంగులు బాధ్యతగల సెషన్సుకోర్టులందు స్త్రీలు అసెసరులుగాను జ్యూరరులుగాను నియమింపబడకుండుటకు హేతువేమియో మాకు గోచరించుటలేదు. పెక్కు హత్యాకార్యముల యందు స్త్రీ ఏదోవిధమైన సంబంధముకలిగి యేయుండుచున్నది. అట్టియెడ స్త్రీజూరరులు లేకున్నయెడ సంపూర్ణ న్యాయము నిర్వహింపబడ నేరదు. ఈవిషయమై స్త్రీలెల్లరు మహిళాసభలయందు స్త్రీలను గూడ అసెసర్లుగ గాని జూరర్లుగాగాని నియమింపవలసినదని తీర్మానములజేసి దొరతనమువారికి బంపుట ముఖ్యావసరమైయున్నది.

పులవర్తి కమలావతీదేవి.

**పల్లెటూళ్ళఉపాధ్యాయినులకుసలహాలు:—**

పల్లెలలోని పాఠశాలలకు మీరుపాధ్యాయినుల[illegible] గాఁబోవుచున్నారు. బడికివచ్చు బాలికలకుమాత్ర[illegible] మేము బోధకులమని మీరెంచరాదు. గ్రామము[illegible] కంతయు మీరు వెలుతురువంటివారు. మీది కేవలము స్వార్థత్యాగముతోకూడిన వృత్తి. పోలీసు బంట్రోతున కిచ్చుజీతములోసగము లేదు మీకిచ్చునది. కాని పైవారినుండి తనిఖీలకు తక్కువలేదు. తెలిసియో తెలియకయో మీరీవృత్తినివరించినారు. వరించినవెనుక వెనుదీయుట హిందూపతివ్రతల ధర్మము కాదు. ఏపాత్రమును మనము ధరింతుమో దానిని చక్కఁగా నిర్వహించుటలో కీర్తికలదుగాని పెద్ద వేషములు కావలెననికోరుట నట్టిభ్రమ. అందఱును రాజువేషములు వేయఁజాలరు. వేయుటకు వీలుకూడ లేదు. రాజువేషమే ఆటలో రక్తిపుట్టించుననుట గూడ కల్ల. సేవకవేషము వేసినవాఁడే 'సెబాస్' అనిపించుకొనుట మనకు తెలియని సంగతికాదు. కాబట్టి ఉద్యోగములో కాదు గౌరవముండునది. దానిని నిర్వహించుశక్తిలో. ఆశక్తిసంపాదించుకొను నాసక్తి యుండినఁగాని జీవితములో రక్తిలేదు. ఉపాధ్యాయిని పాత్రమును చక్కఁగా నిర్వహించి మీరు మెప్పుబడయవలెనుగాని, జీతముచాలదని, ఇన్స్పెక్టరుల బాధయని, కుగ్రామమని, కూరగాయలు దొరకవని వేసరి, నిస్పృహ నొందఁజనదు.

సీరిపి ఆంజనేయులుగారి ఉపన్యాసమునుండి:—




## సంగీతము—ఆరోగ్యము:—

మం. వేం. నరసింహారావుగారు, బి.ఏ.

సంగీతము సృష్టిలో బడయుగల్గిన గొప్పఔషధము. సంగీతము చేతనే రోగ్ల జబ్బులను కుదర్చవచ్చును. ఆరోగ్యములగు మందులు పనికిరాలేనవి యగునపుడిది చేసినమహోపకృతి ప్రత్యేకముగా గుర్తింపవలెను. క్రీస్తుదేవుని కాలములో సాల్ పైని దయ్యమావేశించినప్పుడు డేవిడు వీణావాయిద్యముచే దానిని పారద్రోలెనట. క్లిడె మెనెస్ట్రియా గానరసాస్వాదనా మహిమచే వ్యభిచారప్రయత్నములనుండి మరలినట్లు గ్రీసు చరిత్రకారులనుండి తెలియుచున్నది. పూర్వపు రాజులెందరో సంగీతముచే ప్రజల తిరుగబాట్లనణచిరి. గానముచే పిచ్చితనము శాంతింపగలిగినది. తీబస్ దేశస్థులు పిన్నవగోవిచే మానసిక జాడ్యములను కుదర్చకల్గిరి. మార్టినస్ మహాశయుడు పాటచే స్వప్నములను నిర్మూలించెను. గానముచే పాముకాట్లు, తేలుకాట్లు శాంతింపగలవట. మురళీవాయిద్యము ప్లేగు మహాజాడ్యమునకు దివ్యౌషధమని డెమొక్రటీస్ నిశ్చయముగా జెప్పెను. ఇట్లు పూర్వకాలమున సంగీతము ఆరోగ్యసాధనమని జెప్పబడెను. (భారతీపత్రిక.)

## లక్ష్మీదేవదాసుల పెండ్లి ధర్మసమ్మతమైనది:-

తే 29 ది సాయంకాలం 5 గంటలకు బ్రహ్మపుర ఆంధ్రభాషాభివర్ధినీసమాజములో శ్రీబంకుపల్లి సూర్యనారాయణశాస్త్రిగారు ఈక్రిందివిధముగ సూరాప రఘుల కూర్మనాథరావుగారి ప్రశ్నలకు ప్రత్యుత్తరము లిచ్చిరి.

1 ప్ర. మొన్న జరిగిన లక్ష్మీదేవదాసుల వివాహము ధర్మసమ్మతమయినదేనా?

ఉ. "చోదనాలక్షణార్థో ధర్మః" అనగ వేదములచే ప్రయుక్తమయి సర్వజనహితమును గూర్చునదియే ధర్మమనియు, కర్తవ్యమగునట్టిధర్మము స్థూలసూక్ష్మ భేదములచే రెండువిధములనియు పరాశర స్మృతి ఆచారకాండలో "మందమతిభిరపినుభేవబుధ్యమానశ్శౌచాచమన సంధ్యావందనాదిః స్థూలధర్మః శాస్త్రపారంగతైః పండితైరేవ బోద్ధుంయోగ్యః ఇతరేషాం అధర్మత్వభ్రాంతి విషయోద్రౌపదీవివాహాదిస్సూక్ష్మధర్మః అనగ ధర్మము స్థూలసూక్ష్మ భేదములచే ద్వివిధము. మందబుద్ధులగువారు సులువుగ తెలిసికొనుటకు యోగ్యమగుబాహ్యమగు శౌచాచమనసంధ్యావందనాదులు స్థూలధర్మమనియు, శాస్త్రమును దెలిసిన పండితప్రవరులచే తెలియబడునదియు, ఇతరులకు అధర్మత్వభ్రాంతినికలుగజేయు ద్రౌపదీవివాహమువంటి ధర్మము సూక్ష్మధర్మమనియు, ధర్మమునకు నిర్వచనము చేసియున్నాడు. ఆవిధముగ శాస్త్రపారంగతులుకాని మందమతులకు అధర్మత్వభ్రాంతి విషయికమయినదే మొన్న జరిగిన యీలక్ష్మీదేవదాసులపరిణయము గనుక అది ధర్మసమ్మతమని వేరె జెప్పనక్కఱలేదు.

2 ప్ర. అట్లయిన పూర్వకాలమందు లేనట్టి యిట్టి సంస్కారణములు మనమతమునకు విరుద్ధమయినను ఆచరించుట ధర్మమనియే మీయభిప్రాయమా?

ఈ. పూర్వకాలమున నిట్టి సంస్కరణవివాహములు లేకపోలేదు. పూర్వము శ్రీవశిష్ఠులవారు చండాల స్త్రీయగు నరుంధతిని పెండ్లాడిరి. మొదటినుండియు యిట్టి సంస్కరణములు జరుగుచునే యున్నవి. అవి శాస్త్రసమ్మతముకానప్పటికిని ద్రౌపదీవివాహరీతిని ధర్మసూత్రమనుసరించి ధర్మబద్ధము లగును. అట్టివి మతవిరుద్ధముగా నేరవు. ఎందుచేతననగా మతమనేది సర్వమానవసృష్టికి కావలసినదేగాని సృష్టిలో నొకభాగమగు మనుష్యజాతికేగాదని నా యభిప్రాయము. ఆవిధముగ నీసంస్కరణవలన సర్వమానవసంఘము నైతికాభివృద్ధిగలిగి జ్ఞానవంతమై యుండునో అట్టిది మనమతమునకు అనగ విశ్వమంతటిలో నొకటియగు మనహిందూమత విరుద్ధమయినను చేయుట ధర్మమేయగునని నాయభిప్రాయము. ఆ చేయుటచేత మనమతము అభివృద్ధిగాంచునేగాని ఇప్పటివలె సంకుచితముగా నేరదు. హిందూమతమును ఒకవిశ్వవ్యాప్తమగు నేకమతముగ జేయుటయే శ్రీ గాంధీమహాత్మునియుద్దేశ్యము (త్రిలింగపత్రిక.)

### హైందవవనితలు, క్రొత్తపాశ్చాత్య భావములు:—

శ్రీమతి రాధాబాయి సుబ్బరాయనుసతిగారు, పూనా ఇండియనువుమన్సుయూనివర్సిటీ కాన్వొకేషను అధ్యక్షపీఠమునుండి యుపన్యసించుచు, ఈవిషయమునుగూర్చి కొన్ని సుందరమగు అభిప్రాయములను ప్రకటించుచున్నారు. "గృహయాజమాన్యవిషయమున ననాదినుండియు హిందూవనిత ఒక అనుపమానమైన అధికారము గౌరవము స్వాతంత్ర్యము ననుభవించుచున్నది. హిందూజీవనమునకు కుటుంబమనునది ప్రాణమువంటిది. అట్టి కుటుంబవ్యవహారనిర్వాహణములో ఆమెకు తెలియని యంశమేలేదు. ఈవిషయమునుగూర్చి ఆమె అనుభవమెట్టిదో అధికారమును నట్టిదే. ఇట్టి అనుభవాధికారములను చూచిన పాశ్చాత్యులు నివ్వెఱపోకమానరు. మన ఆచారవ్యవహారములు వారికి తెలియకపోవుటచేత మనస్త్రీల నిజమైన యౌన్నత్యమును వారు గ్రహించలేక కొన్ని అస్పత్రికేసులు పడుపు గృహముల చరిత్రలుమాత్రము పఠించి పాశ్చాత్యదేశములలో మనలనుగూర్చి లేనిపోనియపభ్రంశపుకథలల్లి వ్యాపింపచేయుచుందురు. ఇట్టిచర్యలంతర్జాతీయసాంఘికనీతి మర్యాదలకెంతయు కళంకదాయకములు. స్త్రీలు సాంఘిక రాజకీయహక్కులను బడసినచో మనసత్సంప్రదాయములు కూలిపోవునని భయపడువారుకూడ మనలో కొందరుకలరు, కాని వీరిభయములు నిరాధారములు. అయినను పాశ్చాత్యవాసనల నలవరచుకొని స్త్రీస్వాతంత్ర్యము నకై పోరాడుచున్న భారతీయవనితలును మఱువరాని విషయమొకటి యున్నది. మనదేశములో సంఘసంస్కరణ మవసరమేకాని సంఘసంస్కరణ మనగా మనదేశపుసనాతనాచారముల కుల్లాసీదాగా విరోధకమైన అభ్యాసములను ఆచారములను నవలంబించి విఱ్ఱవీగుటయని మనము గ్రహించరాదు. మన జాతీయధర్మములును కుటుంబాసక్తియు మనమేమఱరాదు. సనాతనమునుండియు కుటుంబమునందున్న ఆమెస్థానమునామె గౌరవప్రదముగనిలబెట్టుకొనుచు దేశమును ప్రపంచమును చక్కచేయుకృషియందు విశేషము పాల్గొనుచు తనను తనసంతతికిని గృహమును ప్రపంచమునుగూడ సౌఖ్యప్రదముగ చేయు ప్రయత్నములయందు నిమగ్నరైయుండవలెను.

### ఇప్పటిగతి:—

పూర్వము దేశము ఐశ్వర్యవంతముగ నుండెడిది. ఇప్పుడురోజులు మారినవి. వున్నదానికిని కావలసిన దానికిని సమన్వయము కుదురుటలేదు. ఎందుజూచిన విపరీతమే. పుట్టుటకుగాని పోవుటకుగాని సాఫీమార్గము కనుపించుటలేదు. వైద్యసహాయము లేనిది పురుడురాదు. ప్రాణముపోదు. యీరెంటిమధ్య ధనమానప్రాణరక్షణమునకు పోలీసులు, ప్లీడర్లు, కోర్టులు, ఖయిదులు లేకుండ కాలము జరుగదు. పల్లెటూళ్ళలోను, పట్నవాసములలోను నిజముగ నిప్పును నీరును కరువైనవి. వంటసరకు లేక పల్లెటి గ్రామాదులలో సంసారము దుర్భరముగ నున్నదని చెప్పవచ్చును. ఎక్కడనుండిరో సరివి సిరుమానులు దిగుమతి అయినగాని పొయ్యిరాజదు. పిల్లిలేవదు. నూతినీరు చప్పన. చెరువుగట్లు బహిర్దేశ ప్రదేశ

ములై చెరువునీరు క్రోటికిపోదు. ఇక మరబియ్యము పుణ్యమున పిండపుష్టి క్షీణించుచున్నది. బడులకు, పాఠశాలలకు,+ కళాశాలలకు పోగి చూచినచో రూపు రేఖలలో వికాస మెక్కడనో గాని గన్పించదు. పిట్టరూపు, పేడిమొగముగల జనాభా కావలసినంత. 100 కి 60 మంది కండలేనివారు. ఎముకలపోగులు. బక్క చేతులు. చాతీలు వెన్నంటుట మూలమున డెల్టా ప్రదేశాలలో ముఖ్యముగా గుండె దిట్టత కాన్పించకున్నది. నిశానిదార్ల సంఖ్య ఎక్కువ అనుట మాని మనకు నీరసాలెక్కువన్న సంగతి జ్ఞాపకముంచుకొనుడు. ఇట్టి దుస్థితికి కారణభూతము నిర్వీర్యమని చెప్పకతప్పదు. ఇందులకు ప్రస్తుత విద్యావిధానముగాని ప్రస్తుత వాణిజ్య వ్యాపార వైఖరిగాని నవనాగరికతా మహోత్కృష్యముగాని గారణమని నేనొప్పుకొనజాలను. ఎందుచేతనన అయ్యవి ప్రపంచమునందలి దెల్టాలను నిండియున్నవి. యితరచోట్ల ప్రజలిట్టి హీనస్థితిలో లేరు. నాదృష్టిలో నిజమగు కారణము పూర్వపు గ్రామకట్టడి, గ్రామ సౌభాగ్యము, గ్రామ పంచాయితీ పరిపాలనా విధానము మాయమైపోవుట. వర్తక వాణిజ్యములవల్ల మనకు ధనాభావమేగాని ధనాకర్షణము లేకున్నది. అట్టితరి వాటిబారినుండి తప్పించుకొనుటకు దారియైన మనకు కన్పించుటలేదు. కష్టించి పండించిన పంట సరసముగు ధరకు రవాణా చేయగలుగుట రైతునకు మించిన పనియైయున్నది. అందుచే పంట పరాయి పెద్దమనుష్యుల పరమగుచున్నది. పొలములు ఫలవంతముగానున్నను పల్లెటూళ్ళు పరపతిలేకుండ నున్నవి. పూర్వపుస్థితికి యిప్పటిగతికి తేడా యిది. పల్లెటి గ్రామాదులు తమ బాగు తామెరుగుండినట్లు కాన్పించదు. అవి పట్నవాసములపై నెక్కువగ నాధారపడియున్నవి. అందుచే పరాధీనత వాటికెంటిని ఆవహించి యున్నది. నైప్రాయి పట్నవాసములో వుంటాడు; పెట్టియారాను పల్లెటూళ్ళో వుంటాడు. కలెక్టరుది పట్నవాసం; కరణానిది పల్లెటూరు. కోర్టు పట్నవాసంలో; కేసు పల్లెటూరులో. వర్తకుడు పట్నవాసస్థుడు; వ్యవసాయదారు పల్లెటూరాయన. డాక్టరుగారిది పట్నవాసం; రోగిది పల్లెటూరు. పెండ్లికుమారుడు నవనాగరికతా సంపన్నుడు; పెండ్లికుమార్తె పల్లెటూరిపిల్ల.—వీటిమధ్య, గల వైపరీత్యముపోవుటెట్లు? అయ్యది పోయినచో వాటి మధ్య సమన్వయము కుదురగలదు. అది లేకపోవుటయే నేటి దుస్థితికి కారణము.

(భమిడిపాడి సత్యనారాయణగారి ఉపన్యాసమునుండి)

మహాత్మునకు వినిపించిన ఈశ్వరవాణి:—

'ఈశ్వరవాణి' యనినను, 'సత్యవాణి' యనినను, 'అంతర్వాణి' యనినను, నాయభిప్రాయమున నొకటే. నేనెట్టిరూపమును చూడలేదు; చూచుటకు గూడ నే నెన్నడు ప్రయత్నింపలేదు. పరమేశ్వరుడు రూపరహితుడనియే నావిశ్వాసము. నేను వినిన వాణి అతిదూరస్థమయ్యును, అతిసమీపస్థము. మానవ కంఠమువలె నది సువ్యక్తముగా, సుస్పష్టముగా, నాకు వినిపించినది. ఈ వాణిని నేను వినుటకు బూర్వము నా హృదయ మతి భయంకర వేదనాక్రాంతమై యుండెను. హఠాత్తుగా నాకీ వాణి విన వచ్చినది. విని, అది యా వాణియేయని నేను నిశ్చయము చేసికొంటిని. వేదన యణగిపోయినది. నేను శాంతిని బొందితిని. తోడనే యుపవాసము సంకల్పించి, కాలనిర్ణయము గావించితిని. ఆనందము నన్నావహించినది. ఇది రాత్రి 10,11 గంటలకు మధ్య జరిగినది. శాంతుడనై, వ్రాయుటకు మొదలిడితిని. నే వ్రాసినది పాఠకుడు చదివియే యుండును.

నేను విన్నది నిజముగా నీశ్వరవాణియేయనియు, ఉద్రిక్తభావనా ప్రతిధ్వని కాదనియు, నే నింతకన్న నెక్కుడు సాక్ష్యమే మీయగలను? సంశయాత్ముని విశ్వసింపజేయుటకు నాకింతకన్న వేఱుసాక్ష్యము లేదు. అది కేవలము భ్రాంతియనియు, కల్పితమనియు నతడనుకొనును గాక! అదియే నిజము కావచ్చును. కాదని నేను నిరూపింపజాలను. కాని యిదిమాత్రము నిజము; ఈ ప్రపంచమంతయు నేకగ్రీవముగ కాదన్నను, నే విన్నదీశ్వర వాణియేయను నా విశ్వాసము చలింపజాలదు.

(కృష్ణాపత్రిక)

# గ్రంథపరిచయము

## దేశభక్తుడు :—

క్రౌనుసైజు 218 పుటలు. ఆంగ్లభాషలో శ్రీయుత కె. యస్. వెంకటరమణిగారు వ్రాసిన 'Kandan the Patriot' అను నవలకు శ్రీయుత గుఱ్ఱం సుబ్రహ్మణ్యముగారు వ్రాసిన ఆంధ్రానువాదము. శ్రీయుత వెంకటరమణిగారి గ్రంథములు సుప్రసిద్ధ ఆంగ్లవిమర్శకుల సంస్తుతులకు పాత్రమైనవి. వానివలన నతనికి ఖండాంతరఖ్యాతికూడ కలిగినదని ఆంధ్రు లెరుంగవలెను. అట్టివారి గ్రంథము లవశ్యానువాదనీయములనుట కాటంకములేదు. ఈపనిని కొంత నిర్వహించినందు కాంధ్రులు శ్రీసుబ్రహ్మణ్యముగారి నెంతయు ప్రశంసింపక మానరు. శైలి మధురమై బలిష్ఠమై సహజమై గ్రంథ మాంధ్రీకరణమను మాటను మఱపించుచుండును. దేశసేవ చేయగోరువారెల్లరును దీనిని పఠించి నిరాడంబర ఆత్మసమర్పణమును కథానాయకుడగు కందను జీవితమునుండి నేర్చుకొందురుగాక! వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండు సన్సువారు దీనికి ప్రకాశకులు.

## మాధవాశ్రమము :—

క్రౌనుసైజు 132 పుటలు వెల రు. 0-8-0లు. గ్రంథకర్త గుంటి సుబ్రహ్మణ్య శర్మగారు. ఇది యొక చక్కని నవల. విద్యాధికులు పట్టణములకు ఉద్యోగములకై పోవుట మాని గ్రామములలోనే స్థిరపడి అక్కడి వివాదముల మాపి, దుర్వ్యయములను తొలగించి, పారిశుభ్రతను బోధించి, పంటలు పెంచి, సౌభ్రాతృత్వము పెంపొందించి దేశౌన్నత్యమునకు పాటుపడవలయునని గ్రంథకర్త ఆశయము. కథానాయకుడు మాధవశర్మగారి పరిశుద్ధజీవనము, త్యాగకృత్యములు, స్నేహశీలము మొదలగునవి గ్రామసేవకుల కాదర్శప్రాయములుగానున్నవి. ఇది ప్రథమ భాగము. ఈ గ్రంథమును తమ 7వ పుష్పముగా ప్రకటించిన శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాలవారు ద్వితీయ భాగమునుకూడ సత్వరముగ ప్రకటించి పాఠకలోకముయొక్క కుతూహలమును తీర్తురుగాక!

## రాయభారము :—

క్రౌనుసైజు 188 పుటలు. వెల రు. 1-8-0లు గ్రంథకర్త శ్రీ భాగవతుల నృసింహశర్మగారు బరంపురం. వేగుచుక్క గ్రంథమాల 45వ పుష్పముగా ప్రకటితము. కథ ఐతిహాసికము. నవలరూపమున అధ్యాయములుగ విభజింపబడి మృదుమధుర ధారాళ గంభీరగద్యములో భారతచరిత్రనంతయు నేడు తిరిగి మన కండ్లకు కట్టినట్లు చిత్రింపబడినది. భారతచరిత్ర మెన్నిసారు లెన్నిభాషలలో విన్నను తనివి తీరదనుట యటుండనిచ్చి గ్రంథకర్తయొక్క శయ్యామాధుర్యమును, కల్పనావిలాసమును కథకు మఱియొక్క నవీనతను గూర్చుచున్నవి. చిరకాల స్థాపితమైన యీ గ్రంథమాల నేటివఱకును ఇట్టి సత్సగ్రంథములను ప్రకటింప గల్గుచుండుట పోషకాభిమాన వర్గమువారి యౌదార్యమును పాఠకలోకముయొక్క ఔదార్యమును వేనోళ్లను చాటుచున్నది.

## పాశ్చాత్యభావప్రపంచము :—

భారతదేశముమాత్ర మాధ్యాత్మిక జిజ్ఞాసయందు నిరతిగలదనియు, పాశ్చాత్యదేశీయులెల్లరు భౌతిక సంపద్దేవతారాధకులనియు మనలో ననేకులు తలంతురు. కాని అది పొరపాటు. పాశ్చాత్యప్రపంచములో సుమారొక శతాబ్దమునుండి చెలరేగుచున్న భౌతిక నాగరకతా ప్రాగల్భ్యములోకూడ దాని నీసడించుచు పరిహసించుచు తిరస్కరించుచు ఉత్తమసౌందర్యములను చిత్తవృత్తులను తేజస్సులను చూపు ప్రవక్తలు, కవులు, యోగులు, కర్మయోగులు, దేశభక్తులు, తత్త్వవేత్తలు ఉదయించి ప్రకాశించుచు నేయున్నారు. అయితే ఆనాగరికత యొక్క తంత్రములకు చిక్కక వీరెట్లు తమ వ్యక్తిత్వ

మును నిలబెట్టుకొని ధీరులై తమ ధర్మములను ప్రకటిం
చినారో ఆ అధిభౌతిక నాగరికతయు షెట్టివారి బోధ
వలనలన నెట్టి మార్దవమును కాని బడయక తన వికృ
తపు పోకడలను తాను పోవుచు ఇట్టి మహనీయుల
సిద్ధాంతములకును వ్రాతలకును ఒక దూరపుసలాము
మాత్రము పెట్టి విశ్వవిద్యాలయాధ్యాపక శిష్యబృం
దముల పఠనమాత్రనిమిత్త మాయా గ్రంథాలయ
ములో బిగించి పెట్టినది. కార్లైలుయొక్క వీరా
రాధనభావము కాని ఎమర్సనుయొక్క సాంసిద్ధిక
తత్వము గాని, గెటెయొక్క సుందరవైరాగ్యము కాని
ఆనాగరికతపై నెట్టి చిహ్నములను బిందలేక పోయి
నవి ఈ నాగరికతయొక్క ఘోరపీడనములచే
కందిపోయుచుండిన ఇటాలియా రష్యా పేదలు మాత్ర
ము మేజనీ, టాలస్టాయిల వ్రాతలవలన సర్వంకష
సాహసోద్రేకములకు వశ్యులయి రాజకీయములలో
తమ కనుకూలనులగు మార్పులను చేసుకొన
గలిగినారు. తండ్రి తాతల సంప్రదాయములయం
దును ప్రాచీనాచారములయందును విశ్వాసము
పూర్తిగ దొలగిన కాని పాశ్చాత్యదేశపు ద్రవ్యనాగరి
కత విజృంభించ నేరదు. అది విజృంభించుచున్న దేశ
ములలో వ్యక్తి విజృంభణము స్త్రీ స్వాతంత్ర్యము
తమంతట తామే రేకెత్తక మానవు. వీనిని బోధించు
టకు కవులు గ్రంథములు నాటకములు మొదలగునవి
వ్రాయుట చర్వితచర్వణమగును. ఏదేశమునందైన
నుదయించు పెద్దలును కవులును ఆదేశపు నాగరికత
యొక్క ఆధిక్యతను గొనియాడువారైననుందురు,
లేదా దానిలోని దోసగులకు వగచి తిరస్కరించు
వారైననుందురు. అట్టివారిలో పేరెన్నికగన్న
'భావప్రతినిధు' లెనమండుగురిమీద సుందరమగు విమ
ర్శనలను ఎనిమిదింటిని వ్రాసి శ్రీయుత యమ్. వి.
యస్. సుబ్బారావు ఎమ్. ఎ. గారు ఆంధ్రలోకము
నెదుటనుంచినారు. ప్రాక్ ప్రతీచీ గ్రంథమాలా
(రాజమహేంద్రవరం) సంపాదకులు శ్రీయుత
కామరాజు హనుమంతరావు గారు దీనిని ప్రథమ
పుష్పముగా ప్రకటించినారు. వారు తమ పీఠికలో
చెప్పినట్లు ఈ గ్రంథపఠనము అవకాశముగల యువ
కులందరియందును "ధర్మవిచారణను పురికొల్పగల"దని
యాశించవచ్చును. క్రౌనుసైజు 104 పుటలు వెల
రు. 1-4-0.

సనత్సుజాతీయము, ద్రౌపదీస్వయంవరము:-

కీర్తిశేషులగు అకొండి వ్యాసమూర్తి శాస్త్రిలు
వారు "శ్రీమదాంధ్ర భారతనవనీతము" అను
గ్రంథమును వ్రాసియుండిరి. కాని వార్ధక్యము
రచనానిమగ్నత మొదలగు కారణములచేత వారును,
ధనాభావముచే మద్రాస్ సేవాసదనము (కీల్పాకు)
లో తెలుగుపండితులగు వారి పుత్రులు శ్రీయుత
అకొండి వెంకటశాస్త్రిగారును వానిని ప్రకటింప
జాలకపోయిరి. అంత పెద్ద గ్రంథమును ప్రకటింప
సాహసింపగల సారస్వతాభిమానులు గాని శ్రీమం
తులు గాని యాంధ్రదేశమున కొఱతగానుండుట
గని వెంకటశాస్త్రిగారు అందులోని భాగము
లను కోరినవారి కచ్చొత్తించుకొన నిచ్చివేయు
చున్నారు. కొల్లాపురం స్నేహలతా కవితా సంఘము
వారు ప్రకటించిన సుకన్యా చరితమును మే మిదివర
కొకసారి విమర్శించితిమి. భారతీ పత్రికాధిపతులును
ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికాధిపతులును ప్రకటిం
చిన సనత్సుజాతీయము, ద్రౌపదీ స్వయంవరమను
గ్రంథములు నేడు మా కార్యాలయము నలంకరించి
నవి. విషయములు పురాణప్రసిద్ధములు. శైలి గంభీ
రము. అచ్చ తెలుగు, అది సంస్కృతపదము లక్క
చెల్లెండ్రవలె అనగి పెనగి పద్యపద్యంబునను హృ
ద్యంబుగ నాట్యములు సేయుచుండును. శైలి విద్వ
ద్వైకసాధ్యంబయ్యు శ్రద్ధాసహితులై పఠించువారి
కెల్లరికి నుత్సాహరేఖను రేకెత్తించుచుండును. శ్రీ
మంతు లింటి సమారాధనములందును స్థిరతరజీర్ణశక్తి
యుక్తులు మాత్రమే సేవించి యానందించునట్లు
ధీమంతులగు శాస్త్రిలవారి కవిత్వపుటామెతను
శ్రద్ధాన్వితులైన పండితులు మాత్రమే అనుభవించి
ఆనందించగలరు. ఎట్టి పామరులైనను ఇందలి పది
పద్యములు ప్రౌఢముగ నేర్చుకొన్నచో పండితులు

కాక మానరు. ఆంధ్రమహాజనులు శ్రీవారి గ్రంథములను పద్యపద్యములుగాగాని ఘట్టఘట్టములుగాగాని ప్రకటింప దొరకొందురుగాక. పై గ్రంథములు రెండింటి వెలలు రు. 0-6-0లు, రు. 0-4-0లు మాత్రమే. ఈ గ్రంథములు వలయువారు కాని, ఇతర గ్రంథభాగములు ప్రకటింప గోరువారు కాని సేవాసదనమున తెలుగుపండితులుగారగు వేంకటశాస్త్రిగారి పేర వ్రాసుకొనవలెను.

నా ప్ర భు వు :—

క్రౌనుసైజు 90 పుటలు. వెల రు. 0-4-0లు మాత్రము. గ్రంథకర్త్రి శ్రీమతి వీరపానేని సత్యవతి గారు. శ్రీకృష్ణుడు భగవదవతారమనియు శ్రీ గౌరాంగప్రభువు శ్రీ కృష్ణావతారమనియు శ్రీహరనాథబాబాగారు గౌరవాంగప్రభువుయొక్క అవతారము గనుక శ్రీకృష్ణ శ్రీ భగవదవతారమేయనియు శ్రీ హరనాథబాబాగారి శిష్యవర్గముయొక్క సంపూర్ణవిశ్వాసము. శ్రీ హరనాథబాబాగారి జీవితము నుండి పెక్కు నిదర్శనములను తీసుకొని యీ సంగతిని బుజువుపరచుచు శ్రీ చింతాదీక్షితులుగారు లోగడ రెండు గ్రంథములను వ్రాసియుండిరి. నేడీ గ్రంథకర్త్రియు మరియొక గ్రంథమును వ్రాసి ఆంధ్రజనులకెల్లతికి నీవిషయము జ్ఞప్తిపరచుచున్నారు. శ్రీ వెదురుమూడి శేషగిరిరావు పంతులుగారు దీని కొక సుందరమగు నుపోద్ఘాతమును వ్రాసినారు. గ్రంథము ప్రభువుగారి ఉపదేశామృతముతో తొలుకాడుచున్నది. ఆంధ్రు లీగ్రంథమును పఠించి తరింతురని కోరుచున్నాము. కాకినాడ శ్రీ హరనాథ తత్వప్రచారిణీసభ, ఆంధ్రశాఖవారివద్ద ప్రతులు వెలకు లభించును.

క ళ్యా ణి :—

ఇది యొక సచిత్ర మాసపత్రిక. సంపాదకులు గంటి సూర్యనారాయణ శాస్త్రిగారు విజయనగరం. ఏప్రిల్ మాస సంచిక మా కార్యాలయమునకు వచ్చినది. డబులుక్రౌను 35 పుటలు. పద్యములు, కథలు, మొదలగు విషయములు గలవు. రాజా విక్రమదేవ వర్మగారి ముఖచిత్రమును, సెట్టి లక్ష్మీనరసింహం గారి 'చిత్రమాలిక'లను గ్రంథమును రాజావారు కృతి నందుచున్న చిత్రమును గలవు. వడ్డాది సుబ్బారాయుడుగారు, వేంకటపార్వతీశ్వరకవులు, శేషాద్రి శర్మగారు, జాషువాగారు, సెట్టి లక్ష్మీనరసింహం గారు మొదలగువారు వ్రాసిన పద్యములును, పూడిపెద్ది వెంకటరమణమ్మగారు వ్రాసిన సర్వీసు అను కతయును గలవు, సంవత్సరము చందా రు. 2-0-0.

వై జ యం తి :—

కొల్లాపుర స్నేహలతా కవితాసంఘమునుండి వెలువడిన వార్షికపత్రిక. శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి (నూజవీడు)గారు సంపాదకురాలు. డబులు క్రౌను 62 పుటలు. చిలకమర్తి లక్ష్మీనరసింహం గారి భట్లశతకము, ఆకుండి వ్యాసమూర్తి శాస్త్రి గారి సుకన్యా చరితము, జనమంచి వెంకట్రామయ్య గారి మేఘసందేశము మొదలగు ప్రౌఢకావ్యములును, 'వ్యసనములు ఫలించునా', 'యతులుప్రాసలు' మొదలగు వ్యాసములును ఇందు గలవు. ఇట్టి యుత్కృష్టలేఖకుల కావ్యములనెల్ల సేకరించి ఒకచో చేర్చి ప్రకటించిన సంపాదకురాలు శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారు ఆంధ్రుల కృతజ్ఞత కెంతయు పాత్రురాలు. వెల రు. 1-0-0.

ప్రా థ మి క పా ఠ శా ల :—

ఈ మాసపత్రికయొక్క ఏప్రిల్, మే మాసములకు సంబంధించిన సంచిక మా కార్యాలయము నలంకరించినది. బందరు, కైకలూరు తాలూకా బోర్డులు, బందరు గవర్నమెంటు ట్రెయినింగు స్కూలుల యాదరణక్రింద ప్రకటింపబడుచున్నది. ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుల కుపయుక్తములగు పాఠశాలశృంగారము, మాదిరిపాఠములు, విద్యాధర్మములు, గురుభక్తి మొదలగు నంశములను గూర్చిన వ్యాసము లిందు గలవు. [illegible] విద్యా విషయిక సభలు, ఉపన్యాసములు ప్రదర్శనములు

# వనితాలోకము

శ్రీమతి గుళ్లపూడి విశ్వేశ్వరమ్మగారి జన్మస్థలము, గంజాముమండలములోనున్న బరంపురము. శ్రీకల్లికోటకళాశాలయం దాంధ్రపండితులై యుండిన శ్రీయుత పసుమర్తి కృష్ణమూర్తిగారి కీమె ప్రథమపుత్రిక. ఈమె తల్లిపేరు శ్రీమతి వెంకుబాయమ్మగారు. వీరు మంచి సంఘసంస్కర్తలు. కృష్ణమూర్తిగారు సాహిత్యమునందే కాక సంగీతమునందును మంచిప్రవేశమున్నవారు: ఫిడేలు, మురళి, మృదంగము మొదలగు జంత్రములయందును ప్రజ్ఞగలవారు. శైశవమునుండియుఁ దమపుత్రికకు తామే స్వయముగ సంగీతముఁజెప్పిరి. ఫిడేలు గూడ నేర్పిరి.

శ్రీమతి విశ్వేరమ్మగారి కిది యింటివిద్య. పదిపంద్రెండేండ్లనుండియు నీమెను దండ్రిగారు కాకినాడ, రాజమండ్రి, మొదలగు నగరములకు బిలచుకొనిపోవుచు నచ్చటచ్చటఁ గల పెద్దలయెదుటఁ బాడించి వారి యాశీర్వాదముల నీమె కిప్పించుటయు వాడుక. ఈకార్యమునందు వారితరులవలని వచ్చునిందలోర్చి యుండుట ప్రశంసాపాత్రము.

పరమపవిత్రమగు సంగీతవిద్య, పడుపుగత్తెల పాలబడి చెడుచు, సద్గృహస్థుల యాదరణమునకు దూరమగుచుండు కష్టకాలమును గుర్తించి కృష్ణమూర్తిగారు మిక్కిలి విచారించి, యెట్టికొఅత నివారింపబూని తమ కుటుంబముతోఁగూడఁ మదరాసునకువచ్చి అడయారులో థియసాఫికల్ కాలేజియందు సంగీతసాహిత్యశిక్షకులై యుండఁజొచ్చిరి. అచట శ్రీమతి విశ్వేశ్వరమ్మగా రాంగ్లభాషలో మూడవఫారమున జేర్చుకోబడి విద్యాభివృద్ధి జేయుచుండిరి.

1930 లో మద్రాసునగరమున, సంగీతపరిషద్వర్గమువారిచే జేయఁబడినఫిడేలు పోటీపరీక్షయందు, ద్వితీయబహుమానమును బడసిరి. మరుదవాడ శ్రోత్రియదారులగు మ॥ రా॥ శ్రీ గుళ్ళపూడి రామచంద్రయ్యగారు ఈయమను బాణిగ్రహణము జేసుకొనిరి. వీరును కళాభిజ్ఞులగుటవలన శ్రీవిశ్వేశ్వరమ్మగారు, తమ గానకళాప్రదర్శనములఁ గావించుచు పిన్నపెద్దలచే మెప్పువడయుచున్నారు. మరియు శ్రీరామచంద్రయ్యగారికి నాటకములయం దత్యన్తప్రీతి. వీరు సుగుణవిలాసనభయం దొకప్పుడు పేరెన్నికఁగాంచియుండిరి. స్త్రీలు నాటకరంగమున నిలువవచ్చును—దానివలన దోషములేదని వీరియాశయము కాఁబట్టి తమ యర్ధాంగియగు శ్రీమతివిశ్వేశ్వరమ్మగారికిగూడ రంగస్థలప్రవేశము గలిగించిరి. అందునగూడ నీమె పెద్దల మెప్పుగడించెను



శ్రీమతి గుళ్లపూడి విశ్వేశ్వరమ్మగారు

నివేదికలు మొదలైనవికూడ ప్రకటింపబడుచుండును. సంవత్సర చందా రు. 1-8-0.

### ప్రకృతి :—

ఇది యొక ఆంధ్ర ఆరోగ్యవిషయిక మాసపత్రిక. బెజవాడలోని ప్రకృతి ఆఫీసునుండి ప్రకటింపబడుచున్నది. ఇప్పటికి 13 సంపుటములు ముగిసి 14వ సంపుటము జరుగుచున్నది. ప్రకృతిశాస్త్రరీత్యా అనగా తొట్టివైద్యము, లింగస్నానము, ఆవిరి, అపక్వాహారము మొదలగువాని మూలమున వివిధ రోగముల బాపు మార్గములనుగూర్చి అనుభవజ్ఞులు, వ్రాయు విషయము లిందు ప్రకటించబడుచుండును. చందా సం, 1కి రు. 3-0-0లు.

### భారతీ పత్రిక :—

ప్రతి శనివారమును బరంపురమునుండి ప్రకటించబడుచుండు తెలుగు పత్రిక. ఇది శ్రీయుత యమ్. వి. రమణరావు బి. ఎ. గారి సంపాదకత్వమున వెలువడుచున్నది. కొంతకాలము క్రిందట దినపత్రికగానుండి ఇది చేసిన సేవ నాంధ్రులు మరువజాలరు. ఆంధ్రరాష్ట్ర పునర్నిర్మాణ ప్రయత్నములును, గంజామునుండి ఆంధ్రభాగము ఉత్కళరాష్ట్రములోనికి సంక్రమింపకుండజేయు ప్రయత్నములును తీవ్రముగ చేయవలసిన యిత్తరిని, "న్యూ ఒరిస్సా" అను క్రొత్తపత్రికను పెట్టి ఉత్కళులు గంజా మాంధ్రభాగముల కబళింప ప్రయత్నించుచున్న యిత్తరిని, ఈ పత్రికాసంస్థాపన మత్యవసరమును ఇది చేయగల సేవ అపారమునైయున్నది. పత్రికలోని సంపాదకీయములును వ్యాసములును పద్యములును వార్తలును ఈ మహాసమస్యకు చెందినవై ఆంధ్రతత్వమును వెల్లిగక్కుచున్నవి. ఇట్టి పత్రికలకు సర్వవిధములను చేయూతనిచ్చుట గంజాం, విశాఖపట్టణ మండలముల ఆంధ్రులకేగాక యెల్లరకు నవశ్యకర్తవ్యమైయున్నది. సంవత్సరము చందా రు. 4-0-0లు మాత్రమే.

### శ్రీ ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక :—

ఈ పత్రికయొక్క 22వ సంపుటము 1వ సంచిక చైత్ర వైశాఖమాసములకు సంబంధించినది మా కార్యాలయమునకు చేరినది. ఇందు ఆంధ్రసాహిత్య పరిషద్వార్షికోత్సవముయొక్క అధ్యక్షోపన్యాసములును 'ఆంధ్రభారతీవాంఛ' యను శ్రీపతి త్ర్యంబకరావుగారి పద్యములును శ్రీమాన్ మేదేపల్లి వేంకటరమణాచార్యులుగారు వ్రాసిన 'నిఘంటు చరిత్రము'ను మరియు నితరవిషయములును గలవు. శ్రీ వడ్డాది సుబ్బారాయుడుగారి అధ్యక్షోపన్యాసములో ఆంధ్రపరిషత్తువలన భాషకు కలిగిన లాభములు, అది యింకను చేయవలసిన పనులు వివరింపబడినవి. మరియు పరిషత్సభయొక్క వృత్తాంతములును శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు సంఘమునకయిన ఆదాయవ్యయములును వివరింపబడినవి. విడిసంచిక రు. 0-8-0లు. సంవత్సర చందా రు. 3-0-0. వలయువారు కాకినాడలోనున్న కార్యాలయమువారికి వ్రాసి బడయగలరు.

### ఆంధ్రరాష్ట్ర అస్పృశ్య సేవాసంఘపు 16-10-32నుండి 15-4-33వరకు నివేదిక.

ఈ సంఘమునకు శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగా రధ్యక్షులు, శ్రీయుత మాగంటి బాపినీడుగారు కార్యదర్శి. ఈ ఆరుమాసములలో 13 సేవాసంఘములు పదమూడాంధ్రజిల్లాలలో పెట్టబడినవి. తీవ్రసంచారప్రబోధములు జరిగినవి. సభలు, ఇష్టాగోష్ఠి, హరికథలు, ఊరేగింపులు, ఉపన్యాసములు, కరపత్రములు, ప్రదర్శనములు, మ్యాజికులాంతరుప్రదర్శనముల మూలమున దేశములో మంచి భావపరిణామము కలిగించబడినది. దీనికి విద్యాభివృద్ధికొరకు పోలిసెట్టి రంగనాయకులు నాయుడుగారు రు. 6000లు విరాళమిచ్చిరి. 7 రాత్రిబడులు పెట్టించిరి, 4804 గ్రంథములను వసూలు చేసిరి. సత్రములోనికి బావులవద్దకు హరిజనులకు కొన్ని తావులలో ప్రవేశమిప్పించిరి. ఇది ప్రస్తావకాలములో సుమారు నాలుగువేలు రూపాయలు జమచేసి మూడువేల రూపాయిలు పై

విషయములకై ఖర్చుపెట్టినది. దీనినుండి ఆంధ్రదేశ మితోధిక సేవకై నిరీక్షించుచున్నది. సంఘమువారి ప్రయత్నములెల్ల విజయవంతములగు గాక!

## తాడేపల్లిగూడెం గ్రామపంచాయితీల మహాసభ.

పశ్చిమ గోదావరిజిల్లా, తాడేపల్లిగూడెం తాలూకా గ్రామపంచాయితీల చతుర్థ మహాసభాధ్యక్షుల శ్రీయుత శనివారపు సుబ్బారావుగారి యుపన్యాసము మా కార్యాలయము నలంకరించినది. ఇందు అతిక్లుప్తముగ జిల్లా తాలూకాలను గూర్చిన చరిత్రము గలదు. గత యెన్నికలలో వ్యక్తి అభిమాన ద్వేషములతోనే ప్రచారములు జరిగినవి కాని రాజకీయాభివృద్ధి కనువగు పార్టీలతో జరుగలేదని విచారించిరి. నైతికబలముతో ఎన్నికలను జరిపించవలెననియు, ప్రెసిడెంట్లు ఉద్యోగస్థులపై కక్ష సహింపరాదనియు కంట్రాక్టులు పంచాయితీల కియ్యవలెననియు రూరలు డివలపుమెంటు ఫండు ట్రస్టీలలో 2/3 వంతు సభ్యులు పంచాయితీలకు చెందవలెననియు మొదలగు సూచనలు అత్యవసరావలంబనీయములు. అస్పృశ్యతానివారణము, జాతీయైకమత్యముల యావశ్యకతనుగూర్చికూడ వారు నొక్కి చెప్పిరి.

## అన్నపూర్ణాదేవి లేఖలు:—

మహాత్ముని సహాయనిరాకరణోద్యమము గంగాపుష్కరమువలె జాతీయ జీవనమునంతటిని పవిత్రము చేసెను. ఆ పుష్కరిణిలో ప్రథమస్నానము నాచరించినవారిలో నొకరు కీర్తిశేషురాలగు శ్రీమతి అన్నపూర్ణాదేవిగారు. దేహంబున తారుణ్య సౌందర్యంబులు, డెందంబున సందంబగు నావేశములు, చర్యల నిరంతరసేవాదీక్ష తొలుకాడ ఆంధ్ర ఉపన్యాసవేదికారంగము నెల్ల నుఱ్ఱూతలూగించి యువకపరోజనచిత్తంబులనెల్ల జూఱగొని దేశసేవా ముఖంబునకు తెగలిగిన అద్వితీయ ప్రతిభావంతురాలామె. దివంగతయయ్యు ఆమెఆత్మ స్వర్గంబున నక్షత్రంబువలె మెఱయుచు తరతరంబుల నుదయించుచుండు దేశసేవకసంతానమున కెల్ల తాదర్శప్రాయమైయుండును. ఇప్పటి దేశసేవకులకేకు లామెను ముఖస్తముగ నెఱుంగుదురు. ఎఱుంగనివారైనను వినియుండకమానరు. స్వర్గీయమైన అట్టి జ్యోతిస్స్వరూపముయొక్క పార్థివజీవనములో నెట్టి యారాటములు, ఆశయములు, విజయములు, నిరాశలు ఆమెను చుట్టుముట్టి ఉఱ్ఱూటలూగించెనో తెలిసికొను కోరిక ప్రతి దేశభక్తునకును సహజమైనది. ఇట్టి సర్వజనీనమైన కోరిక తీరుటకుగాను ఆమె భర్త శ్రీయుత మాగంటి బాపినీడుగారు ఆమె చరిత్ర నామె లేఖలమూలముగానే ప్రకటించి ఆమె గార్హిక జీవనముయొక్క సత్యస్వరూపమును లోకమునకు ప్రకటించినందు కెంతయు ధన్యులు. అదియే అన్నపూర్ణాదేవి లేఖలను నీ 242 పుటల గ్రంథము. పూజ్యులజీవితచరిత్రలు మానవులజీవితములను పూజ్యములుగ చేయును. సకల దేశభక్తులకు,యువకదంపతులకు, సారస్వతాభిమానులకుగూడ నిది అవశ్యపఠనీయము. శ్రీయుత బాపినీడుగారి తొలిపలుకు, శ్రీయుత ఉన్నవ లక్ష్మీనారాయణగారి కడపలుకు, మహాత్ముని ప్రశంస, బాపినీడు, అన్నపూర్ణాదేవి, ఆమె తలిదండ్రుల చిత్రపటములు కలిగి రాణించుచున్నది. వెల రు. 2-0-0లు మాత్రమే. వలయువారు 'కార్యదర్శి, అన్నపూర్ణాదేవి స్మారక సంఘము, ఏలూరు' అని కాని 'మాగంటి బాపినీడు గారు, ఏలూరు' అని కాని వ్రాసి తెప్పించుకొనవచ్చును. ఈప్రతుల విక్రయమువలన వచ్చు ధనమెల్లయు అన్నపూర్ణాదేవి జాతీయ పాఠశాల నిర్వహణమునకు వినియోగపరచబడును.

## నరసాపురం తాలూకా ప్రోగ్రెసివు యూనియను 32వ వార్షిక నివేదిక.

ఈ యూనియను 1901లో స్థాపించబడినది. ఇందు జరుపుచున్న పోటీపరీక్షలలో ననేక యువతులు విజయమునంది బహుమానముల బడయుచున్నారు. ఇండ్లకు పుస్తకములందించు గ్రంథాలయము, ఉచితపఠనమందిరములనుగూడ ఇది జరపుచున్నది. గృహపరిశ్రమలనుకూడ నెలకొల్పనున్నది. దీని నిట్టి సుస్థితిలో పెట్టి జరిపించుచున్న శ్రీయుతులు యఱ్ఱమిల్లి నారాయణమూర్తి, అద్దంకి బిందుమాధవరావుగార్లకు పశ్చిమ గోదావరిజిల్లాబోర్డు, విద్యాశాఖలవారును ఇతరులును తగిన ప్రోత్సాహమిచ్చి ఇతోధిక గౌరవఖ్యాతులను గూర్తురుగాక!

# వార్తలు—విశేషములు

విధవావివాహ సహాయకసభయొక్క చెన్నపురి శాఖవారిచే చెన్నపురిలో గంగారాము భవనమున రెండు విధవావివాహములు జరుపబడినవి. మొదటి వివాహములో పెండ్లికుమారుడు డోక ప్రొద్దుటూరు వర్తకుడు. పెండ్లికుమార్తె శ్రీమతి వెంకమ్మగారు. ఈమె భవనమునకు వచ్చి పదిదినములు మాత్రమే యైనది. ఇంతశీఘ్రముగ అనుకూలసంబంధము లభించుట ప్రశంసనీయము. రెండవపెండ్లిలో వధువు శ్రీమతి కమలమ్మగారు. వరుడు నెల్లూరు వాస్తవ్యులు వి. వెంచయ్యగారు. రెండు పెండ్లిండ్లకును తెనాలి విధవావివాహశాఖాధ్యక్షులు రాజేశ్వరరావుగారే పురోహితులు.

* * *

శ్రీమతి దామెర్ల కమలారత్నం పతిగారు జూను నెల 13వ తేదిని అంతర్వేదియందు స్త్రీల సభను జరిపి యుపన్యసించిరి. అఖిలభారత మహిళాసభ వారు స్త్రీలోకమునకు వోటుహక్కు మొదలగు సౌకర్యములను గూర్చుటకై యెట్లు శ్రమపడు చున్నదియు తెలిపిరి. గ్రామబాలికల విద్య, వివాహవయస్సు పొడిగించుట, పురదా తీసివేయుట, స్త్రీ హక్కులు, అస్పృశ్యతా నివారణ మొదలగు అంశములనుగూర్చి యుపన్యసించిరి. ఈమె అఖిలభారత స్త్రీసంఘముయొక్క ఆంధ్రశాఖలో ఒక సభ్యురాలు. ఈమె కుగ్రామములకుగూడ పోయి స్త్రీ సంఘపు టాశయముల నీరీతిని జాటుచు వ్యాపింప చేయుచున్నందుల కెంతయు వంద్యురాలైయున్నారు. ఈమెతో వచ్చిన శ్రీమతి రామలక్ష్మమ్మగారు పెద్దింటి స్త్రీలు సాయంకాలములయందు వచ్చి బహిరంగస్థలములయందు విహరించుటకు గ్రామములలో క్లబ్బు లత్యవసరములని నొక్కి వక్కాణించిరి.

* * *

బ్రిటిషుప్రభుత్వమువారితో కాంగ్రెస్సు శాశ్వతముగ గౌరవప్రదమగు సంధిచేసుకొను నవకాశముల నరయుటకై మహాత్ముడు రాజప్రతినిధిగారిని దర్శింపఁగోరుచు తంతివార్తనంపెను. శాసనతిరస్కరణ సిద్ధాంతమును విసర్జించుకొననిదే తాను మహాత్మునితో సంభాషింప నొల్లనని విల్లింగ్డనుగారు బదులు తంతినంపించిరి. దేశముయొక్క అగాధదుస్థితి తొలగి సౌఖ్యవంతముకాగల ఆశల కిక తావులేనట్లే తోచుచున్నది.

* * *

భావనగరసంస్థానములో మద్యపానమును మద్యవిక్రయమును నిషిద్ధములు. అట్టి సంస్థానములో ఒక రెండవతరగతి ప్రయాణీకుల రైలుబండిలో ఇరువురు నర్సులు తప్పత్రాగి బుడ్లు చేతులలో పట్టుకొని ప్రేలుచు పట్టుబడిరి. వీరివద్ద టిక్కట్టులుకూడ లేవట. ఈ సంస్థానములో నిట్టి చర్య జరుగుట కిదియే మొదటిసారిగాన దీనినిగూర్చి తగిన చర్య దీసుకొని రక్షకభటులకు మంచి కట్టుదిట్టములగు ఆజ్ఞలొసగబడినవని తలచబడుచున్నది.

* * *

వంగరాష్ట్రములో మహమ్మదీయులు హిందూ బాలికలను ఎత్తుకొనిపోవు నేరములు సర్వసామాన్యములైనవి. సంవత్సరమునకు దామాయిషీని వేయి జరుగుచున్నట్లు శాంతకుమార రాయి చౌదరిగారు చెప్పుచున్నారు. ఇది రికార్డులవలన తెలియుచున్నది.

ఇంతకన్నను నెక్కువ నేరములు రికార్డులకు తెలియకుండనే జరుగుచున్నవి. పదిమంది నేరస్థులను పట్టుకొని భరింపరాని శిక్షల నొకసారి విధించినచో ఇట్టి నేరములు చాలవరకు జరుగబోవని యొకసారి జస్టిసు అమీరాలీగారు చెప్పుటయేకాక అట్లు చేయుచుండిరి. బెంగాలు పోలీసులును మేజస్ట్రేటులును తగిన చర్యలను తీసుకొని యిట్టి నేరముల నాపకున్నచో ఇది ప్రభుత్వమునకు తీరరాని కళంకమై యుండగలదు.

* * *

ఫ్రాన్సులో పెండ్లికాని స్త్రీని నీచముగ చూతురు కాని పెండ్లియై పెనిమిటిని విడచుచో అట్లు చూడరు. కనుక అనేక స్త్రీలు తమకన్నె చెఱ విడిపించుకొనుటకై ఏ పురుషునికైన కొంతలంచమిచ్చి పెండ్లిచేసుకొని కొంచెముకాలము తరువాత వివాహ విచ్ఛేదముల బడయుచున్నారు. స్వాతంత్ర్యవాంఛచే వారిట్టిచిత్రములు చేయుచున్నారు.

* * *

ఇరానుదేశపుస్త్రీలు పాశ్చాత్యవనితల మార్గముల ననుసరించి ఫేసుపౌడర్లు, పెదవిరంగులు, కనుబొమల కాటుకలు మొదలగు నభ్యాసములు చేసుకొని ధనవ్యయము చేయుచున్నారు. కనుక ఇట్టి విదేశీయాచారానుకరణమును ఆదేశప్రభుత్వమువారొక నేరముగా గణించి శిక్షించుచున్నారు.

* * *

హృషికేశము నందు పదిమంది సన్యాసులు మంచి హరిజనప్రచారమును చేయుచున్నారు. చందాలెత్తుచు మిఠాయిపంచుచు, భజనలుచేయుచు, హరిజనుల వీధులనూడ్చుచు, రాత్రిపాఠశాలలు పెట్టుచు నిరంతరశ్రమ పడుచున్నారు. కొలదికాలములో హరిజనసేవకై వచ్చు సన్యాసుల సంఖ్య వందలకు వందలు పెరుగునని హరిజనసేవాసంఘ కార్యదర్శి ఎ. వి. ఠక్కరుగా రాశించుచున్నారు.

* * *

కాసీపద్ద నొకగ్రామములో మార్కండేశ్వర దేవాలయమునకు శివరాత్రి దినమున వేలకొలది జనము వచ్చును. ఇచ్చటికి హరిజనులు తప్ప తక్కిన అన్ని వర్ణములవారును పోవచ్చును. ముగ్గురు సత్యాగ్రహుల నాయకత్వముక్రింద 25 గురు సత్యాగ్రహులిందుకొరకై నిరశనదీక్ష పూనిరి. కొందఱు పెద్దలు వారివద్దకువెళ్లి ముందు ఉపవాసము విరమింపజేసి పిమ్మట గ్రామస్థులకు బోధపరచి వారి నందులోనికి విడచిరి. హరహరమహాదేవ అని శివనామసంకీర్తనముతో హరిజనులందరు నందు ప్రవేశించి శివారాధన మొనరించిరి.

* * *

నెల్లూరుజిల్లా ఆదిఆంధ్ర ఉద్ధరణసంఘమువారి ఆదరణక్రింద 25 గురు హరిజనుల కొకహాస్టలు జూలై 2వ తేదిని నెలకొల్పబడెను. వీరికి భోజనము, వసతి, స్కూలుజీతములుకూడ ఉచితముగ నీయబడును.

* * *

అరుణాచలపురమునందలి వినాయకుని దేవాలయము, అజ్మీరునందలి బాలాజీదేవాలయము, జయపురమునందలి బలయాలదేవాలయము, కటకునందలి పర్దేశి దేవాలయము, హొరాయందలి శిబిపుర బ్రాహ్మమొయితుల దేవాలయము, ధర్మమందిరము జగన్నాధమందిరము, బేతాయి చందిమందిరము, కాన్పూరునందలి కర్నెప్రాంతపు రెండు దేవాలయములు హరిజనులకు తెరువబడెను.

* * *

రంగయ్యరుగారు అఖిలభారత శాసనసభలో మార్చి 24వ తేదిని ప్రవేశపెట్టిన దేవాలయప్రవేశ బిల్లు ఆగస్టు 24 తేదిని చర్చకు వచ్చును. ఈబిల్లును మఠాధిపతులు, గ్రామస్థులు, కలెక్టరులు, ట్రస్టీలు మొదలగువారి అభిప్రాయముకొరకే తప్ప ఆర్యబ్రహ్మ సమాజములవారికిని హిందూమహాసభా సభ్యులకును పంపరాదని రామకృష్ణజాగారు ఒక సవరణ తేనున్నారట. : చివర ముప్వురకును విగ్రహారాధనలో విశ్వాసము లేదట.




**ప్రత్యేకాంధ్రరాష్ట్ర ప్రయత్నము :—**

ఆంధ్రులు కేవలారంభశూరులని మనలో మనమే గేలిచేసుకొనుచున్నారము. ఈ మధ్యను ఆంధ్రరాష్ట్రోద్యమపునఃప్రారంభమునకై చేయబడుచున్న పునరాందోళనము వలన ఆంధ్రులు కేవలమారంభశూరులేకాక మధ్యమధ్యకూడ విజృంభింపగలచేవగలవారని స్పష్టమవకమానదు. ఆంధ్రులజనసంఖ్య, వారిఆదాయము, వారిరాష్ట్రమున కగు ఖర్చులు, వానిని భరింపగల శక్తి మొదలగు విషయములనెల్ల నెత్తిచూపుచు తిరిగీ పత్రికాచయమునందెల్ల వ్యాసములు బయలుదేరుచున్నవి. కొన్ని స్థానికసంస్థలు కూడ తీర్మానములు జరుపుచున్నవి. బొబ్బిలిరాజావారిని యెల్లపత్రికలు నేకగ్రీవముగ ఖండించుచున్నవి. కాని యింతమాత్రమున విశేషప్రయోజన మేమియునుండదు. ప్రత్యేకరాష్ట్రమున కగు తీవ్రవాంఛను ఆంధ్రపత్రికలును, సభలును విశదీకరించుట యెంతయు అవసరమేయయ్యెను, ఆంధ్రులలో పెద్ద ఉద్యోగములను చేయుచు ఇంతోకొంతో ప్రభుత్వవువిశ్వాసమునకు పాత్రులై యున్న మహనీయులు దీనిని సాధించుటకు బద్ధకంకణులు కానిదే యీకోరిక యీడేరదు. ప్రజాభిప్రాయములకును, పత్రికావ్యాసములకును, సభలతీర్మానములకును ఎట్టి విలువనీయవలెనో ప్రభుత్వమువారికి చక్కగా తెలియును. దీనికితోడుగా పెద్దపెద్ద బిరుదులుగల పెద్దయుద్యోగస్థులు నిస్సంకోచముగను పూర్ణదీక్షతోడను తేవతేవకు ప్రభుత్వమువారి చెవిలో నిల్లుకట్టుకొని ప్రార్థించుకొనకున్నచో కార్యము నెరవేరగల సూచనలేమియు గాన్పించవు. ఉత్కళనాయకులకున్న ప్రత్యేకరాష్ట్రదాహములో సగమైనను మనమితవాదనాయకులకు లేనిచో ఈ కార్యము సానుకూలముగాదు. ప్రజలమెఱమెచ్చులకొఱకు ఎంతో కొంతపని చేసినామనిపించుకొనుచు, తీరా గవర్నరులు వైసురాయిల ముఖములయెదుట మొగమాటమువడుచు నీళ్లుగార్చుచుండు నాయకులవలన విస్తారము లాభముకలుగదు. ఆంధ్రనాయకులలో కాంగ్రెసు వాదులుగానున్నవారు దీనికి గడంగరు, గడంగినను ప్రయోజనములేదు. ఇక మితవాదనాయకులు ఈ సమయమున నీమాత్రము కృషియైనను చేయకున్నచో వారివలన దేశమునకు కలుగు ప్రయోజనమేమియో తెలియరాకున్నది. ఈసమయమున వారు నడుములుకట్టుకొని

శూరులవలె రాయబారము వెనుక రాయబారమును ప్రభుత్వమువారితో నడిపి దీనియొక్క ఆవశ్యకతను ప్రభుత్వమువారికి నచ్చఁజెప్పఁ బూనుకొనెదరా? ప్రభుత్వము గ్రుడ్డిది కాని మృతముకాని కాదు. తగినవారు కందిరీగలవలె దాని చెవులచెంత సంగీతమును విరమించకుండ పాడుచున్నచో అది భ్రమరకీటకన్యాయమునందక మానదు. అయితే మనవారికి కందిరీగలకుగల అట్టిఆసక్తి గలదేమో చూడవలెను. ఉత్కళనాయకులు తమపట్టును నెరవేర్చుకొని తమకట్టి ఆసక్తి కలదని ఋజువుచేసుకొనిరి. ధీమంతులగు మన మితవాదనాయకులుకూడ వారినుండి యీనీతిని నేర్చుకొని తమ ధీరత్వమును స్థిరపరచుకొనెదరుగాక!

**ఉత్తర సరిహద్దు:—**

ఆంధ్రరాష్ట్రస్థాపనకై ప్రయత్నములొకప్రక్కన సాగుచుండవలెననుట కెట్టి యాటంకమును లేదు. విరామములేకుండ మనమితవాదనాయకు లీప్రయత్నము చేయుచుండినచో మన ఆశయమీసరికే సిద్ధించియుండెడిది. గడచినదానికై వగవక యిప్పటినుండియైనను దీక్షసాగించినచో మరి కొంతకాలమునాటికైన నీయాశయము సిద్ధించుట నిశ్చయము. అయినను ఇంతకంటెకూడ ముఖ్యముగను తొందరగను సాగించవలసిన కార్యము వేరొకటియున్నది. అది ఆంధ్రరాష్ట్రపు ఉత్తరపు సరిహద్దునుగూర్చి. ఉత్కళులు తమ ప్రత్యేకరాష్ట్రమునుగూర్చి యెట్టి శ్రద్ధబూని పనిచేసిరో తమ సరిహద్దుల నిర్ణయమునుగూర్చి కూడ అంతకు రెండురెట్లెక్కువ శ్రద్ధబూని పనిచేసిరి, చేయుచున్నారు. దీని ఫలితముగ గంజాముజిల్లాలోని జీవగఱ్ఱలవంటి ఆంధ్రభాగములను తమరాష్ట్రములో చేర్పించుకొనుట వారికి సాధ్యమైనది. చేయి కాలుచున్నప్పు డాకులకు తడుముకొనునట్లు మనఆంధ్రులు తమకృషి నాలస్యముగ ప్రారంభించి ఆభాగములను తిరిగి తమకిప్పించవలెనని తీవ్రమైన ఆందోళనమును ప్రారంభించినారు. ఇందుకు గంజాంజిల్లా ఆంధ్రనాయకులును వారికి మద్దతుగా నేగిన శ్రీయుతులు కే.వి. రెడ్డి, వెంకటగిరి రాజా మొదలగువారును నెంతయు ప్రశంసనీయులు. అయినను వీరి కృషులు ఫలోన్ముఖములగు మార్గములు కానరాకున్నవి. మనమెంత కృషిచేసిన ఉత్కళనాయకులంతకు రెండురెట్లు కృషిని చేయుచున్నారు. ఇట్టితఱి నాంధ్రులకు బ్రిటిషుప్రభుత్వమువారిన్యాయబుద్ధి తప్ప రెండవ శరణ్యము లేదు. ఆంధ్రప్రాముఖ్యమును, జనాధిక్యతయునుగల బరంపురం, ఇచ్ఛాపురంవంటి నగరములను తత్ప్రాంతములను ఆంధ్రదేశమునుండి విడదీయుటవలన సంభవించు అనర్థములను అన్యాయములను గుర్తించుట వారికి సంభవముకాదు. ఎరిగికాని యెఱుగకకాని ప్రభుత్వమువారీయెడల నెట్టి అన్యాయమును చేసినను ఆంధ్రులు దానినోఢ్రపక్షపాతముగా భావించకమానరు. ఆంధ్రులకు పెద్దపట్టణమేదియు దక్షిణమున లేదుగదా యనుకారణముచేత బరంపురమును వారికి సమర్పణముచేయుట అత్త

గారిసొత్తు నట్లును తనమిత్రులకు ధారవోసి నట్లుండును. ఆంధ్రులజన్మస్వత్వములపై ప్రభుత్వము వారిట్టి అక్రమాక్రమణము చేయఁజూచుట సమంజసముకాదు.

గంజామునుండి పోవుచున్న భాగములను నిలబెట్టుకొనుటకు తీవ్రప్రయత్నములుజరుగుచున్న సమయముననే శ్రీకాకుళమునందలి కొందఱువ్యక్తులు బరంపురమెట్లు పోయినను పోవుగాక గాని పురాతనమై పాడుపడియున్న తమ నగరమును పునర్నిర్మాణముగావించి దానిని జిల్లా ముఖ్యపట్టణముగ చేయవలెనని యాందోళనము ప్రారంభించుట రామాయణములో పిడుకలవేట్లాటవలె పరిహాసపాత్రము. ఆంధ్రు లంతనిర్వీర్యులై తద్భాగములను రాబట్టుకొనలేని యభాజనులైన వెనుక నాలోచించవలసిన విషయము నిప్పుడే ఆలోచించుట అప్రస్తుతమనుమాట యటుండ నిచ్చి ఆంధ్రుల సక్రమాందోళనమునకు ప్రతికూలమనుమాటను వారు మఱువకుందురు గాక! ఇప్పుడు కాదుగదా ఎప్పటికైనను బరంపురం, ఇచ్ఛాపురప్రాంతములు ఆంధ్ర రాష్ట్రమున జేరువరకు ఆంధ్రులు తమ ఉత్తరపుసరిహద్దునిర్ణయము పూర్తి కానట్లు గానేభావించి ఆందోళనము సాగించుచుండ వలెనే కాని విరమింప వీలులేదు.

సంయుక్తరాష్ట్రమునపడుపు గృహనిషేధ చట్టము.—

పడుపు వృత్తిని నిషేధించు నుద్దేశ్యముతో మదరాసు బొంబాయిరాష్ట్రములలోను మైసూరు మొదలగు స్వదేశసంస్థానములలోను చట్టము లేర్పాటుచేయఁబడి యుండుటయెల్ల తెలిసినవిషయమే. వీటితో తుల్యమగు సంయుక్తరాష్ట్రమున నిట్టి చట్టమింతవఱకు జరుగకుండుటయే ఆశ్చర్యము. ఆరాష్ట్రపుశాసనసభాసభ్యురాలగు శ్రీమతి శ్రీకైలాసశ్రీవత్సవగారిమధ్య నొకబిల్లు ప్రతిపాదించినందు కెంతయు నభినందనీయురాలు. స్త్రీలు పడుపువృత్తివలన జీవించవలసివచ్చుట చాలనీచమనియు నాగరికతకు కళంకమనియు ఇట్టి దుర్వృత్తిని తొలగించవలెననియు చెప్పుచు నీమె యీబిల్లును ప్రతిపాదించెను. కొందఱు మహామ్మదీయసభ్యు లీబిల్లును సెలెక్టుకమిటీకి పంపుటను ప్రతిఘటించుచు వీరు బ్రిటిషుసోల్జరులకొఱకై యుంటున్నారుగనుక యీవిషయమున శాసనముచేయరాదని ప్రతిఘటించిరట. సైనికులకామము కొఱకుగాని, రాజ్యముల సంరక్షణ కొఱకుగాని ముగుదలమానముల నాహుతియొనర్చవలెనని అంగీకరించుటకంటె ఈ యుగంబున పాతకము వేఱొకండులేదు. ఇట్టి చట్టమునుచేసినచో పోలీసువారు వేశ్యల ననవసరముగ బాధపెట్టుదురని చెప్పుచు శ్రీ. సి. వై. చింతామణిగారు ఒకఅభ్యంతరము చెప్పిరట. ఎవరికెట్టి యిక్కట్టులును కలుగకుండ నిట్టి పాతకములు దేశములో నిర్మూలింపఁబడగలవా? అనవసరముగునట్టియు అన్యాయమగునట్టియు ఇబ్బందు లెవ్వరికిని కలుగకుండ ఇతరవిధములగు బందోబస్తులను చేసుకొనవలెను కాని చట్టము ప్యాసుచేయ కూడదనుట విపరీతవాదము. ఇట్టి పెడవాద

ములను లక్ష్యముచేయక సుశీలపక్షపాతులై
సంయుక్తరాష్ట్రశాసనసభాసభ్యులు పట్టము
సులభముగ ప్యాసగుటకు తగిన అనుకూల
ముల నెల్ల చేకూర్చుదురుగాక!

**త్యాగమహిమ:—**

అల్పులకు లభించు సంపత్సౌభాగ్యముల
కంటెఁగూడ ఆర్యులకు తటస్థించు కష్టముల
వల్లనే లోకమున కెక్కువమేలు చేకూరుట
ఆశ్చర్యకర విషయముకాదు. ఎడారులలో
నుండు పాంథవృక్షము (Traveller's Tree)
తానెన్నొక్కక్కకలకులననుభవించుచు
నలువురేసిజనుల నిదాఘదాహములఁ దీర్చు
చుండును. త్యాగముయొక్క అనుభవముగల
వారికి తప్ప అట్టి ఔదార్యగుణము లభింపదు.
సర్దారు గొల్లపూడి శీతారామశాస్త్రిగారి
త్యాగము, సేవానిరతి, సత్యసంధత మొద
లగు సుగుణ సంపత్తి సకలాంధ్రజన విదితము.
త్యాగముయొక్క మహిమను తామెఱిగిన
వారగుటచే ఆంధ్రమహాజనులెల్లరును కూడ
దానిని తెలుసుకొని నిష్కళంక దేశసేవకులు
కావలెనని వారు వాంఛించుచున్నారు. ప్రభు
త్వమువారు తమ కొసగిన శిక్షారూపకవి
శ్రామము నవకాశము చేసుకొని కడలూరు
కారాగారమున పాళీభాష నభ్యసించి, బౌద్ధ
వాఙ్మయమును తఱచి పదముగ్గురు మహా
త్యాగుల జీవనములను సంగ్రహించి కూర్చి
ఆరేసికానుల కాంధ్రయువతీ హస్త
పద్మంబుల కర్పించుచున్నారు. క్రౌను సైజు
80 పుటలు. కిమ్మత్తుగా కద్దరువస్త్రములను
త్పత్తిచేయించి ధరించువారికి చౌకగా నందిం
చుటయందు తామింతవరకు కలవరచుకొన్న
నైపుణ్యమును గ్రంథప్రకటనమునకై అత
నిప్పుడు వినియోగించుచున్నారు. తెనాలి
తాలూకా రేపల్లెలోనుండుఅతనిపేర రు0-2-0
లు తపాలచీటీ లంపినవారికెల్ల యీ 'త్యాగ
మహిమ'యను గ్రంథములభించును. తొలి
పలుకునందు వారు ఈ గ్రంథమునకు చేసు
కొనిన విన్నపమునే మేము దాని కాశీర్వాద
రూపకముగా అర్పించుచున్నాము.

**పెళ్లికావాలా? కూలికావాలా?—:**

జర్మనీదేశములో నిరుద్యోగ సమస్య
నిర్మూలనముకొరకై హిట్లరుగారొక క్రొత్త
యెత్తునెత్తినారు. మగలకు, భార్యలకుగూడ
కూలిపని చూపించుటన్న చాలాకష్టము.
పెండ్లాడి మగనితో కాపురముచేయు స్త్రీలు
గృహనిర్వాహణమునందే అప్రమత్తులై యుండ
వలెను కాని కూలికి రారాదని శాసనము
చేయనున్నాడు. పెండ్లాముచేత కూలిపని
మానిపించనిచో మగవానినికూడ కూలిపని
నుండి గెంటివేయఁజూచుచున్నాడు. ఒక్కని
ఆర్జనవలన ఇంటిలో దినచర్య నడువక పోవుట
వల్లనే యిద్దరును కష్టపడవలసివచ్చుచున్న
దను సంగతి హిట్లరుగారు మరచుచున్నా
రేమో తెలియదు. అయితే అతని ఉద్దేశ్య
ము మంచిదనుట కాటంకములేదు. అన్ని
కుటుంబములకును ఎంతోకొంతకూలిదొరకి,
బొత్తిగా నిర్వ్యాపారమెక్కడను నుండకుం
డా, పురుషులు సంపాదనపనిని స్త్రీలుగృహ



శ్రీమతి కె. రామసుబ్బమ్మగారు
(ప్రెసిడెంటు, కడప ఎడ్యుకేషనల్ కౌన్సిలు

బాపినీడు శకుంతలా దంపతులు

నిర్వహణపనిని నిర్వహించుచు పురాతనసంప్రదాయజీవనము జీవించుచు సంసారములు చేయుచు ప్రజాభివృద్ధికిని దేశీయసౌభాగ్యమునకును కారకులు కావలెననియే అతని సంకల్పము. అయితే ఈపరిశ్రామిక యుగములో కూలిచేసియో నాలిచేసియో స్వంతముగా తనదీ అని కొంతద్రవ్యమును సంపాదించుకొని స్వతంత్రముగ పురుషుని అధికారమునకు లోనుగాకుండ జీవింపమఱిగినస్త్రీలకిది వెగటుగాదోచినది. 'పెనిమిటి కావలెనా కూలికావలెనా' యనియడిగిన 'పెనిమిటేటికి? కూలిధనమున్నచో నెట్టికొఱంతయు లేక స్వతంత్రముగ జీవించగోరుదు'మను నవస్థలో నున్నా రచ్చటి నారీలోకమెల్లయు. పెండ్లికానిపడుచులెల్లఱును మఱి పెండ్లిచేసుకొనకుండుటకు నిశ్చయించుకొనుచున్నారు. అయిన వారెల్లరును వివాహవిచ్ఛేదనములకు సిద్ధమగుచున్నారు. సాధ్యమైనంతమట్టుగ జర్మనుజనసంఖ్య నెక్కువచేసుకొందామని ఆలోచనలుచేయుచున్న హిట్లరుగారి కిట్టిచర్యలు ప్రాణసంకటముగ నున్నవి. అవివాహితులందరిపై పన్నులువేయ నిశ్చయించుకున్నాడు. స్వతంత్రలై, అవివాహితలై, ధన మార్జించుకొని పన్నులనైన కట్టుకుందురుకాని ఆదేశపు స్త్రీలు వివాహములుచేసుకొని అస్వతంత్రలై, ఆర్జనలేక పురుషులకూడిగముచేయు రోతబ్రతుకును బ్రతుకనొల్లకున్నారు. ఇట్లయినచో జనసంఖ్యావృద్ధి పొందుటెట్లు? దేశము బలిష్ఠమగుటెట్లు? కాకున్నచో అందరికిని పని చూపించుటెట్లు?

దురాశచే పారిశ్రామిక నాగరికతకు వశ్యములై ప్రజల స్వతంత్రవృత్తులను జీవనాధారములను ఒకసారి చెఱచి తమయంత్రనిర్మితవస్తు విక్రయముకొఱకు పరదేశములపై ఆధారపడవలసిన దురవస్థను మీదికి తెచ్చుకున్న దేశములు నిరుద్యోగసమస్యా నిర్మూలనముచేసుకొనలేవు సరేకదా, ఇతర దేశములలోకూడ యిట్టి సమస్యలుదయించుటకు కారణములగును. యంత్రపరిశ్రమలు నిరుద్యోగసమస్యానిర్మూలనము—ఇవి రెండును పరస్పరవిరోధములు. దీపమువెనుక క్రీనీడవలె మొదటిదానివెనుక రెండవది సిద్ధమైయుండును. అమెరికావంటి దేశములో నిరుద్యోగమువలన 1932 లో 23000 మంది ఆత్మహత్యచేసుకొనిరన్న ఇతరదేశములలో నేమి జరుగుచున్నదో యెవ రూహించుకొనగలరు?

వివాహ గౌరవము కృత్రిమమనియు, సంతానమున కక్రమమనునది లేదనియును, ఒకక్రొత్త భావమును రష్యాలోవలె ప్రచారము చేసినచో హిట్లరుగారికి తాను కోరెడి జనాభివృద్ధి సిద్ధించవచ్చునేమోకాని పూర్వసంప్రదాయములను తృణీకరణబుద్ధితో త్రుంచి వేయజాలని జర్మనుసుదతీసంతానమిట్టిసిద్ధాంతముల కంతవేగముగ తలలొగ్గునని తలంపవీలులేదు. హిట్లరుకూడ ఇట్టి బోల్షివిక్కు భావములకు తనరాజ్యమునం దెడమిచ్చుననుకొనలేము. ఇంతకును బోల్షివిక్కు రష్యాలోమాత్రము మతమనిన నంత నిరసనభావముగలదా? పల్లెలలోను చిన్న పట్టణములలోను సాధారణసంసారములలోను పురాతన మతసంప్రదాయములు భయ

భక్త్యభిమానములతో ననుసరింపఁబడుచునే యున్నట్లు విలేఖరుల వ్రాతలవలన తెలియ నగును. విపరీతవిద్యావంతులలోను బొత్తిగా విద్యావాసన లేనివారిలోను మాత్రమిట్టి సిద్ధాంతములును చర్యలును జరుగుచున్నవి. ఈనిరుద్యోగ పారావారమునుండి జర్మనీదేశమును హిట్లరుగారెట్లు తప్పించి జనాభివృద్ధి చేయించగలరో చూడవలసియున్నది.

### శకుంతలాదేవి, బాపినీడుల పరిణయోత్సవము:—

జూనునెల 25 వ తేదినిజరిగిన శకుంతలా బాపినీడులవివాహముసంపూర్ణసర్వసంస్కారవిహీతము. లక్ష్మీదేవదాసుల పెండ్లివలె అది యొకరీతి వర్ణాంతరవివాహము. వధువు తెలగా పిల్ల, వరుడు కమ్మబ్బాయి. మామూలు పెండ్లిండ్లువలె ఇది వీరివారిపెద్దలు ఏర్పాటుచేసి సరిపెట్టినదికాదు. వధూవరు లొకరినొకరు స్వయంవరముచేసుకొని జరిపించుకొన్నది. బాపినీడుగారు తమ పెండ్లికమ్మలను తామే స్వయముగ వ్రాసుకొని మిత్రులనాహ్వానించుకొన్నారు. ఇందు మామూలు బాపనయ్యల మంత్రాలయాకరువుగోల లేమియు లేవు. దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారే దీనికి పౌరోహిత్యమువహించిరి. ఇష్టమిత్రులు రాత్రింబగళ్లు తినుటకేమి ఖర్చయినదో తప్ప మిగిలిన అక్కరమాలిన దుర్వ్యయములేదు. మదరాసు పురప్రముఖులు రామేశం, రామచంద్రరావు రంగయ్యనాయుడు ప్రభృతులు రంగా, కోటిరెడ్డి మొదలగు దూరస్థమిత్రులును కూడవచ్చి వధూవరుల నాశీర్వదించిరి. శుభవివాహవిధానమను పేరుగల వీరి పెండ్లితంతుగ్రంథము పదునాల్గుపుటలుగలది. ఇందు ఈశ్వరప్రార్థనము ఈశ్వరోపాసనము, పాణిగ్రహణము, మంగళసూత్రధారణము, ప్రతిజ్ఞ, సప్తపది, ఆచార్యోపదేశము, మంగళహారతిపాట అను భాగములుగలవు. ముప్పదినిమసములలో సర్వమును ముగిసి ముఖ్యమైన ఉపన్యాసములు చేసుకొనుటకు తగినంత అవకాశము మిగిలినది. ఇట్టి వివాహములు సర్వసామాన్యముగునేని జాతిభేదములును కలహములునుసమసి, స్వయంవరస్వాతంత్ర్యములు వర్ధిల్లి, వివాహవ్యయములు తగ్గి, కుటుంబములు అభివృద్ధిచెందుననుట కెట్టియాటంకమును లేదు. వివాహానంతరము అన్నపూర్ణాదేవిగారు తమకు వ్రాసిన లేఖలను బాపినీడుగారు తమ వధువుకు కానుకగా నొసంగిరి. వివాహానంతరము వధూవరులు అన్నపూర్ణదేవి కుమార్తె ఝాన్సీని తీసుకొని మహాత్ముని చెంత కాశీర్వచనములనిమిత్తమేగిరి. మహాత్ముడు వారి నాశీర్వదించి అన్నపూర్ణాదేవిగారు ఇచ్చిన కానుక అని ఝాన్సీని శకుంతలగారికి చూపి అపెనతిగారాబముగ పెంచుమని కోరిరి. విద్యాధికులును యావనోత్సాహభరితులును, దేశాభిమానులును నగు నీ నూతన దంపతులకు పరమేశ్వరుడు దీర్ఘాయురారోగ్యములనిచ్చి దేశసేవ చేయించునుగాక!

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# లోధ్ర

## యోగ్యతా పత్రములు

శ్రీమతి కవయిత్రి పులవర్తి కమలావతీదేవిగారు, రాజమండ్రి: "నా సోదరి బహిష్టియందు కడుపునొప్పిచే చాల బాధపడుచుండెడిది. తమ "లోధ్ర"ను మూడుబుడ్లను తెప్పించి ఆమెకొసంగితిని. నా చెల్లెలు స్వస్థురాలగుటయేగాకుండ నిరువురుబిడ్డలనుగూడ కనినది. తమలోధ్ర స్త్రీలపాలిటి వరప్రసాదినియనుట కెట్టి సందియమును లేదు. మా స్త్రీలవ్యాధులకు తమ లోధ్ర కల్పతరువువలె కన్పడుచున్నది."

* *

శ్రీమతి ఎన్. కనకమ్మగారు C/o నరసయ్యగారు, వితేజిమాజిస్ట్రేటు, కడిరి:— "మీలోధ్ర 4 పెద్దబుడ్లను సేవించినాను. 4 నెలల నుండి కడుపునొప్పి బొత్తిగ నిలచిపోయినది."

* *

శ్రీమతి బి. ఇందిరాకుమారిదేవి గారు, మెట్టూరు:— "నేను మీ కేసరికుటీరం "లోధ్ర"ను సేవించుచున్నాను. తత్పూర్వము నాకు బహిష్టికాలమందు మిక్కిలి బాధకలుగుచుండెను. ప్రతినెలయును క్రమముదప్పి బహిష్టి యిరువదినదినముల లోపుననే యగుచుండెను. రెండుసంవత్సరముల వరకు ఆసుపత్రియందు పుచ్చుకొంటినిగాని గుణము కనిపించలేదు. పిమ్మట వారు ఆపరేషను చేసుకొమ్మని చెప్పిరి. నేనిష్టపడలేదు. తమ "లోధ్ర"ను నాకు పంపగోరుచున్నాను."

* * *

శ్రీమతి కె. ఇనయగారు, ఎ. బి. మిషన్, సత్తెనపల్లి, గుంటూరుజిల్లా:— "మీ 'లోధ్ర'వలన నాకు మిక్కిలి ఆరోగ్యముకల్గినది. నాకువచ్చుచుండిన దగ్గు నయమైనది."

* * *

శ్రీమతి ఏ. దేవదాసుఅమ్మగారు, ఇ. డబ్ల్యు. ఎమ్. స్కూల్. సాలిన్, మిర్జాబు జిల్లా:— "మీవద్దకొన్న 'లోధ్ర' నాలుగుబుడ్లను ఋతుస్రావదోషములచేత బాధనొందుచున్న స్త్రీలకిచ్చినాను. వాటిని వాడినందున వారిరోగములు కుదిరినవి."

* *

శ్రీమతి ఎడవిల్లి పార్వతమ్మగారు, తిరుచూరు:— "నేను 25 సంవత్సరములు ఋతుసంబంధమగు జాడ్యములతో బాధపడుచుంటిని. ఎన్నియోమందులను వాడినను గుణముగుపడలేదు. తుదకు మీ 'లోధ్ర'ను కొద్దికాలముమాత్రము వాడగా ఆత్యద్భుతముగ రోగనివారణగావించెను."

* * *

శ్రీమతి అమ్ముకుట్టియమ్మగారు, సంగీత ఉపాధ్యాయిని సర్కారుహైస్కూలు, తిరుచూరు, కొచ్చి:— "చాలాకాలముధ అనేకవిధములైన గర్భాశయరోగములవల్ల బాధనొందుచుంటిని. అనేకవిధములైన చికిత్సలనుపొందితినిగాని నివారణముకాలేదు. తమ "లోధ్ర" సేవించిన వారమురోజులలోనే గారడివిద్యవలెను మందు పనిచేసెను. దానిప్రభావమును వర్ణించజాలను."

* * *

శ్రీమతి డి. రాజేశ్వరమ్మగారు, శారదావిలాస్ దిగుపహాండీ, గంజాంజిల్లా:— "నా సహోదరి బహిష్టికాలమందు పరిమితిలేని కడుపునొప్పిచే మిక్కిలి క్షీణించినది. ఎన్నియో ఔషధము లిప్పించితిమిగాని నయముకాలేదు. తుదకు తమయొక్క 'లోధ్ర' కీర్తి విని రెండుబుడ్లు తెప్పించి నా సోదరికి వాడినాము. ఆశ్చర్యకరముగ గుణమిచ్చినది. మరియు ఆమెకొక సుపుత్రిక జననమైనది. ఈ సంతోషవార్త తమకు వెల్లడించుచున్నాము."

* *